## ౭౪ - వ సర్గము

భరతుఁడు కైకను నిందించుట

క. భరతుం డిటు జనయిత్రిని, బహువిధభాషణములఁ ♦ బలికి యిఁక! యం
చురుతరరోషము పైకొన, నురలం గైకేయిఁ జూచి ♦ మది తత్తఱిలన్. ౧

సీ. ఓదుష్టచారిణీ! ♦ యోక్రూరమతి! సముంచితధర్మమున్ విడి♦చితివిగాన
నీతల్లి విధమున ♦ నీవు [1]రాజ్యభ్రష్టురాలవు గమ్ము నీ♦వేళ నన్నుఁ
జచ్చినవానిఁగా ♦ స్వాంతంబునం దెంచి యేడ్చుచుండుము పృథి♦వీశ్వరునకు
మరణంబు శ్రీరఘు♦నాథునకు వనవాసమును సమానముగఁ జే♦సిన కఠోర

తే. హృదయవు గదా ధరాధీశు♦లేని పరమ
ధార్మికుఁడు రాముఁడే రవం♦తయును నిన్ను
నిందచేసిరె? వినుమిఁకె ♦ నీవె యీకు
లము నశింపఁగఁ జేసితి ♦ విమతబుద్ధి!. ౩ 2657

చ. కనుకనె భ్రూణహత్యయును ♦ గాఢతరాఘముఁ జేసినంతదా
ఘనతరపాతకంబు నినుఁ ♦ గాఱియపెట్టెడుఁ గాన నారకం
బునకె చనంగ నీకుఁ దగుఁ ♦ బూజ్యము భర్తృసమానలోకమున్
గనుఁగొనఁ జాలవింక నది ♦ గల్గదు నీకెటుభంగిఁ జూచినన్. ౪ 265

తే. ఘోరకర్మంబునకుఁ బూని ♦ యారఘువరుఁ
గానకుం బంపునంతె య♦ఘంబుఁ జేసి
తీర్చితివిగద కైకేయి! ♦ దీనివలన
నపకృతియు నాకెయయ్యె నే♦మంటివేని. ౫ 2659

తే. సర్వలోకప్రియుండగు ♦ సరసమతిని, భ్రాతనెడఁబాసి యాతని ♦ ప్రాపులేమి
భయము నాకును గల్గె నీ♦వలననైన, ఫలమిదే గాని రాజ్యలా♦భంబు గాదు.

క. నినుఁ బట్టి తండ్రి మృత్యువుఁ, గనియెన్ రాముండు చనియెఁ♦గానకు, నాకున్
జననిందితమగు నయశము, జననీ! నీవలన నిపుడు ♦ సంప్రాప్తించెన్. ౬ 2661

తే. తల్లిరూపంబునన్ నాకు ♦ దాపరించి, నట్టి యోశత్రువా! క్రూర♦మైనబుద్ధి
గల్గి దుర్వృత్తి యమరంగఁ ♦ గాంతుఁ జంపి,నట్టి పాపమతీ! యింక♦నైన నీవు.

క. నాతోడఁ బలుకవలదిట, నీతటి రాజ్యైకకాంక్ష ♦ యెసఁగెఁగదా నీ
చేతస్సున నామాటను, నీతనయుఁడనంచుఁ దలఁప ♦ నీకుఁ జనదుసూ!. ౭

క. కులదూషిణివై తగు నీ, వలనం గౌసల్య వెతలఁ♦బడియె సుమిత్రా
లలనయుఁ దక్కినరాజసతులు దుఃఖముఁ గనిరి నేను♦నుం గనినాఁడన్. ౮

సీ. ధర్మముఖ్యుండైన ♦ తగు పతిం బొందితౌ కేకయభూపతి♦కిన్ జనించి
నట్టిదానవు గావు ♦ నెట్టన నచ్చటఁ బుట్టి తత్కులమును ♦ బాడిచేయ

[1] రాజ్యాద్భ్రంశస్వ-అని మూలము. నీతల్లివలె నీవు నడవులపాలు కమ్మనిభావము.

నెంచిన రాక్షసి ♦ వీవు నిశ్చయ మిద్ది కావున సత్యసం♦కల్పు రాము
నడవికిఁ బంపితి♦వా దుఃఖమున నాదు జనకునిఁ బరలోక♦మునకు సాగ

తే. నంపితివి నీవుఁ బాపకా♦ర్యంబె ముఖ్య
మద్ది యొనరించినందుల♦కైన ఫలము
నాకుఁ బ్రాప్తించె నేను జ♦నకునిఁ జంపు
కొని సహోదరులెడఁబాయ ♦ జనులు దిట్ట. ౧౦॥ 2665

క. జనవితతి కప్రియుఁడనై, తిని నీవో యఘముఁ జేసి ♦ తీరెదు భావం
బున నొప్పుదానవౌటను, జనుదువు నరకమున కెన్ని ♦ సరణులఁ గనిన౯. ౧౧॥

తే. ధర్మమతికిఁ గౌసల్యకుఁ ♦ దనయువిరహ
మును గలుగఁజేసి యేలోక♦మును గనెదవొ
దుష్టురాలా! సమస్తబం♦ధువుల కాశ్ర
యుఁడని పరిశుద్ధసద్వ్రత♦నుఁడని రాము. ౧౨॥ 2667

క. కనఁ జాల వేమొకో జ్యేష్ఠుని నాకుం దండ్రివోలె ♦ శుభదుండని నీ
మనమున నొకమాత్రైనను;, బెనుపాపమె నీదు చిత్త♦వృత్తియగుఁ జుమీ!.౧౩

సీ. తనయుండు జననిక♦క్ర గళనఖకుక్షి పాదంబులను నాసి♦కాదులైన
ప్రత్యంగములను సం♦భవమందుటయెగాక ప్రత్యగాత్మకు సదా♦వాసమునయి
యనురాగసంస్థాన♦మునగు హృదయమునుండియుఁ బుట్టిన ♦ ట్లొప్పువాఁడు
కనుకనే యందఱి♦కంటెను దల్లికిఁ దనయుండు ప్రియతముం ♦ డనఁగఁబరఁగు

తే. బంధువుల్ ప్రియులగుదురు ♦ బహుళధర్మ
ముల నెఱిఁగి దేవతలు సత్కృ♦తులను బడసి
ఖ్యాతిగను కామధేను వొ♦క్కపుడు మున్ను
వృషభయుగళంబుఁ గాంచెను ♦ బృథివియందు. ౧౪॥ 2669

క. తనకులమున జనియించిటుల, దనయులునై హాలము మోసి♦ధరదున్నుచు మూ
ర్ఛను బొందియున్నవానిని, గనె నవి మధ్యాహ్నము దను♦కఁ హాలభరము౯.

ఆ. మోసి దున్ని బడలి ♦ మూర్ఛిల్లుటం గాంచి
పుత్రదుఃఖమునను ♦ బొగిలి బాష్ప
జలసమాకులాక్షి ♦ జలజాతయగుచు రో
దనము చేసె నట్టి ♦ తరుణమందు. ౧౬ 2671

క. దానికిఁ గ్రిందుగ విబుధవి,తానాధిపుఁ డింద్రుఁ డేటకో ♦ తాఁ జనుచుండం
గా నతని తనువుసోఁకెను, దానికనుల నీళ్లు బిందు♦తతిగా నంత౯. ౧౭॥ 2672

క. సురుచిరగంధములై యా, కరణిం దద్బాష్పసలిల♦కణములు పడఁగా
సురపతి పావనసురభియె, కరము౯ దుఃఖించె ననుచు ♦ గ్రహియించె మది౯.

సీ. నాలుగుప్రక్కల ♦ నాకాధిపతిచూచి యాకసంబున దీన♦మై కరంబు
వెతలఁగుందుచుఁ బలు♦విధముల నేడ్చుచు నున్నయాసురభిని ♦ నొకటఁగాంచి
వజ్రపాణియగుచు ♦ వాసవుఁ డార్తినిఁ గుందు యశస్విని ♦ గోర్కెలొసఁగు
నాకామధేనువు ♦ నవ్విధినుండంగ నుద్విగ్నుఁడై కర♦యుగము మోడ్చి
తే. పలికె నీరీతి మావారి♦వలన నీకుఁ, బెనుభయము గల్గలేదుగా ♦ వెతలఁబడిరి
దేల? నీవిట్టులందఱి ♦ మేలు కోరు,దానవుగదా వచింపుమా! ♦ మానకింక.

క. అని మతిమంతుఁడు సురపతి, యనుకంపం బల్కినట్టి ♦ యప్పలుకులకున్
మనమలర వాగ్విశారదుఁ, డనఁదగు నింద్రునకు ధీర♦యై యా ననియెన్.

క. అనఘా! యిట్టి యమంగళ, మనఁనది లేకుండుఁగాక ♦ యసురసమూహం
బున నెవరివలననున్ భయ, మనునదియే కల్గదెప్పు♦డైన సురేశా. ౨౨౫

క. తనయులు కష్టావస్థం, గనుచుండుట ధరణియందుఁ ♦ గాంచితి దానం
గనియెద శోకము తెలిపెద, వినుమా కర్షకుఁడు పూన్కి ♦ వివిధవిధములన్.

క. పీడించుచుండఁగాఁ బై, వేఁడివెలుఁగు నాతపమ్ము ♦ వెలయుఁగ దానన్
వాడి కృశించుచు వెతలం, గూడిన నాయీ కుమార♦కులకు వగచెదన్. ౨౮

క. ఈయిద్దఱు పుట్టిరి నా,కాయమ్మునుండి యట్లు ♦ కావున బరువున్
మోయఁగఁ జాలక పీడితు,లై యార్తిని బొగులుచుంట ♦ కాత్మఁ దపింతున్.

క. తనయునకు సమముగాఁ బ్రియుఁ, డనఁదగువాఁడెవ్వఁడు గలఁ ♦ డవనినిజంబం
చును బల్కెఁ; బెక్కువేలగు, తనయులు లోకముననిండఁ♦దాఁ గనియుండున్.

తే. కొడుకు లిద్దఱు కష్టముల్ ♦ గుడుచువార
లని తపించుచు నేడ్చు న♦య్యావుచర్యఁ
గాంచఁగాఁ బుత్రకునికంటె ♦ నెంచ నధికుఁ
డితరుఁడెవ్వఁడు లేఁడని ♦ యింద్రుఁ డెంచె. ౨౯ 2681

సీ. అసమశీలంబున ♦ నలరి సమృద్ధిచేఁ దనరి శాశ్వత సుగు♦ణనికరమున
నొప్పి సృజింపంగ ♦ నూహించినంతనె యుద్దానిఁ జేయు శ♦క్త్యతిశయమున
నమరిన యా నిర్జ♦రార్చితధేనువు భామినీపురుషస్వ ♦ భావమైన
వ్యాపారమున జగ♦ద్వ్యాపారమును గోరి వేనవేలుగఁ దాను ♦ సూనులఁగని
తే. పరఁగునది యయ్యు నాత్మజ♦ద్వయము సెతఁ
బడుటఁగని యేడ్చుచున్నదే ♦ పరమసుగుణ
ఖనియయిన రామచంద్రు నొ♦క్కనుతుఁ గనిన
యట్టి కౌసల్యసుతుఁ బాసి ♦ యెడలకున్నె? ౨౦ 2682

క. ఇది చెప్పవలెనె వేలుగ, సుతతినుణి నామె విగత♦సుత నొనరిచితీ
వదయతఁ గావునఁ గైకా!, యిది వినుమా! వెతలఁగందు♦విహాపరములలోన్.

క. నాయన్నను రాముని నా, నాయన నీరీతిఁ బూజ♦నములఁ దనుపుచుఁ
వే యశము వర్ధిలంగాఁ, జేయుదు నే నింకమీఁద ♦ సిద్ధమిది సుమీ'. 30

క. [1]విను పూజావిధిఁ జెప్పెద, వనికిం జని రాము మహిత♦బలుఁ గౌసల్యా
తనయునిఁ దోడ్తెచ్చెద నాతని మాఱుగ మునినిషేవి♦తము వనిఁ జొత్తుఁ.

తే. పాపసంకల్పురాల! యీ ♦ పౌరులెల్ల
నశ్రుకంఠంబులన్ నన్ను ♦ నార్తిఁ జూడ
నిట్లు నీవాచరించిన ♦ యిట్టిహోఘ
మును భరించుచు నుండంగ♦లనె పురమున. 32 2686

తే. అగ్నియందైనఁ బడు దండ♦కాటవికిని
జను మటులు కాకయున్న గొం♦తునకుఁ ద్రాడుఁ
గట్టుకొని మృతిఁ బొందు మిం♦క నివి తప్ప
వేఱు గతిలేదు చూడఁ బా♦పివగు నీకు. 33 2687

క. నేనో సత్యపరాక్రముఁడౌ నాయన్నరఘురాముఁ ♦ డవనిం బొందం
గా నపగతపాపుఁడనై, నానిశ్చయసిద్ధినిఁ మ♦నంబునఁ గాంతుఁ. 34 2688

చ. అని వచియించి యాతఁడు మ♦హాత్తరకోపమునొంది యూర్పులన్
ఘనముగఁ బుచ్చుచున్ భుజగ♦కల్పుఁడుగాఁ గనుపట్టి యంతటన్
వనమునఁ దోమరాంకుశవి♦బాధితమై ఘనగర్తపాతముం
గను గజమట్లు నేలఁబడి ♦ క్ష్మాపతిపుత్త్రుఁడు రక్తనేత్రుఁడై. 35 2689

తే. అంబరముపీడి నాభర♦ణంబులెల్ల, నవనిపైఁ [illegible] సన♦మైన నెపుడు
డుమును ద్రెళ్లెడు నింద్రధ్వ♦జంబురీతి, నవనిపైఁ [illegible] భరతుఁడు.

డెబ్బదినాలుగవ సర్గము సంపూర్ణము.

౭౫ - వ సర్గము.

—భరతశత్రుఘ్నులు కౌసల్యను జూడఁబోవుట—

శా. ఎంతోసేపటి కెట్లొ తెల్విఁగని యిం♦కేసుందరుం డత్రుసం
క్రాంతాక్షుండయి వీర్యవంతుఁడగు నా♦క్ష్మానాథపుత్త్రుండు న
త్యంతంబున్ వెతఁబొంది [2]దీనయగుచుం ♦ దానున్న కైకన్ ఘృధా
స్వాంతుండై కని [3]మంత్రులెల్ల వినఁగాఁ ♦ బల్కెన్ గరోరోక్తులన్. ౧

ఉ. కోరఁగలేదు రాజ్యమును ♦ గోర్కి నొకప్పుడు, నేను రాజ్యముం
జేరఁగ యోజనల్ జనని♦చెంత నొకప్పుడు చేయలేదు త

---

1 విను పూజావిధిఁ జెప్పెద - అనునది 'భ్రాతురపచితిమాహ' అను వ్యాఖ్యను ననుసరించి యొఱుఁగనలయు. 2 దీనా మద్వీక్ష్య మాతరమ్-అని మూలము. 3 భరతాగమనమును విని యచ్చటికి సుమంత్రాదులు వచ్చిరనుట వ్యాఖ్యానాభిప్రాయమని తెలియఁదగు.

దుష్కరమణుండు రాజ్యరమఁ ♦ బొందెడు నట్లుగ నన్నుఁ జేయఁగా
సారవిచారమేకరణి ♦ నల్పెనొ దాని నెఱుంగ నేమియున్. ౨ 2692

చ. అనుజునితోడ దూరమగు ♦ నట్టి యొకానొక దేశమందు నుం
టను దమరే యెఱుంగుదుర ♦ టన్ వసియించుటయే మహాత్ముఁడై
తనరెడు రామచంద్రునకు ♦ దారుణకాననవాస మబ్బుటల్
మనమున నేనెఱుంగ నొక ♦ మాటును నిశ్చయము మిద్ది చెప్పెదన్. ౩ 2693

క. సీతకు లక్ష్మణునకు నే, రీతిగ వనవాసమబ్బె ♦ రీతిం దానిన్
జేతస్సున నేఁ దెలియను, నీతల్లియె కారణమగు ♦ నిన్నిటి కిచటన్. ౪ 2694

చ. అని సుహితాత్ముఁడౌ భరతుఁ ♦ డార్తి విలాపము చేయుచుండఁ ద
త్స్వనమును రామమాత విని ♦ సాధ్వి సుమిత్రను గాంచి యిట్లనున్;
వినుమదె క్రూరకృత్యమును ♦ వింతగఁ జేసిన కైకపుత్త్రుని
స్వనమును, వచ్చినాఁడతఁడు ♦ వాఁడు తలంపఁగ దీర్ఘదర్శియౌ! ౫ 2695

క. కనుఁగొనఁ గోరెద నాతని, ననుచున్ వ్యథ నన్నె మాటి ♦ యతిమలినాంగం
బునఁ జిక్కియున్న రాముని, జనని సుమిత్రకును జెప్పి ♦ చయ్యన [1]వడఁకెన్.

తే. వడవడ వణంకుచున్ దన ♦ స్వాంత మట్టె
సొమ్మసిల్లఁగఁ దాఁ బయ ♦ నమ్ము చేసె
నపుడు శత్రుఘ్నుతోడ రా ♦ మానుజుండు
చనియెఁ గౌసల్యయింటికి ♦ సత్వరముగ. ౬ 2697

సీ. భరతశత్రుఘ్నులు ♦ పరమదుఃఖార్తులై క్షితిపైనిఁ బడి నష్ట ♦ చేతనయయి
విలపించు నమ్మన ♦ స్విని నార్యఁ గౌసల్యఁ గని చేరఁబోయి దుః ♦ ఖమునఁ గుంది
యేడ్చుచు నాభ్రాత ♦ లిద్దఱు కౌఁగిటఁ బొదిగి రా కౌసల్య ♦ పొగులుచుండి
భరతుని గని యిట్లు ♦ పల్కె రాజ్యముఁ గోరితత్ప్రాప్తికై మదిఁ ♦ దాప మొందు

ఆ. నీకు రాజ్యమిదిగొ ♦ నిష్కంటకంబయి, కైకదైన క్రూర ♦ కర్మమునను
శీఘ్రకాలముననె ♦ సిద్ధించె నక్కటా, క్రూరకృత్యము గనఁ ♦ గోరు కైక.

క. శ్రీరాముని నా ప్రియసుతుఁ, జీరాంబరములు ధరింపఁ ♦ జేసి యెలమితోఁ
గ్రూరారణ్యములం దగఁ, జేరం జేసె నిఁక ఫలము ♦ చెప్పుము దానన్.

క. ఈపని చేయకయుండియు, నీపగిదిన్ రాజ్యమొంద ♦ నేల దగదొ? న
న్నేపగిదినైన నటవికి, [2]వే పంపం దగును నృపత ♦ వెలయుటకతనన్. ౧౨౫

క. కనకమయాంగుఁడు సుయశం, బునఁ దనరెడు నాసుతుండు ♦ మొదలు నెచటన
వ్వనికిన్ ననుఁ బంపందగు, విను నేనె సుమిత్రఁ గూడి ♦ వెడలెద వనికిన్.

---

1 వేపమానా-అనిమూలము. రామవిషయకదుఃఖమునను, కైకవలనిభయమునను, ముందేమి భరతునివలనఁ జేటు వాటిల్లునో యనువిచారమునను వడఁకెనని భావము. 2 వే-వేగ-అనునివి ద్రుతాంతములు గావని యెఱుంగఁదగు. ఇప్పటివారలోఁ గొందఱు ద్రుతాంతము లనుచున్నారు.

*తే. దశరథేశుని యగ్నిహో♦త్రములఁ గనువు
వారక గ్రహించి సుఖముగఁ ♦ జేరఁబోదుఁ
దనయుఁ డున్నట్టి చోటికిఁ ♦ దడయ కిపుడె
యనుచు భరతునకధిపు దే♦హంబునందు. ౧౪ 2702

క. ఏమే నధికారము లే, దేమాడ్కిం గనిన సంచు ♦ నీయర్థమ్మున్
దా మనసులోనఁ దలఁచుచు, నీమాడ్కిం బల్కి మఱియు ♦ నిట్లని పల్కెన్.

క. పురుషవ్యాఘ్రము రాముం, డరణ్యముల నెందుఁ దపము ♦ నతినిష్ఠం జే
యు రతిఁ గని యున్నవాఁడో, భరతా! నీవైనఁ జెప్పు ♦ వని నద్దానిన్. ౧౫

క. వితతంబై ధాన్యసమం,చితమై హస్త్యశ్వరథవి♦చిత్రతరంబై
యతిశయమగు నీరాజ్యము, హితముగఁ గైకేయి నీకు ♦ నిప్పించెఁ జుమీ!.

మ. అని యీలాటి కఠోరవాక్యతతి నా♦యాసంబునన్ దూఱఁగా
విని యేపాపమెఱుంగకుండుటను వే♦నే దుఃఖవార్తావళిన్
వినుటన్ దుఃఖితుఁడైన వాఁడగుట నా♦న్వ్రశ్నవ్రణాగ్రంబు [1]సూ
చిని నొక్కంబడిపట్టు లప్పలుకులన్ ♦ జిత్తమ్ము శోషిల్లఁగన్. ౧౭ 2706

క. మనమున నేమియుఁ దోఁపమిఁ, జని యల కౌసల్యపాద♦సరసిజములపై
వనటం బొందుచుఁ బడి [2]చేతన తప్పట నట్టె యుండి ♦ తనకుం దానే.

తే. తెలివి వచ్చుటచే నంతఁ ♦ దెప్పిఱిల్లి
బహువిధంబుల నేడ్చు న♦ప్పావనమతిఁ
గాంచి కైమోడ్చు నుదుటఁ గీ♦లించి యూరడిం
పలికె నిట్లని తల్లితో ♦ వ్యసనపడుచు. ౧౯ 2708

తే. ఆర్య! రామునియందు నా♦కధికభక్తి
ప్రీతియును గల్గుటెఱుఁగవే ♦ రామునభి
షేకమును నేనెఱుంగనేఁ ♦ జేయనేమి
పాపము నిఁకేల నిందించె ♦ దీ పగిదిని. ౨౦ 2709

భరతుఁడు శపథములు చేయుట

చ. వనమునకున్ రఘూత్తముఁడు ♦ పండితసంస్తుఁడు సత్యసంధతం
దనరెడువాఁడు పోవఁగ నె♦వన్ దగ నెవ్వఁడు సమ్మతించెనో
జనని! యతండు దేశికుని ♦ సన్నిధి సద్విధి నేర్చినట్టి బు
ద్ధిని దగువాఁడు గాక కుమ♦తిం దగువాఁ డగుఁగాక యెప్పుడున్. ౨౧ 2710

* ఇందు నగ్నిహోత్రము పెద్దభార్య యధీనమున నుండఁదగినది. భరతునితోఁ గౌసల్య సంస్కారముకూడ నీవు తండ్రికిఁ జేయఁగూడదని చెప్పుట కైకసంబంధముచే భరతుఁడుగూడఁ బాపాత్ముఁడే యగునని సూచించుట కని తెలియనగు. 1 సూచిని=సూదితో. 2 చేతన (ఇది యాకారాంత స్త్రీలింగము)=తెలివి.

సీ. ఎవఁడు రాముఁడు వని♦ కేఁగ సమ్మతి నొందె నాతఁడెంతయు నీచ♦జాతులకును
సేవకుండును; సర♦సీరుహమిత్రున కభిముఖుఁడై మూత్ర♦మటు పురీష
మును విడిచినవాఁడు,♦ [1]దనపథంబునఁ నావు నిదురించుచుండఁ ద♦న్నినదురాత్ముఁ
డునగుఁ గాక; యెవండు♦మనమున రాముని వనవాసమునకొప్పు♦తినిగనునతఁ
తే. డాత్మభృత్యునిచేఁ బెద్ద♦దైన పనిని
జక్కఁ జేయించుకొని భృతి ♦ సరిగ నియ్య
కతని కష్టంబు వ్యర్థమౌ♦నట్లు చేయు
భర్తకగు పాపముం బొందుఁ ♦ బల్కు లేల. ౨౩ 2711

సీ. మనుజులనెల్లను ♦ దన పుత్రకులభంగి గనుచు పతికి ద్రోహ♦మును నొనరుచు
వానికిఁ గల్గు పా♦పము గల్గుఁగాక; షడ్భాగము కప్పముఁ♦దాఁ గొని మను
జులఁ గావకుండు రా♦జునకుఁ గల్గెడునట్టి యఘము గల్గుంగాక;♦యజ్ఞమందు
సాధువ్రతోపవా♦సములఁ జేసెడు ఋత్విజులకు దక్షిణ లియ్యఁ♦గలనటంచు
తే. శపథమును జేసి కార్యంబు ♦ జరిగిన తరు
వాత లేదని చెప్పెడు ♦ వానికొదవు
నఘము గలుగును గాక; యో♦యంబ! రాముఁ
డడవి కేగుట కెంచిన ♦ యతని కిపుడ. ౨౬ 2712

క. కరిహయరథ సంకులమై, శరవితతుల నాకులమగు ♦ సమరంబున నే
పురుషుండు వీరధర్మ, స్ఫురణము విడి పాఱునతనిఁ ♦ బోలు నితఁడు సూ!.

మ. మతిమంతుండగు దేశికుండు వరసూ♦క్ష్మస్ఫారతాత్పర్యసం
యుతవేదాంతరహస్యశాస్త్రము శ్రమం♦బొప్పంగఁ బోధింప నిం
దితచిత్తంబున దానిమానెడు కుబు♦ద్ధింబోలు, నేవాఁడు రా
ట్నుతుఁ డిప్పట్టునఁ గానకుం జనఁ దలం♦చున్ వాఁడు నిక్కంబుగన్. ౨౮

సీ. ఎవఁడు రాముఁడు వని♦ కేగఁ దలంచునో యతనికిఁ బ్రజలబా♦హ్యుండగుచుఁ
జంద్రార్కతుల్యతే♦జస్కుఁడై రాజ్యంబుఁ గైకొని పేరోల♦గమున యందు
సింహాసనంబునఁ ♦ జేరిన శ్రీరామచంద్రునిఁ గను నదృ♦ష్టంబు గలుగ
కుండునుగాక; యె♦వ్వండు పాయసమును నుఱితిలాన్నము ఛాగ♦మాంసగుడము
తే. లను బితరులకు దేవత♦లకు నతిథుల
కును సమర్పణముం జేయఁ♦గోరకె తను
వ్యర్థముగ నిర్దయుండయి ♦ వరుసఁ దినెడు
వానికిం గల్గునట్టి పా♦పంబు గలుగు. ౨౯ 2715

క. తలిదండ్రులు లోనగు పెద్దల నవమానించినట్టి ♦ దారుణపాపం
బులఁ బొందు రామునిం గా,నల కేగఁ దలంచునట్టి ♦ నరుఁడు జననిరో!. ౩౦

1 తనపథంబున నొక ట్టిశేయుస్థలమున.

సీసమాలిక:—

అడవికి రాఘవుం ♦ డరుగుట కెవ్వాఁడు సమ్మతించునొ యట్టి ♦ జనుఁడు ధేను
వులఁ బాదమునఁ దన్ను ♦ బుద్ధిహీనునివంటి వాఁడును; దానయి ♦ స్వగురువులను
నిందఁ జేసినయట్టి ♦ నీచసముండును, [1]స్నిగ్ధులకుం జెడ్డ ♦ చేయఁ దలఁచి [న
నట్టి వాఁడునగుఁగా; ♦ కంబరో మఱియును వనతోడఁ బ్రియపుత్రుఁ ♦ డనునయము
విశ్వాసమున నొక్క ♦ విషమాపవాదంబు నేకతంబునఁ జెప్ప ♦ నేర్పడంగ
దానిని వెలిపుచ్చు ♦ దారుణకర్మునివంటి వాఁడగు; మఱి ♦ పరులుచేయు
నుపకారమునకుఁ బ్ర ♦ త్యుపకృతి నొనరింప నట్టివాఁడును, బరు ♦ లరిసి చేయు
నుపకృతి మఱచిన ♦ యురుపాపి సముఁడును; సజ్జనవర్జిత ♦ జనునివంటి
వాఁడును; దుర్మతిఁ ♦ బడసిన యట్టిఁడౌ మనుజసముండును; ♦ ఘనతరాఘ
మాచరించియు దాని ♦ కయిన ప్రాయశ్చిత్తమును జేసికొనక, సి ♦ గ్గును త్యజించి
చరియించు నరునకు ♦ సముఁడును నయి, యెల్లవారిచే ద్వేషింపఁ ♦ బడినవాఁడు
నగు; మఱియును స్వగే ♦ హమునఁ బుత్రకళత్ర భృత్యయుతుండయి ♦ ప్రీతినిడక
తాను మాత్రమె సమృ ♦ ద్ధంబగు నన్నంబుఁ దినునొ యవ్వానికిఁ ♦ గనఁదగునఘ
మొందు; సవ్వంశంబు ♦ నందుఁ బుట్టిన కన్యకను బెండ్లియాడక ♦ ఘనతరాగ్ని
హోత్రాదిధర్మకా ♦ ర్యోన్నతి మానుచు ననపత్యుఁడయి మృతుం ♦ డగునుగాక;
మఱియును భూమిజా ♦ మండితుండౌ రాముఁ డడవికిఁబోవంగ ♦ నాత్మనెవ్వఁ
డాదృతిఁ గనునట్టిఁ ♦ డల్పాయువును బొంది కడుదుఃఖితుండయి ♦ కాంతయందు
సంతతిం బడయఁగాఁ ♦ జాలకుండును గాక పార్థివ వనితను ♦ బాలు వృద్ధు
నెవ్వనిఁ జంపిన ♦ నే పాపమొదవునో నేవకుఁ బోషింప ♦ కే విడిచిన [ను
నేయఘమంటునో ♦ యాయఘమ్మును బొందుఁగాక మాంసము లత్తు ♦ కను, విషము
మద్యలోహాదిస ♦ మస్త దుర్వస్తువులను నమ్మి యాద్రవ్య ♦ మునఁ గుటుంబ
పోషణమును జేయు ♦ భూరిపాపాత్మునివంటివాఁడగుఁగాక; ♦ పగతురడగు
పక్షమ్మునం గడు ♦ భయదయుద్ధముచెల్ల భయపడి తానొగిఁ ♦ బాఱునపుడు
చంపంగఁ బడుఁగాక; ♦ సారహీనంబగు తలపుర్రెఁ గరమునఁ ♦ దాల్చి మలిన
జీర్ణవస్త్రముఁ గట్టి ♦ క్షితిపయి నున్మత్తుపగె బిచ్చమెత్తుచు ♦ నెలమి దూల
సంచరించును గాక; ♦ నారాయిఁ ద్రావుచుఁ గామాదులకుఁ జిక్కి ♦ కాంతలందు
సతతంబు లోలుఁడై ♦ సాధ్వసమ్మతమగు జూదమాడుచుఁ బరి ♦ శుద్ధవృత్తి
హీనుఁడై చనుఁగాక; ♦ మానితధర్మంబుసను మది నిల్పక ♦ యనుదినంబు
ధర్మంబుఁ జేయుచుఁ ♦ దగిన ప్రతిగ్రహీతలకు నీయక యపా ♦ త్రులకు భూరి
దానమ్ము చేయుచుఁ ♦ దానుండువాఁడగుఁ గాక; శ్రీరాముండు ♦ కానకేగ

1 స్నిగ్ధులు=మిత్రులు. ఈస్నిగ్ధశబ్దమే యిపుడు స్నేహితుఁ డనుపేరఁ బరఁగుచున్నది. దీనిని సాధించుటకుఁ గ్రొత్తపాణిని ధరణిఁ బుట్టవలయునేమో.

సన్మతించినవాని ♦ సకలవిత్తంబులు చిరసమార్జితములు ♦ చిత్తతృప్తి
కరములు చోరుల ♦ కరగతములు నగుఁగాక, సూర్యోదయ♦కాలమందు
నస్తమించెడు తఱి ♦ నావృతి నిద్రించు నట్టివానికిఁ గల్గు ♦ నఘము గలుగుఁ
గాక; గేహంబులు ♦ గాల్చినవానికి గురుకళత్రంబును ♦ గూడువాని,
కత్యంతమిత్రుని ♦ కపకృతిఁ జేసిన వానికిఁ, గలుగు పా♦పంబు గలుగుఁ
గాక; దేవతలకుఁ ♦ గడుభక్తిఁ బితరుల కంబకుఁ దండ్రికి ♦ నరసి సేవఁ

ఆ. జేయనట్టి జనున♦కే యఘమబ్బునో, దానిఁ బొందుఁగాక; ♦ తాను వేగ
సాధుజనులచేత ♦ సంత్యజింపంబడుఁ, గాక; సాధువినుతిఁ ♦ గనక యతఁడు.

క. సుమతులు చేసెడు సత్కర్మములకు దూరుండు నగుచు ♦ సుహిమ నుండుంగా
క; మఱియు దీర్ఘభుజుండయి, సుమహితవక్షుఁడగు రాము♦శుభగుణనిలయున్.

క. వనికిం బంపఁగ సమ్మతిఁ, గనునో యవ్వాఁడు తనను ♦ గనుతల్లికి సే
వను మాని యధర్మంబును, గనుచుండుంగాక పృథ్విఁ ♦ గడు దూష్యుండై.

చ. తనయులఁ బెక్కురం గనుచు ♦ ద్రవ్య మొకించుక లేకయే జ్వరా
దినిఖిలరోగయుక్తుఁడయి ♦ తెల్లముగా సతతంబు దుఃఖముం
గనుచుఁ గృశించుఁగాక; మఱి ♦ క్ష్మామహాసనమందునుండి త
న్ననులను బైకి నెత్తికని ♦ ఘనసుతుల్ దగఁ జేసి దీనతం
గనుచును వేఁడుయాచకుల ♦ కాంక్షల వ్యర్థము చేసి నట్టిఁడౌ. ౫౦ 2720

చ. అనిశ మధర్మమార్గమున ♦ యందుఁ జెలంగుచు దుష్టుఁడౌ మ పం
చనమున నొప్పి శీలమును ♦ జయుఱ్యనఁ బాసి నృపాలభీతితో
మనమూ వగం గనం బ్రదుకు ♦ నుత్తృనితో సముఁడౌ; రఘూద్వహున్
వని కనుపంగ నెంచునో యె♦వండు నిజంబుగ నాతఁ డంబరో:. ౫౧ 2721

క. అతివ ఋతుస్నాత పత్ని, ప్రణ ఋతునియమముల నెన్ని ♦ వచ్చి నిలువ దు
ర్మతి నెవఁడు కలయికం దత్సతిఁ బన్పుఁడో యబ్బుదుష్య♦సముఁడౌ నితఁడున్.

ఆ. ధర్మనిరతి మాని ♦ తా మూఢుఁడై పర
పత్ని మాని యొరుని♦పత్నిఁ గూడు
నట్టి వాఁడే యగు మ♦హాత్ముఁడు రాముఁడు
వనికిఁ బోవఁ బ్రీతిఁ ♦ బరఁగునతఁడు. ౫౩ 2723

తే. నష్టసంతానుఁడౌ విప్ర♦వకుని గలుగు
పాపముం బొందు శ్రీరాము♦వనసివాస
మునకు సమ్మతి నొందిన♦మనుజుఁ; డమల
పానయోగ్యజలంబులఁ ♦ బాడుచేయ. ౫౪ 2724

క. ఒరులకు విషముం బెట్టఁగ, నురుతరపాప మెది యబ్బు ♦ నొగిదానిం బొం
దు; రఘూద్వహుండు వనముల, కరుగుటకున్ సమ్మతించు♦నట్టి కుమతియున్.

క. కలుషేంద్రియుఁడై సద్విప్రులకుం జేయుటకుఁ దగిన♦పూజఁ జెఱచును
జ్వలపాపియగును బదిదినములు వెళ్లని దూడయావు♦మోదము తనరన్.

ఆ. పట్టి పాలు పిదుకు ♦ పాపాత్ముఁడౌ; నంబ!
తన గృహంబునందుఁ ♦ ద్రాఁగఁ దగిన
జలములుండి దప్పిఁ ♦ గలవిలపడువాని
కిడక మోసపుచ్చు ♦ జడుఁడగుఁ జుమి!. ౫౭ 2727

క. ఇరువురు వాదించెడు తఱి, సరిగాఁ దత్కలహమార్పు ♦ శక్తి గలిగి య
త్తరుణమున దానిఁ దీర్పని, పురుషుఁడు పొందెడునఘంబుఁ♦బొందెడుఁజుమ్మీ!.

క. అని పలికి రాజపుత్త్రుఁడు, తనయుని నెడఁబాసి పతిని ♦ దాఁ బాసి తగన్
వనటం గుందెడు కౌసల్యను దేర్చుచునే మహోర్త్రి ♦ నవనిం బడియెన్. ౫౯

ఆ. ఆతఁ డిట్లు దుస్స♦హములగు శపథంబు
లాడుచున్ మహోర్త్రి ♦ నలజడిఁబడి
చేతనంబులేక ♦ క్షితినుండఁ గౌసల్య
భరతుఁ గాంచి యిట్లు ♦ పలికె నపుడు. ౬౦ 2730

క. భరతా! శపథంబుల నీ, కరణిన్ నీవొనరుపంగఁ ♦ గనుచుండిన నా
కురుతర మయ్యెను దుఃఖ,[1]మ్మరిగెడు ప్రాణముల నిల్పి ♦ యలరెద వీవున్. ౬౧

తే. భాగ్యవశమున నీవగు ♦ స్వాంత మిప్పు
డన్ననే యనువర్తించు♦నట్టి సాధు
ధర్మముననుండి చంచల♦తం బొరియదు
సత్యశపథుండవీవు ల♦క్ష్మణుని భంగి. ౬౧॥ 2732

క. కనుకన్ సత్పురుషులకగు, ఘనలోకము నొందఁగలవు ♦ గాదిలిపుత్త్రా!
యని పలికి భ్రాతృవత్సలుఁ, డనయు మహాబాహు నంక♦తలమునఁ జేర్చెన్.

తే. అంకమునఁ జేర్చి కౌఁగిట ♦ నదిమి పరిపరి
దుఃఖమొందుచు నశ్రు నా♦తో యుఁడంతఁ,
యిట్లు శపథంబులాడుచు ♦ నెంతొ శోక
మునఁ దపించుచు నేడ్చు నా♦ఘనమతి కట. ౬౩॥ 2734

తే. శోకసంరోధమున మూర్ఛ ♦ నాకరణిని
గనుటవలనను జిత్తంబు ♦ కలఁతనొందె
నతఁడు పలవించి స్పృహతప్పి ♦ యాత్మశక్తిఁ
బోవ క్షితిఁబడి వగఁ గుందఁ♦బోయె రాత్రి. ౬౫ 2735

డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

1 ప్రాణానుపరుణత్సి మే-అనిమూలము. పోవుప్రాణముల నిల్పుచున్నావే యనిభావము.

## ౭౭ - వ సర్గము.

-భరతుఁడు తండ్రికి సంస్కారము చేయుట.-

*క. పలికెడు వారలలో నే,ర్పలవడ శుభవాక్యములను ♦ బలుకు వసిష్ఠుం
డల భరతు శోకతాపం,బులఁ బొగిలెడు వానిఁ గాంచి ♦ పూజ్యభణితులన్.

చ. పలికె మహాయశా! మనుజ♦పాలకపుత్ర! నితాంతచింతచేఁ
[1]బొలుపడనేల చాలు నిటు♦పోలునె, దుఃఖముఁ బాయవయ్య మం
గళ మగుఁగాక నీకు; నృప♦కాంతుఁడు స్వర్గముఁ జేరుదేన ని
ర్మలతరతత్క్రియావితతి ♦ మానితరీతిని జేయు మింపెఁకన్. ౨ 2737

చ. అనియె సమస్తధర్మవిదుఁ♦డా భరతుండు వసిష్ఠుపల్కులన్
విని మది ధైర్యమొంది పృథి♦వీపతి కంతటఁ బ్రేతకృత్యముల్
మునివరు నాజ్ఞఁ జేసె; నృప♦ముఖ్యుని నంతట నూనెతొట్టినుం
చినకతనన్ యథాస్థితిని ♦ జెందినవానిని నెత్తి భూమిపై. ౩ 2738

చ. ఉనిచిరి నూనెనుంచుటనె ♦ యొప్పుగఁ బచ్చనిచాయమోముతోఁ
గనఁబడి దేహభాగములు ♦ గాఁచియు నొంపకయుంట నిద్రవో
యినగతినుండఁగా నతని ♦ నెంతయు రత్నము లొప్పు పాన్పునం
దునిచిరి భృత్యు; లాజనకు ♦ నొయ్యనఁ గాంచి నితాంతచింతచేన్. ౫ 2739

చ. భరతుఁడు దుస్సహార్తిఁ గని ♦ పల్కెను రోదనవాక్కులొప్ప భూ
వర పరదేశముం గనఁగఁ ♦ బంపిన నే నటనుండి యిప్పురీ
వరమును జేరకుండఁగనె ♦ భావుకధర్మవిదున్ రఘూత్తమున్
గురుబలశాలి లక్ష్మణుని ♦ గూడ వనంబుల కంపి యివ్విధిన్. ౬ 2740

క. సురపురి కేగఁగ నీవును, గరుణీయంబగు పూను ♦ కారణమేమో
ధరణీశా! శుభకార్యము,లరయం గను పురుషసింహులు ♦ లలితమనస్కుల్. ౬౹

తే. రామచంద్రుని విడిచి ని♦ర్భరవిచార
మగ్నులమయి తపించెడి ♦ మమ్ము నెల్ల
విడిచి యెటుపోయితివి? తండ్రి ♦ విశ్వపతివి
గాఁ జెలంగెడి నీవు స్వ♦ర్గమున కరుగ. ౭ 2742

క. వనములకున్ శ్రీరాముఁడు, చన యోగక్షేమములను ♦ సంతత మిప్పు
త్తనమునఁ గనుఁగొనువార లిఁ,క నెవ్వరున్నారు? నిన్నుఁ ♦ గానమి నిచటన్.

క. ధరణి యిది విధవయ్యె యే,కరణిని రంజిలక చూడఁ♦గాఁదగ, దీపూ
ర్వరమును శశిఁ బాసినరా,త్రివలె నినుఁ బాసియున్న♦ది యనుచుఁ దోఁచెన్.

క. అని విలపించుచు దీనతఁ, గను మనమున నున్న భరతుఁ ♦ గని పల్కె మహా

---

* ఉవాచ వదతాం శ్రేష్ఠో వసిష్ఠ శ్శ్రేష్ఠవా గృషిః-అనిమూలము. 1 పొలుపడనేల=తలఁగనేల అనియర్థము.

మునియా వసిష్ఠుఁ డిట్లని, ఘనబాహూ! యిపుడు రాజ♦కాంతునకీవున్. ౧౦

తే. ప్రేతకార్యంబు లెవ్వెవ్వి ♦ విధిహితముగఁ
జేయఁగాఁ దగునో వానిఁ ♦ జింతమాని
త్వరగ నేమఱకయ చేయఁ ♦ దలఁపు మనిన
నట్లె యని వానిఁ బాటించి ♦ యాతఁ డంత. ౧౧ 2746

సీ. వేగంబు మీఱ ఋ♦త్విక్పురోహితులనాచార్యులఁ గృత్యముల్ ♦ జరపుఁడంచుఁ
ద్వరపెట్టె రాజసౌ♦ధంబున లోపల శవముంట వెలుపలి ♦ స్థలమునకును
దెచ్చి యుంపంబడు ♦ దివ్యాగ్నిహోత్రమ్ములను గార్హపత్యాదు♦లను బురోహి
తులును ఋత్విజులును ♦ విలసిల్లు విధికిఁ గొని తెచ్చి రంతఁ జే♦తనములేని

తే. భూమిపాలకు సేవకుల్ ♦ పూన్కి శిబిక
యందు నునిచి మనస్సులు ♦ కొందలపడ
బాష్పకంఠంబులొప్ప నె♦ప్పటివిధంబు
గాక యేడ్చుచు మోసిరి ♦ కష్టఁ బడలుచు. ౧౨ 2747

క. జనులొగి రాజతనుముల౯, గనకపుఁ బుష్పముల వివిధ♦కమ్రాంబరరా
జిని జల్లుచుఁ బ్రోవల భూపుని ముందుగ వగలుమిగుల౯♦బోయిరి మఱియున్.

సీ. కొందఱారీతిని ♦ జందనాగరుచూర్ణముల గుగ్గిలమును స♦రళమనఁబడు
నట్టి ధూపముఁ బద్మ♦కాహ్వయపరిమళ దారువు మఱి దేవ♦దారువులను
జల్లుచు నడిచిరి♦చ్ఛత్రంబులో ధూపసద్వస్తువులఁ జాల ♦ జనులు కొంద
ఱల్లనఁ జల్లుచు ♦ నరిగి రిచ్చటికేగి సతతఱి ఋత్విజులు భూ♦నాథు తనువు

ఆ. శిబికనుండి యెత్తి ♦ చితిపయిని బాగుండఁ, బెట్టి రంత భరతుఁ ♦ డట్టిపడెడు
చింతఁ బూని రాజ♦శేఖరునకును ద్రే, తాగ్ను లిచ్చి వారి ♦ యనుమతిఁగొని.

క. జనకున కిట్లగ్నుల నిచ్చినఁ బైతృకమేధమను వి♦శేషంబుల నా
ఘనులు జపించిరి సామగు, లనూనవిధి గానములను ♦ సట సల్పి రొగిన్. ౧౫

చ. సరగున వృద్ధులైన పరి♦చారికులెల్లను జుట్టురాఁగ నా
ధరణిపు భార్య లర్హవిధిఁ ♦ దారుపురి౯ విపనాడి వాహనో
త్కరముల నట్లె చారుశిబి♦కంబుల నచ్చటికేగి రంత దు
ర్భరమగు చింతఁ బూను నృపు♦పత్నులు ఋత్విజులక్కుమారుఁడున్. ౧౬

ఆ. అఖిలయాగములను ♦ నగ్నిచయనమును, జేసినట్టి నృపతి ♦ శేఖరునకు
నప్రదక్షిణముల ♦ నపుడు ప్రదక్షిణముల నొనర్చి; రంత ♦ వెలఁదు లెల్ల.

చ. మునుకొని క్రౌంచిరీతి నృప♦ముఖ్యుఁ జితాస్థితుఁ గాంచి జాలినే
డ్చినఁ బెనునాద మొక్కమొగిఁ ♦ జేరువనుండినవారికెల్లనున్
వినఁబడె నిట్టులేడ్చుచును ♦ వేయివిధంబుల వాహనాళిపైఁ
జని సరయూతటంబునను ♦ స్నానముచేయఁగ నిల్చి రార్తలై. ౧౮ 2753

క. నరవరు పత్నులు మంత్రులుఁ, బురోహితుల్ భరతుఁ గూడి ♦ భూపతికార్తి
స్ఫురణమున నుదకదానము, సరిగా నొనరించి పగలఁ ♦ జాలఁ బొగులుచున్.

తే. పట్టణముఁ జేరి కన్నులు ♦ బాష్పపూర్ణ
ములుగ నుండఁగ నేడ్చుచు ♦ నిలఁ బరుండు
చును దశాహము లాశౌచ♦మున గడపిరి
పనుల వేనిని జేయక ♦ పగలు మిగుల. ౨౩ 2755

డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

## ౭౭ - వ సర్గము.

—భరతుఁడు శ్రాద్ధములఁ జేయుట.—

సీ. అంతటఁ బదునొకం♦డవ దిన మరుదేరఁ బుణ్యాహవాచనం♦బుల నొనర్చి
నాఁ డొనర్పఁగ దగి♦న పనుల నొనరించి యాశౌచముం దీర్చి♦యవల ద్వాద
శాహన్నుసం జేయ♦నైన షోడశమాసికముల నెల్లను యథా♦క్రమముగాఁగ
నొనరించి భూమిసు♦రోత్తములకు రత్నముల ధనంబుల నన్న♦మును నమూల్య

ఆ. వస్త్రములను మేటి♦వస్తువులను, మేఁక, గుంపు, రజతరాశి ♦ గోశతముల
దాసజనుల నుఱియు ♦ దాసీజనంబుల. వాహనాలయముల ♦ వరుస నిచ్చె. 3

క. జనకుని గుఱించి భరతుం, డనూనవిధి వలసినట్టు ♦ లవనీసురులో
య్యనఁ దృప్తినొంద నిచ్చెను, దనివిం గని వారు పోవఁ ♦ దా నామీఁదన్.

క. పదుమూఁడవదినసంబున, నుదయంబున నస్థిజాల ♦ మొగి గ్రహియింపం
గఁ దగం దత్స్థానమునకు, మది తల్లడ మొంద వచ్చె ♦ మౌనియుతుండై. ౪

క. చనుదెంచి శోకమున మూర్ఛను గని యటు నెప్పిరిల్లి ♦ చాలస్వనంబున్
వినఁబడ నేడ్చెను; మఱియున్, జనకుని చితిఁ జేరి దుఃఖ♦సరణిం బలికెన్.

క. జనకా! నను నెవ్వరి కీ, వనునయమున నప్పగించి ♦ యరుగివలయునో
ఘనుఁ డన్న యతఁడు చనియెన్, వని కీవును నన్ను శూన్య♦వసుధ విడిచి తే.

తే. విను మనాథుఁ గౌసల్య♦కును గతియగు
నట్టి రాముని నడవికి ♦ నంపితీవు
తనయునిం బాసి దిక్కులే♦ని నెలఁతవిడి
యెందుఁ బోయితివో తండ్రి ♦ యిపుడు నీవు. ౭౪ 2761

క. అని తండ్రిశరీరము కాల్చినదయి యెఱ్ఱనయి భూతి♦చేఁ దగి దగ్ధా
స్థినికరముల నొప్పిన స్థల,మును గని బిగ్గఱఁగ నేడ్చె ♦ మోము వెలంగన్.

తే. అంతఁ జితిఁ గని దీనుఁడై ♦ యతఁడు రోద
నంబు చేయుచుఁ దంతుసం♦తతిని బైకి

నె త్తఁబడుతఱి సడలుట ♦ నింద్రుధ్వజము
ధరణిఁ బడునట్లు పడియెను ♦ ధైర్యమెడల. ౯౹ 2763

ఉ. ఆతనిపాటుఁ జూచి సుకృ♦తాంతమునం బడు నయ్యయాతివి
ఖ్యాతునిఁ [1]బుత్రికాతనయు♦లైన మునీశులు లేవనెత్తి న
ట్లాతఱి జ్ఞాతులందఱును ♦ నాతని లేపఁగఁ జెంతఁజేరి; రా
భూతలనాథపుత్రకుఁడు ♦ పొక్కుచు నేలను వ్రాలఁగాంచుచున్. ౧౦౹ 2764

[2] తే. ధైర్యమొప్ప శత్రుఘ్నుఁ డిం♦తవఱకుండి
యన్నశోకంబునం బ్రుంగి ♦ యట్లుపడుటఁ
గని మహీశునిఁ దలపోసి♦కొనుచుఁ బరవ
శత్వమున భూమిఁ బడియె, వి♦సంజ్ఞుఁ డగుచు ౧౧౹ 2765

క. భరతుని తమ్ముఁడు జనకుని, యరుదగు సద్గుణగణంబు ♦ నవయవముల సం
స్మరియించుచు నున్మత్తుని, కరణిన్ దుఃఖమునఁ బల్కెఁ ♦ గళవళపడుచున్.

సీ. అక్షోభ్యమై మంధ♦రాంగంబునం బుట్టి కైకయన్ దుర్గ్రాహ♦కలితమగుచు
వరదానజలముల ♦ వర్ధిలి లోఁతును గల దుఃఖభూరిసా♦గరము నమ్ము [డు
ముంచెఁ-దండ్రీ! యెప్డు♦ముదమునలాలించుసుకుమారుఁడును బాలుఁ♦డకుటిలుం
నగు భరతుఁడు చాల ♦ వగఁ గుంది యేడ్వంగ నాతని విడిచి నీ ♦ వరిగితివెట

ఆ. కయ్య! భోజ్యపాన♦కాంబరాభరణాది, వస్తువులను మాకు ♦ వలయుదాని
లలి గ్రహింపుఁడనుచు ♦ బలవంత పెట్టి చే,కొనఁగఁ జేయుదీవు♦కోర్కెనమ్ము.

క. జనకా! యిఁక నెవ్వరు మ, మ్మనునయమున నట్లు చేయ ♦ నర్హులు? ధర్మ
జ్ఞుని మహాత్ముని నిను విడి,చిన యీధర పగుల కెట్లు ♦ స్థిరతం గనునే. ౧౬

ఆ. కనుక నిద్ది ప్రళయ♦కాలంబునం గూడఁ, బగుల కుండునేమొ;♦పరమపదముఁ
దండ్రి పొంద నన్న ♦ దారుణాటవి కేగ, [3]నేమి బ్రతుకశక్తి ♦ యింక నాకు

క. కనుక హుతాశనుఁ జొచ్చెద, జనకభ్రాతలను మాని ♦ సమధికలక్ష్మిం
గన నిక్ష్వాకుపాలిత, మనఁబడు నీపురము, శూన్య♦మై యిట్లుండెన్. ౧౮

క. నేనెంతమాత్ర మియ్యెడ, దీనిం జొరఁబూన ననుచు ♦ దీనతనేడ్చెన్
భూనాథతనయు లిద్దఱు, మానక పలవింపఁ గాంచి ♦ మనసులు కరఁగన్.

క. వారిని వెనుకొని వచ్చిన, వారందఱు మరల దుఃఖ♦వార్ధి మునిఁగి రీ
తీరున సోదరు లిర్వురు, భూరితరార్తిం దపించి ♦ పొంగెడు వగచేన్. ౨౦

క. పలవించుచుఁ గడునార్తిని, నలసి ధరంబడిరి కొమ్ము ♦ లల్లన విఱుగన్

---

1 దౌహిత్రమృషయో యథా-అనిమూలము. ఋషయః దౌహిత్రభూతాః-అని వ్యాఖ్య. దీని ననుసరించియే వ్రాయఁబడినది. 2 భరతపతనానంతరం శత్రుఘ్నస్య ధైర్యం స్థితం-అని వ్యాఖ్య. 3 కిం మే జీవితసామర్థ్యమ్-అనిమూలము.

గలఁగిపడు [1]నుక్షయుగ్మము, వలె. నంతట [2]సత్స్వభావ♦భాసురుఁడగుచున్.

— వసిష్ఠుఁడు భరతునికి బోధించుట. —

ఆ. సర్వవేత్త వీరి♦జనకు పురోహితుం, డగు వసిష్ఠమౌని ♦ యవనిఁ బొరలు
చున్న భరతు నెత్తి ♦ తిన్నఁగఁ బలికె నో,రాజ! వినుము వృద్ధ♦రాజు సచుసె.
[3]క. జనకునకుఁ బ్రేతకార్యము, లొనరిచి యీదివసమునకు ♦ నొగిఁ బదుమూఁడ
య్యెను నస్థులసంచయన, మ్మను కర్మము మిగిలియుండ ♦ నార్తిఁ బొగిలెదే.
తే. జాగు చేసెద వేటికి? ♦ సాధుచిత్త
శోకమోహజరామృతుల్ ♦ క్షుత్పిపాస
లనెడి యీమూఁడు ద్వంద్వంబు♦లును సమస్త
జంతువులకు సమంబుగ ♦ సంభవించు. ౨౩ 2776
తే. అపరిహార్యంబులై యుండు♦నట్టి వీని
విషయమున నిన్నుఁ బోలిన ♦ విమలమతియుఁ
జింతనొందుట తగునె; యే♦సిద్ధి గల్గు
దీన నీకుఁ జాలునని యిట్లు ♦ మౌని పలుక. ౨౪ 2777
సీ. తత్త్వజ్ఞుఁడౌ సుమం♦త్రసచివుఁ డారీతి శత్రుఘ్ను నెత్తి త♦త్సాంత్వవిభ్ర
మముఁ బాపి జంతుస♦మానంబులౌ [4]భవాభవముల విధమెల్ల ♦ భవ్యరీతి
వినిపించె; సద్యశో♦విస్తారులౌ వారు పురుషసింహులు సహో♦దరులు లేచి
వర్షాతపంబుల ♦ బడలిన యింద్రధ్వజంబులరీతిఁ బ్ర♦శస్తకాంతి
ఆ. వెలసి; రశ్రుసలిల♦ములఁ దోసికొని యెఱ్ఱ
వాఱుకనులతో స♦భవ్యనినద
ములను బలుకు రాట్సు♦తుల మంత్రులటఁ జేయఁ
దగినపనుల జరపఁ ♦ ద్వరపఱుపఁగ. ౨౫ 2778

డెబ్బదియేడవ సర్గము సంపూర్ణము.

౭౮ - వ సర్గము.

— శత్రుఘ్నుఁడు మంథరను శిక్షించుట. —

క. అపరక్రియలం దీరిచి,న పిదప గృహమునకుఁ బోయి♦నతఁడె భరతుఁడ
న్నపరిసరమునకుఁ జనఁడా, నపుడెంచెఁగ నతనితోడ ♦ ననుజుం డనియెన్. ౧

1 ఉక్షయుగ్మము=వృషభములజంట. 2 తతః ప్రకృతిమాన్-అనిమూలము ప్రకృతిమాన్= ప్రశస్తస్వభావః-అనివ్యాఖ్య. 3 సాపశేషాస్థినిచయే కిమిహ త్వం విలంబసే-అనిమూలము 'దశాహమధ్యే శాస్త్రవిహితం ప్రధానాస్థిసంచయనం కృత్వా త్రయోదశదినసే తద్దేశాచారప్రాప్తస్థలశోధనమాత్రం కృత మిత్యవగమ్యతే'అని వ్యాఖ్య. దీనిభావమే యిటఁ జేర్పఁబడినది 4 భవాభవములు=జన్మమృతులు.

ఆ. పగలుగలుగఁ బ్రాణి♦వారంబునకు నెవ్వఁ
డగునొ సుగతి యట్టి♦డైన రాముఁ
డాత్మదుఃఖమునకు ♦ నతఁడె దిక్కగునని
పలుకవలెనె, యట్టి ♦ [1]ప్రౌఢబలుఁడు ౧ 2780

చ. అల మతిమంతుఁడై రఘువ♦రాన్వయపాలకుఁడైన రాముఁడో
క్కలలనచేతఁ బంపఁబడెఁ ♦ గానలకియ్యది యేమి చిత్రమో
బలముగు తండ్రియాజ్ఞఁగొని ♦ వారక యాతఁడె కానకేగెనిం
దుల కతఁడేమిచేయు నిఁక ♦ దూఱకు మాతనినంచుఁ బల్కెదో. ౨ 2781

క. బలయుతుఁడు శౌర్యవంతుం, డల లక్ష్మణుఁ డనెడు నొక్కఁ ♦ డవనీస్థలిలోఁ
గలఁడు గదా యతఁడైనను, దలఁకక పిత నిగ్రహింపఁ ♦ దగదో చెపుమా. 3

చ. జనకుని నిగ్రహించి రఘు♦సత్తముఁ గానకుఁ బోవకుండ నే
లొనరింపలేదు; దుష్టవని♦తోద్యమముం గనలేక చిక్కుదు
ర్జనపథగామియౌ నృపునిఁ ♦ జయ్యన మించియుఁ జేష్ఠ నెన్నియో
ప్పనిపనికంటె మున్నె తగు♦భంగిగ నాపుట కృత్యమౌఁ గదా. ౪ 2783

తే. అపుడె యిట్టు లొనర్చిన ♦ నిపుడు శోక
మిట్లు గలుగకయుండుఁగా ♦ యేమి యింక
ననుకొనినఫలమని యాడె; ♦ న ట్లతండు
పలుకుచుండఁగఁ గుబ్జయు ♦ లలితరీతి. ౫ 2784

సీ. తాను గోరిన భర♦తప్రియకృత్యము జరుగు నెప్పుడటంచు ♦ సంతసమున
నెదురుచూచుచుఁ దన♦యిచ్ఛవచ్చిన సొమ్ములను దాల్చి దివ్యచం♦దనములంటి
రాజవస్త్రంబుల ♦ రంజిల్లి యారాజ తనయుఁడుండిన సౌధ♦మునను దూర్పు
వాకిలి యొద్దకు ♦ వచ్చె నామంథర మణిభూషణముల సు♦మహితముగను

తే. పెక్కువిధములఁ దగునానిఁ ♦ బ్రతఁ దాల్చి
యలరు మొలనూళ్లచే విప♦ధాభరణము
లను జెలంగుచుఁ ద్రాటఁ గ♦ట్టిన కపిసతి
వలె వికారంబుగాఁ గనఁ♦బడియె నంత. ౬ 2785

క. కని ద్వారపాలకులు కుబ్జను నిర్దయురాలిఁ గనుతేఁ ♦ బట్టుకొని జవం
బున శత్రుఘ్నుని సన్నిధిని నిలిపి యిట్లనిరి భక్తిః ♦ నృపవరతనయా!. ౭

క. వనికేఁ రాముఁడు స్వర్గం, బునకుఁ మీతండ్రి చనిరో ♦ ముదిత యిదియె యి
ప్పనులకుఁ గారణ మతిపాపిని ఘాతకురాలు సుమ్ము ♦ విశ్రుతకీర్తీ!. ౮ 2787

క. కనుకఁ దీనిని నీయిచ్చను పోఁచిసి శిక్షఁ జేయఁ♦జనునని పలుకఁ
విని వారి వచనములఁ జయ్యన ధృతనియముం డతండు ♦ నతిదుఃఖితుఁడై .

---

1 సామస్సత్త్వసంపన్నః-అని మూలము.

క. అంతఃపురమునఁ గల జన, సంతతినిం జూచి పలికె ♦ సక్రోధుండై
యింతటి దుఃఖం బిపుడే, యింతివలనఁ గల్గె నన్న ♦ కిటు జనకునకున్. ౧౦౹

క. ఆయింతి క్రూరకృత్యము, నీయాగతిఁ జేసెఁ గాన ♦ నిద్దానికిఁ గా
నే యశుభఫలము తుల్యమొ, యీయాయుధనంబొందుఁగాక; ♦ హితముగ దానికిన్.

క. అని పలికి యతఁడు నెచ్చెలు,లను గూడిన కుబ్జఁ గాంచి ♦ లలన యనక దా
నిని బలవంతముగా బట్టిన నిల్లు ధ్వనింప నార్భటించెం బెలుచన్. ౧౨

తే. దాని చెలికత్తెలందఱ ♦ తండు క్రుద్ధుఁ
డగుటఁ గనుఁగొని సంత్రస్త ♦ లగుచు దిక్కు
తోఁచకెల్లెడలకుఁ బాఱి ♦ రాచెలులపు
డితర లలనలతోఁ బల్కి ♦ రిట్టులొకట. ౧౩౹ 2792

క. ఇతఁ డారంభించిన యీ, గతిఁ జూడఁగ మనల నెల్లఁ ♦ గడువడి నిశ్శే
షత నొందఁ జేయఁగలఁడిఁక, గతి యేమొకొ రాము తల్లి ♦ గల దానాధ్వన్.

క. కరుణాన్వాంత వదాన్యను, వరకీర్తిని ధర్మవితతి ♦ బహుభంగులఁ దా
సరిగ నెఱింగిస తల్లిని, శరణుం జొత్తమిపుడామె ♦ చాలెడుఁ గావన్. ౧౫

తే. ఒండు శరణంబు లేదు ధీ ♦ రుండితండు
మనలఁ బరిమార్చునని యెంచి ♦ వనితలుండె
శత్రుతాపనుఁ డాతండు ♦ చాలఁ గోప
మడరఁ గనులెఱ్ఱఁబాఱఁగ ♦ నట్టె పోయి. ౧౬౹ 2795

ఆ. అఱచుచున్నదాని ♦ నామంధరను బట్టి
యిలను బఱఁగ వైచి ♦ యీడ్చుకొనుచుఁ
బోయె; నట్టు లతఁడు ♦ పోవుచునుండంగ
దాని సొమ్ములెల్ల ♦ ధరణిమీఁద. ౧౭౹ 2796

క. పలువిధముల రంగుల సొ,మ్ములు భూస్థలి నందు నందు ♦ మునుకొని రాలెన్
లలితవిభూషణవితతుల, నలరెడు నారాజసౌధ ♦ మాసమయమునన్. ౧౮౹

తే. విమలతారాగణంబుల ♦ వెలయు శార
దాంబరము రీతి వెలసె; న ♦ య్యతివ నిట్లు
బలమునం దగు పూరుష ♦ వర్యుఁ డాతఁ
డీడ్చుకొనిపోయెఁ; దన్మోచ ♦ నేచ్ఛఁ గైక. ౧౯౹ 2798

క. అరుదెంచె నచటి కాతఁడు, పరుషోక్తులచే నదల్చి ♦ పలికెను దానం
దరుణీమణి దుఃఖితయై, కరి మతినిభయంబు నొంప ♦ గాఁ దడఁబడుచున్. ౨౦

క. తనయుని శరణుం జొచ్చెను;, గనుఁగొని భరతుండు తల్లిఁ ♦ గడుఁ గ్రుద్ధుండై
యనుజన్ముఁ డుండ నాతని, కనియెన్ భూతవ్రజంబు ♦ నం దరయంగన్. ౨౧౹

చ. వనితలఁ జంపరాదు క్షమ ♦ వర్ధిలఁ జేయుము చిత్తసీమలో
ననుజ! సమస్తధర్మవిదుఁ♦డౌ రఘురాముఁడు నేనుఁ దల్లిఁ జం
పిన విని మాతృహంతనని ♦ ప్రీతి యడంగఁగ నన్నుఁ దిట్టు న
య్యనఘుఁడు తిట్టఁజేనియుఁ గృ♦తాఘను దుష్టను గైక నోర్తునే. ౨౨ 2801

క. నేనే చంపుదు నెపుడో, కానక క్షమఁ బూనవయ్య ♦ గాదిలి యనుజా!
చానను గుహనామూలము,గా నెగడెడు కుబ్జ విడువఁ♦గానే లనెదో?. ౨౪

క. ఈమంథరఁ జంపితి మని, రాముం డెఱిఁగినను ధర్మ♦రాశి నెఱుఁగుటక
దా మానినిఁ జంపితివని,యే మనలఁ దిరస్కరించు ♦ నిఁకఁ బలుకఁడు సూ. ౨౩

చ. అన విని [1]లక్ష్మణానుజని ♦ యాతని భాషల నాలకించి యె
య్యనఁ గ్రుధమాని పే విడిచె ♦ నయ్యతివక భయ మొందియున్న య
వ్వనితయుఁ గైకపాదముల♦పైఁ బడి యార్తిని బొక్కి యేడ్చెఁ జ
య్యనఁ గడునూర్పులక విడిచి ♦ యామెకు జాలియుఁ గల్గునట్లుగక. ౨౫

ఆ. అట్లతండు తిగిచి ♦ యటు విడువ విసంజ్ఞ
యగుచు, వలలఁ జిక్కి ♦ యార్తి దెసలఁ
గనెడు క్రౌంచిరీతి ♦ వనటఁ గుందెడు కుబ్జఁ
గైక యూఱడించె ♦ గారవమున. ౨౬ 2805

డెబ్బదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౭౯ - వ సర్గము.

—— భరతుఁడు రామునియొద్దకుఁ బోవు మార్గములఁ జక్కఁజేయ నాజ్ఞాపించుట. ——

సీ. అంతలఁ బదునాలు♦గవ దివసంబునఁ బ్రొద్దున రాజును ♦ బూన్కిఁ బట్ట
భద్రునిగాఁ జేయ♦వలసిన యధికారమునఁ బొల్చు వారెల్ల♦యును భరతునిఁ
గనుఁగొనఁగా వచ్చి ♦ మనకెల్లరకు గురువనుఁడైన దశరథ♦ధరణిపాల
చంద్రుండు శ్రీరామ♦చంద్రుని జ్యేష్ఠుని ఘనబలుండగు లక్ష్మ♦ణుని వనంబు
తే. నందు నుండంగఁ బనిపి తా ♦ నరిగె స్వర్గ
మునకు; రాజకుమారకా! ♦ ఘనయశుండ
వయిన నీవిప్డు భూపతి ♦ వగుము మాకుఁ;
బ్రభువు లేకుండఁ గూడ దీ♦వసుధ యెపుడు. ౨౫ 2806

క. దైవవశంబున రాజ్యం, [2]బీనఱకి దనాయకంబ♦యే యెన నిటం
గావింప దీజనప్రజ, మేవిధి నపరాధలేశ♦మేని మహాత్మా!. 3 2807

క. నీయభిషేకంబున కిపు, డేయే వస్తువులు వలయు ♦ నెల్లక వానిక

---

1 లక్ష్మణానుజని=శత్రుఘ్నుఁడు. 2 దశరథమృతి మొదలుకొని యింతదనుక.

బాయక కైకొని నీకై, యీయెడఁ [1]బౌరులును మంత్రు ♦ లెల్ల జనములున్.

తే. ఎదురుచూచుచు నున్నవా ♦ రినకులేంద్ర!
తండ్రి తాతలనుండి ని♦త్యము పరంప
రాగతంబయి వచ్చిన ♦ యలఘురాజ్య
మిద్ది కావున దీని గ్ర♦హింపవలయు. ౪ 2809

క. నీ వభిషేకంబును దగఁ, గావించుకొనంగ వలయుఁ ♦ గాపాడుము మ
మ్మీవిశ్వంబును దాలిచి, నా విని దృఢనియతుండైన ♦ నరపతిసుతుఁడున్. ౫

క. తను నభిషేకింపఁగఁ దెచ్చిన మంగళవస్తుతతికిఁ ♦ జిత్తము వ్యథనొం
దినదాటచేఁ బ్రదక్షిణమును నొనరిచి వారిఁ గాంచి ♦ మునుకొని పలికెన్. ౬

క. మాకులమున జ్యేష్ఠసుతుండే కద! రాజగుట యుచిత ♦ మిట్లుండంగా
నీకరణి [2]సర్వమెఱిఁగిన, మీకుం బల్కంగఁ దగదు ♦ [3]మించెదు వేడ్కన్. ౭

క. మన కెల్ల జ్యేష్ఠసోదరుఁ, డనూనగుణుఁడై చెలంగు ♦ నారాముండే
జనపతి కావలయును నే, వనిఁ బదునాల్గేఁడు లుండు♦వాఁడ నతనికై. ౮ 2813

క. వనముల కేఁ జని నాయన్నను దోడ్కొనివత్తు జవము♦నన్ జతురంగం
బనితరసాధ్యమునగు వాహిని రావింపుండు ననికి ♦ నిప్పుడ పోవన్. ౯ 2814

తే. ఇప్పుడభిషేకమునకయి ♦ యే సువస్తు
వులను సమకట్టినారో మీ♦రెలమి, వాని
నన్న యభిషేకమునకయి ♦ యవ్వనంబు
నకును గొనిపోవుచున్నాఁడ ♦ [4]నకలుషమతి. ౧౦ 2815

ఛ. వనమున యందె సత్పురుషు ♦ భవ్యమనీషునిఁ బూజ్య రామచం
ద్రుని నభిషిక్తుఁ జేయుచుఁ, గ్ర♦తుక్రియకై మఖశాలనుండి య
య్యనలుని దెచ్చురీతి నిపు ♦ డాతనిఁ దోడ్కొని వచ్చెదన్ వనం
బున నివసింపనీయ నిదె ♦ ముందటఁ దల్లియో యన్నపేరుచేన్. ౧౧ 2816

క. కనఁబడెదు నీమెకోర్కిని, గొనసాగిం జేయఁ జుండి ♦ ఘోరారణ్యం
బున నేనె వసించెద రాముని రాజుం జేయువాఁడ ♦ ముదమలరారన్. ౧౨

క. మన మరుగుఁ ద్రోవలను నేఁ, డ్పనఁ జక్కఁ జేయవలయుఁ ♦ బో, కావున న
ప్పనిఁ జేయ నేర్పుగల వారిని బంపుఁడు వారలిపుడ♦రిగి విషమములన్. ౧౩

క. సమములుగాఁ జేయందగును మనసురుగుటకును మున్నె ♦ నూతనదుర్గ
ములెల్ల నరసి మార్గంబు మునకుఁ జూపంగఁ దగిన♦ పోడల నిపుడే. ౧౪

1 స్వజనశ్రేణయశ్చ-అని మూలము. 'స్వజనః అమాత్యాదయః శ్రేణయః-నైగమాః' అని వ్యాఖ్య. 2 కుశలాజనాః-అని మూలము. 3 మించెదు వేడ్కన్ - భరతుని భావము ప్రజలు సంతోషముతో నీవార్త తెలిపిరనియే. 4 అకలుషమతి-అనఁగా నీమాట యుపచారార్థము గాదు. నిశ్చయమని భరతుని భావము.

క. పనుపుఁడు కొందఱు మనవెం,టనె వత్తురుగాక యని య♦డంచుచు వగ నె
మ్మనమున; రామునివిషయం,బున భక్త్యనురాగములను ♦ బూని పలుకుచున్.

క. తనరెడు భరతుని శుభవచ,నుని గని సచివాదులెల్ల ♦ నూత్నోత్సాహం
బునఁ బల్కి రట్లు జ్యేష్ఠుని, మనుజేశకుమారు నృపుని ♦ సమతం జేయన్.

క. భరతా! మనమునఁ గోరితి, వరయఁగ నిట్టిండవౌట ♦ ననయము [1]పద్మా
కరయగు శ్రీదేవియు ని,న్నరయుచు నివసించుఁగాక ♦ యని రాపిదపన్. ౧౫

సీ. రామునిఁ గొనివచ్చి ♦ రాజ్యంబొసంగెదనను విషయంబున ♦ నా భరతుఁడు
పల్కిన యాశుభ♦వాక్యముల్ విని యార్యులౌ మంత్రులెంతయు♦నలరి రంత
వారికన్నులనుండి ♦ పరమసంతోషాశ్రు జలములు దొరఁగె నా♦సచివముఖ్యు
లాతఁడు చెప్పిన♦యనల దుఃఖము మాసి పల్కి; రో పూరుష♦వర్య! నీదు

తే. నాజ్ఞచొప్పున నృపభక్తు♦లైన భృత్యు
లెల్ల మార్గము రక్షింప♦ నెందుఁ ద్రోవ
లరసి చక్కఁ జేయంగ ని♦య్యెదనుసందె
దిట్టపఱచితి మనిన మం♦దిం జెలంగె. ౧౬ 2823

డెబ్బదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౮౦-వ సర్గము.

—రాజమార్గమును నిర్మించుట—

సీ. తదనంతరంబున ♦ ధరణీభాగస్వభావముల నెఱింగిన ♦ ప్రజలు, కూప
వాపీజలంబులఁ ♦ బడయంగఁదగుసూత్రముల నేయుటం జెల్లువా♦రలును, స్వీయ
కార్యమౌ మార్గర♦క్షణము చేయంగను వలఁతులౌ సేవకులు♦ వసుధఁ ద్రవ్వు
వారలు, యంత్రజీ♦వనులును భృతిజీవనులు శిల్పాధ్యక్ష♦కులును రాజ

తే. పురుషు లోడలు నడుపంగఁ ♦ బూనఁదగిన
యంత్రములుచేయ నేర్పఱ♦లైన వారు
[2]వర్ధకులు మార్గరక్షణ♦పరులు వృక్ష
ములను దెగఁగొట్టువారును ♦ ముందు చనిరి. ౨ 2824

తే. బావులం ద్రవ్వువారును ♦ వైణకార్య
తత్పరులు సున్నమును బూయఁ ♦ దగినవారు
తక్కుపనులందు నేర్పునఁ ♦ దగినవారు
చనిరి ముందుగ మార్గముల్ ♦ చక్కఁ జేయ. 3 2825

---

1 పద్మా శ్రీ రుపతిష్ఠతామ్-అని మూలము 'పద్మా=పద్మాలయా' యని వ్యాఖ్య. 2 వర్ధకులు=వడ్రంగులు.

క. జను లవ్వారలు లెక్కిం,పను శక్యముగాక రామ♦భద్రునిఁ గను వే
డ్కను వెలసి [1]రతని కానన,మునకై పోవుతఱిఁ బర్వ♦మునఁ గంధివలెన్. ౫

సీ. మార్గముల్ సరిచేయ ♦ మంచినేర్పును గల్గువారలెల్లను దమ♦భాగములను
నిర్ణయించుకొనుచు ♦ నియతిచేఁ బరికరములను గైకొని చని♦ రెలమి ముందు;
వారు మార్గమ్మున ♦ ఘోరమ్ముగా నడ్డపడియుండు కొమ్మల ♦ వల్లులఁ దగ
గుల్మంబులను శూన్య♦కుజముల ఱాల నింకను బెక్కువృక్షంబు♦లను గుఠార
తే. ధారలం ద్రుంచి పోవంగఁ ♦ దగనిపట్ల
నేర్పఱిచిరి మార్గంబుల ♦ నేగి కొంద
ఱందుఁ జెట్లు లేకుండునో ♦ యందు వానిఁ
జక్కఁగా నాటి కైచేసి ♦ రొక్కమొగిని. ౬ 2827

సీ. అందందు దారుల ♦ కడ్డంబుగానున్న చెట్లు మున్నగువానిఁ ♦ జెలఁగి తీవ్ర
తమకుఠారముల ఱం♦పములఁ బాఱలఁగొని త్రుంచిరి; కొందఱం♦దున్ బలాఢ్యు
లగువారు బలముగా ♦ నగపడు నవురుగంటలను గాలిచి, పోవ ♦ నలవిగాని
విషమస్థలంబుల ♦ విమలరీతులఁ జక్కఁపఱిచిరి కొందఱు ♦ [2]పద్ధతికిని
తే. నడ్డముగనున్న బావుల ♦ నతివిశాల
రంధ్రముల మృత్తికం బోసి ♦ రమ్యమార్గ
ములను జేసిరి, నిమ్నభూ♦ముల సమాన
తలములుగఁ జేసి కైసేసి ♦ రలఘుగతుల. ౯ 2828

క. సేనలు దాఁటుట కనువుగ, వే నదులకు వంతెనలను ♦ వెలయించిరి రా
ట్సూనుఁడు వచ్చెడు త్రోవను, జానుగఁ బాషాణములర♦జంబుగఁ బూన్కిన్.
క. ఒనరించి జలములూఱుట, గనుపట్టెడు చోటులందుఁ ♦ గడఁగి జలము పో
వను జేయఁ ద్రవ్విరంతట, జను లవ్వారలొగి నల్ప♦జల[3]నిమ్నగలన్. ౧౦

ఆ. అచిరకాలముననె ♦ యధికజలంబులు, గలుగఁ గట్టలను ద♦గంగఁ గట్టి
దిగుట కనువుగాఁగ ♦ సొగసుగ రేవులు, మెట్లు గలిగి కడలి ♦ మించఁ జేసి.

సీ. వెలయించి యంతట ♦ సలిలంబులే లేని స్థలముల నరులకు ♦ సామజముల
కశ్వాదులకుఁ ద్రావ ♦ ననువగు తీరున నడబావులం ద్రవ్వి ♦ బడలివచ్చి
సలిలంబులం ద్రావి ♦ శ్రమవాయునట్లుగ విశ్రమించుటకయి ♦ వేదికలను
నిర్మించి; రంతట ♦ నిఖిలసేనలు వచ్చుఁ ద్రోవల సున్నంబు♦తోడ ఱాలఁ
తే. బఱచి గట్టనచేసి, రం♦భస్సు లెపుడు
పాఱుచుండుట వృక్షముల్ ♦ బహుళకుసుమ
యుతములై యప్పుడొప్పారెఁ; ♦ బతగములును
బలసి కూయుచునుండెను ♦ లలితరీతి. ౧౨ 2832

1 అతనికాననము=ఆరాముఁడుండువనము. 2 పద్ధతి=మార్గము. 3 నిమ్నగలు=నదులు.

క. అందందు; నంత వారలు, క్రందుగఁ గేతనములెత్తి ♦ కడురమ్యంబౌ
చందనసలిలముఁ జల్లిర, మందానందదములగు సు♦మంబులను దమిన్. ౧౩౫

క. వారలు మార్గంబున నీ, తీరునఁ గైసేసియుంట ♦ దేవపథముల
ట్లారమ్యమార్గములు తగి, యారూఢ రుచిన్ వెలింగె; ♦ నంతట నొకచోన్.

సీ. శిబిరాదులం గట్టఁ ♦ జెచ్చెఱఁ బంపిన వారెల్లరుం గూడి ♦ వన్యరుచిర
ఫలసంయుతస్థలం♦బుల మహోత్కృంశగు భరతున కింపుగాఁ ♦ బరఁగునట్లు
తమయంతనే ప్రకా♦శము నొందునట్లుగ బంగరుకలశముల్ ♦ పడగగములు
వెలయునట్లుగ నేర్పు ♦ లలవడ నిర్మించి వాస్తుశాస్త్రమెఱుంగు♦వారు శుభద

తే. ములగు నక్షత్రములయందు ♦ లలితరాను
లందు భరతుండు దిగుటకై ♦ యర్హములగు
శిబిరములఁ గట్టి యందు నుం♦చిరి; సమస్త
పరికరంబులతో నవ్వి ♦ పరఁగునట్లు. ౧౭ 2835

సీ. రమణీయసికతాత♦లములచే విలసిల్లి పరిఖాసమావృతి ♦ భాసురముగఁ
దగి యింద్రకీల భూ♦ధరము నాఁ దగియవ్వి యలగారెనందువీ♦నులు చెలంగెఁ
బ్రాసాదపంక్తులు ♦ ప్రబలియుండెను సుధాకలితమ్ములైన ప్రా♦కారములును
బ్రబలియుండెను; నెఱిఁ♦బడగలు వెలసెను రాజవీథులు సుంద♦రములుగాఁగ

తే. నలరె నేడు నిలువులమే♦డలు మహోన్న
తము లగుటచేత నాకాశ♦తలము నొరయు
చున్నరీతిఁ గనంబడి ♦ యొగిఁ దుదలను
బతులుండెడు గూండ్లచేఁ ♦ బ్రబలుచుండె ౧౯ 2836

క. ఈకరణి నవ్వి వెలయుట, నాకేశుని దివ్యపత్త♦నమునకు సమతన్
వే కాంచి వెలసె; మఱియును, శ్రీకలితములైన చెట్ల♦చే విలసిలుచున్. ౨౦

క. వనవితతుల భాసిలి చల్లని జలముల నొప్పియుంట ♦ లలితములగుచున్
బెను [1]ఝుషముల ఁదగు గంగా, ధునిపర్యంతంబు నింపు♦తో నవి తనరెన్.

క. చక్కలగుమితో శశితో, నెక్కరణి దివంబు వెలయు ♦ నెంతొ కుశలులౌ
చక్కని శిల్పులు గట్టుట, నక్కడి యాభరతు ప్రోవ ♦ యలరారెఁ గడున్.

ఎనుబదియవ సర్గము సంపూర్ణము.

---

౮౧ - వ సర్గము.

భరతుఁడు శోకించుట.

క. అరుదుగ రామునిఁ దోడ్కొని, యరుదెంచెడు నభ్యుదయము ♦ నారంభింపం
బరఁగెడు నాయపరనిశన్, [2]వరరాజ్ఞిపుణులగుచున్న ♦ వందిజనంబుల్. ౧

---

1 ఝుషములు=చేఁపలు. 2 తుష్టువు ర్వాగ్విశేషజ్ఞాః-అని మూలము.

తే. మాగధులు శుభశబ్ద స♦మ్మానితంబు
లైన స్తవముల భరతుని ♦ నలరి పొగడి;
రంత జామును దెలిపెడు♦నట్టి భేరి
[1]స్వర్ణదండాభిహతమయి ♦ సరగ మ్రోసె. ౧॥ 2841

క. జనములు వేలకొలందిని, ఘనరవశంఖముల నొత్తి ♦ కాహళముఖవా
ద్యనికరముల వాయించిరి, ధ్వని యది చెలరేఁగి యభ్ర♦తలమందలరెన్. ౨

క. సురపథ మంతట వ్యాపిం,చి రయమ్మున దుఃఖమెంతొ ♦ చెందిన మదితోఁ
బురపురఁ బొక్కెడు నృపసుతు, భరతునిమదిమఱియుఁదూట్లు♦వాఱంజేసెన్.

క. భరతుండంతట మేల్కని, యఱుదగు నాధ్వనిని వినుచు ♦ నవనికి నేనీ
శ్వరుఁడంగ ను మహీశుని, పరినుతులం దన్పునట్లు ♦ పలుకకుఁ డనుచున్. ౩॥

క. ధ్వని నద్దానిని మానిపి, యనుజన్మునిఁ గాంచి కైక ♦ యవనీరాజ్యం
బున కెంత యపకృతిం జే,సెనొ చూడుముమఱియు నేమి♦చెప్పఁగలుగుదున్.

క. జనకుఁడు దుఃఖశతంబులఁ, గనఁగా ననుఁజేసి చనియెఁ ♦ గాలవశుండై
విను మహితుఁడైన ధర్మా,త్మునిడగు నీరాజ్యలక్ష్మి ♦ [2]ద్రుతగతి మెఱయున్. ౪॥

ఆ. ధరణిపతికి వెనుకఁ ♦ దనయుని జ్యేష్ఠునిఁ, బొందునట్టి ధర్మ♦మందె నిలిచి
యున్న దట్టి దిప్పు♦డురుజలములఁ గర్ణ,ధారకుండు లేని♦తరి విధమున. ౬

క. చలియించుచున్న దేమని, పలుకుదు? నెవ్వాఁడు మనకుఁ ♦ బ్రాపై సతమున్
నిలుచునొ యాశ్రీరాముఁడు, ఖలమతి యగు కైక పలుకఁ ♦ గానలకేగెన్.

క. జననియు ధర్మము మానెను, గనుక నె శ్రీరామచంద్రుఁ ♦ గానల కిరి
తిని బంపె ననుచు నేడ్చుచుఁ, దన యెఱుకను దప్పి యతఁడు♦తల్లడపడఁగన్.

క. భరతునిఁ గని దీనతచేఁ, దరుణీమణు లేడ్చి రట్లె ♦ ధ్వని గలుగంగా
భరతుం డిటు విలపించెడు, తఱుణమ్మున సుయశుఁడు నృప♦ధర్మజ్ఞుండున్. ౮॥

క. మునివరుఁడునొ వసిష్ఠుఁడు, ఘనరాజసభాస్థలమును ♦ గాంగేయమ్మయం
బును రమ్యము మణిభూషిత,మునునయి విలసిల్లుదాని ♦ మునిపుత్రులతోన్.

తే. తాఁ బ్రవేశించె నమలసు♦ధర్మయనెడు
దేవసభవలెఁ బొల్పారి ♦ పావనమయి
తనరు దానిని; వేదవే♦త్తయగు నతఁడు
ధర్మమయపీఠమున నంతఁ ♦ బరిఢవిల్లె. ౧౦॥ 2852

క. అదియు సభాస్తరణంబునఁ, గుదిరింపంబడి చెలంగఁ ♦ గూర్చుండి మహీ
త్రిదశవరుఁడు దూతలఁ గాం,చి దగన్ శాసించె నిట్లు ♦ చెందినశ్రద్ధన్. ౧౧

క. శ్రనుసాధ్యమైన యొకకా,ర్యము మీకుం గలదు సత్వ♦రంబుగఁ జని యు
త్తమవిప్రభూపవైశ్యుల, నమాత్యసైన్యాధిపతుల ♦ నందఱఁ గడఁకన్. ౧౨॥

---

1 సువర్ణకోణాభిహతః-అనిమూలము. 2 ద్రుతగతి=వేగముగా.

క. రాజాంతరంగభృత్యుల, నోజఁ శత్రుఘ్నుఁ గీర్తి♦యుతునిఁ భరతుఁ
దేజస్వి [1]యుధాజిత్తును, రాజన్మతినిఁ సుమంత్రు ♦ రమ్యగుణనిధిఁ. ౧౨౫

తే. మఱియు రాజ్యమునకును క్షే♦మంబుఁ గోరు
వార లెవ్వరు గలరొ య♦వ్వారి నెల్ల
నిటకుఁ దోడ్కొని రండు పొం♦డిపుడె యనుచు
నాజ్ఞ చేసెను వారు త♦దాజ్ఞఁ బూని. ౧౩ 2856

క. చని చెప్పఁగ మునియానతి, జనులెల్లను దమకుఁ దగిన♦చందంబున వా
హనముల రథగజహయములఁ, గొని వచ్చుచు నుండఁగలిగె♦గురురవమచటన్.

చ. భరతుఁడు రాఁగ నాప్రకృతి♦వర్గము గాంచి శచీపతిన్ సురో
త్కరములు వోలె నాదశర♦థక్షితిపాలుని మున్ను సన్నుతిం
బరిముద మొందఁ జేయుగతి ♦ భవ్యమనంబుల సన్నుతించి రా
భరతుఁడు తమ్మునిం గలిసి ♦ వచ్చి సభాభవనంబుఁ జేరెఁ దాన్. ౧౫ 2858

మ. పెనుమత్స్యంబులు నీటియేనుఁగులునుం ♦ బెంపారఁ జాంచల్యముం
గననట్లొప్పు జలంబులం బరఁగి శం♦ఖస్తోమరత్నాళిచే
తను జెల్వారుచు సైకతంబయి సము♦ద్రప్రాంత [2]రాజద్ధ్వనం
బన రాట్పుత్రముఖాన్వితంబయి మహా♦కల్పాన్థానయుక్తంబునై
తనరారెన్ సభ పూర్వరీతిగనె యు♦ద్దామప్రకాశంబునన్. ౧౬ 2859

ఎనుబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౮౨-వ సర్గము.

భరతుఁడు పౌరులతోఁ గూడి రామునికడకుఁ బ్రయాణమగుట

తే. ఆర్యజనగణపూర్ణమై ♦ యలరు నాస
భను మతివిలాసుఁడౌ రాజ♦తనయుఁడు గురు
శుక్రముఖఖేచరావళి ♦ సొంపగు నిశఁ
బూర్ణశశి కనుతీరునఁ ♦ బూని చూచె. ౧ 2860

చ. అలరెడు నాసనంబుల య♦థార్హముగా నుపవిష్టులైన యా
ర్యుల వసనాంగరాగముల ♦ యొప్పగు కాంతుల చేత నెంతయుం
జెలఁగెను సత్సభాస్థలము ♦ చిత్తములెంతయుఁ బల్లవింప వే
డ్కలఁదగు పండితోత్తములు ♦ క్రిందుగనుండిరి చూచు నిచ్చచేన్. ౨౫

తే. అప్పుడా సభ విలసిల్లె ♦ నమలరీతిఁ
గా శరత్కాలమున నిశా♦కాంతుఁ గలిసి

---

1 యుధాజిత్తును-ఈపేరు విజయుఁడను మంత్రికి మాఱు పేరు. "యుధాజిదితి విజయాఖ్య మన్త్రిణో నామాంతరమ్" అని వ్యాఖ్య. 2 రాజద్ధ్వనము=ప్రకాశించుమదుఁగు.

వెలయు రాతిరి వోలెను ♦ విద్వదగ్ర్య
భూషితంబౌట నెంతయుఁ ♦ బొలుచు టరుదె. ౩ 2862

చ. ధరణి సమస్తధర్మముల ♦ తత్త్వమెఱింగిన యాపురోహితుం
డురుసభఁ గాంచి సర్వజను ♦ లొప్పుట సంతసమంది చక్కఁగా
భరతునిఁ గాంచి హారితర♦వాక్కుల నిట్లనిపల్కెఁ; నాయనా!
నిరతము సత్యధర్మమును ♦ నిర్మలరీతుల నాచరించుచున్. ౪। 2863

చ. జనములనెల్ల నెంతయును ♦ సంతస మందఁగఁ జేయుచున్న నీ
జనకుఁడు [1]విత్తధాన్యముల ♦ జానుగ నొప్పు ధరిత్రి నీ వశం
బున నిడి స్వర్గముం గనఁగఁ♦బోయెను; సత్యహితుండు రాముఁడున్
జనకునిరీతి సత్పురుష ♦ సంతతపాలితధర్మ మెన్నుచున్. ౫। 2864

తే. ఉదితుఁడౌ చందురుఁడు రుచి♦నొప్పు జ్యోత్స్నఁ
బాయకుండెడు లాగున ♦ నాయన దగు
నాజ్ఞ మీఱక యడవుల ♦ కరిగె; నిహత
కంటకంబయి సుఖదమై ♦ క్రాలుదీని. ౬। 2865

క. జనకుం డన్నయు నొసఁగిరి, ఘనకరుణన్ నీకు; నట్లు ♦ కావున నీవిం
కను ననుభవింపుమీ, ముద,మున నభిషిక్తుండ వగుము♦[2]ముదితహితుఁడవై.

సీ. ఉత్తరంబున నున్న ♦ యుర్వీశు లపరదిక్కున వెల్గు రాజులు ♦ కోరి తూర్పు
దక్షిణంబుల నున్న ♦ ధాత్రీశ్వరులు మఱి [3]యపరాంతదేశస్థ ♦ యవనులల్లె
సాగరద్వీపవా♦స్తవ్యులౌ రాజులు కోటుల కొలఁది నీ♦కున్ మణులను
గానుక లిత్తురు♦గాక; యంచు వచింప భరతుండు మానీశ♦వాక్యము విని
తే. దుఃఖమున మున్గి [4]ధర్మవి♦దుండు గాన
జ్యేష్ఠునకు భక్తిచే సేవ ♦ చేయవలయు
నన్న ధర్మంబుఁ గోరుచు ♦ నన్నరాము
సంస్మరించెను దనదగు ♦ స్వాంతమందు. ౭ 2867

[5]మ. కలహంసస్వరమట్లు కంఠరవముం ♦ గ్రాలంగ నాతండు ను
జ్జ్వలమౌ యౌవనమందు నుండియును, రా♦జ్యశ్రీసుఖంబుల్ మదిం
దలపోయంగను బూన కెంతయును స♦ద్ధర్మంబునే యెంచి వా

1 ధనధాన్యవతీం-అనిమూలము. 2 ముదితహితుఁడవై -ఇది 'ముదితామాత్యః' అనుమూలము ననుసరించి వ్రాయఁబడినది. 3 అపరాంతాః-అనిమూలము. 'అపరాంతదేశవాసినో యవనాః' అని వ్యాఖ్య. 4 ధర్మకాంక్షయా-అనిమూలము. దీనికి వ్యాఖ్య ననుసరించి యి ట్లర్థము వ్రాయఁబడియెనని యెఱుంగునది. 5 సబాష్పకలయా వాచా కలహంసస్వరో యువా, విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్-అనిమూలము. దీనికి వ్యాఖ్యాతలు వ్రాసినయర్థము సంగ్రహించి యిం దిమిడింపఁబడియెనని యెఱుంగునది.

క్కులు దుఃఖంబునఁ దొట్రుపాటుఁ గనఁగా ♦ గోర్కెన్ రఘూత్తమునిన్
దలఁచెన్ వెంటనె యేడ్చి బిగ్గఱ సభా♦స్థానాంతరాళంబునన్. ౯౪ 2868

తే. ఇట్లు విలపించి యాపురో♦హితుని దూఱి
[1]బ్రహ్మచర్యవ్రతం బూని ♦ బ్రహ్మవిద్య
నభ్యసించి స్నాతకకర్మ♦మంది శ్రుతుల
యర్థము నెఱింగి తద్రీతి ♦ ననుసరించి. ౧౦౪ 2869

క. తన రెడు రాముని రాజ్యం,బును శాస్త్రవశంబునందుఁ ♦ బోలుచు ననుం బో
లినవాఁ డెవఁడు హరించును?, ఘనుఁడౌ దశరథుని కుక్షి♦గల్గినవాఁడేన్. ౧౧

*సీ. రామునికిం దగు ♦ రాజ్యంబును హరించునే; రాముఁ డడవికి ♦ నేగినపుడె
మృతి నొందె నాతండ్రి♦యతని కుక్షిని బుట్టినట్టివాఁ డెట్లు రా♦జ్యంబుఁగోరు!
నీరాజ్య మతనిదే ♦ యేనును రాముని వాఁడనే యిట్టి యీ ♦ వరుసయందు
ధర్మమ్మునే చెప్పఁ♦దగువాఁడ వీవొగి జ్యేష్ఠుండు సద్గుణ♦శ్రేష్ఠుఁ డఖిల
తే. ధర్మవేత్త దిలీపభూ♦ధవ నహుషుల
సాటి యగువాఁడునై యిట్లు ♦ సకలసుగుణ
మండితుఁడగు కాకుత్స్థకు♦లుండు రాముఁ
డవనిఁ బొందఁగఁ దగుఁ దండ్రి♦యట్టు లిపుడు. ౧౩ 2871

క. వినుఁడీ యనార్యజుష్టం, బును స్వర్గసుఖైకనాశ♦మునగు నఘము దీ
నిని జేయుదునే నీకుల,మును జెఱుపఁగఁ బుట్టినట్లు ♦ బుద్ధిఁ దలఁపనొ. ౧౪

సీ. నాతల్లియుం జేసి♦న గురుపాతకమును నే నొల్ల నిచ్చట ♦ నిలిచియే, చొ
రంగరానట్టి య♦రణ్యమ్మునందున్న యన్నకుఁ గై మోడ్చి ♦ యాదరమున
వందనంబులు చేయు♦వాఁడ; నేరాము నేయనుసరించుచునుందు♦మనుజసింహుఁ
డైనరాముఁ డెభూపుఁ♦డగుమూఁడులోకంబులనుగూడఁ బాలింపఁ♦గనుదగునతఁ
తే. డనియె; ధర్మసమేతమై ♦ యలరు నతని
పలుకు విని సభ్యులెల్ల మి♦క్కిలి ముదంబు
నంది రామనిహితబుద్ధు ♦ లగుచు బాష్ప
ములను విడిచిరి, భరతుఁ డ♦ర్మిలి వచించె. ౧౭ 2873

క. వనినుండి పూజ్యుఁడౌ రా,ముని మరలిచి తోడితెత్తు ♦ మునుకొని తేనే
రనయేని యార్య లక్ష్మణు,నిని గూడి యరణ్యమందె ♦ నివసింతుఁ జుఁడీ!.

---

1 బ్రహ్మచర్యంబూని యను నీమొదలగు విశేషణములు భరతుఁడు చెప్పుట స్తుతిగాదనియు, రాజ్యమును బాలింప రాముఁడే యర్హుఁడుగాని ధర్మము నెఱింగిన నావంటివాఁ డర్హుని హరింపఁ బూనునా యనునభిప్రాయమును వెల్లడించుటకే యనియు నెఱుంగునది. * ఈపద్యమునకు మూలమైన "కథం దశరథా జ్జాతః" అనుదాని వ్యాఖ్యలోనిభావము సంగ్రహించి యిది వ్రాయఁబడియె నని యెఱుంగఁదగు.

చ. సరసగుణప్రవర్తనులు ♦ సాధుమనీషులునైన యిమ్మహా
పురుషుల ముందు చెప్పెదను ♦ బోయి వనంబులనుండి రాముని
న్బురికిని దోడితెచ్చుటకుఁ ♦ బూని ప్రయత్నము సర్వరీతులన్
ద్వరగ నొనర్చెదన్ గనుకఁ ♦ దారు ననుం దమిఁ గూడి రాఁదగున్. ౧౯

[1]తే. మునుపె వెట్టికి వచ్చిన ♦ జనులఁ, బాటు
పడి భృతిం బుచ్చుకొనునట్టి ♦ వారి, దారిఁ
జక్కఁ బెట్టి కాపాడంగఁ ♦ జనునటంచుఁ
బంపినాఁడ నామదియుఁ బో♦వం దలంచె. ౨౦ 2876

క. అని యివ్విధి ధర్మాత్ముం, డని భ్రాతృముఖంబునొంది ♦ యలరెడు నని యు
ర్విని జెప్పనొప్పు నాతఁడు, మునిముఖ్యులతోడఁ బలికి♦[2]ముదియఁబడుత్వరన్.

తే. మంత్రకోవిదుఁడైన సు♦మంత్రుఁ డప్డు
చెంత నిలుచున్నఁ గాంచి వ♦చించె నిట్లు
నాదు ననుమతిఁ జని పయ♦నమ్ము మీరు
కావలయునని శాసించి ♦ కడుజవమున. ౨౧ 2878

క. బలముం దోడ్కొని రమ్మా, విలంబ మిఁకఁ జేయకు మన ♦ విని మంత్రివరుం
డల ధర్మమతి వచించిన, పలుకుల కుప్పొంగి తమిని ♦ బరవస మొప్పన్.

క. తన యిష్టమునకుఁ దగువిధ,మున భరతుని యాజ్ఞ సైన్య♦మునకుం జెప్పెన్
విని యాప్రజలును సైన్యం,బును సేనాపతులు మోద♦ములు పొంగంగన్.

క. భరతుఁడు రాముని మరలం, బురికిం దోడుకొని రాఁగఁ ♦ బోవఁగఁ దమకున్
గరమాజ్ఞ నిడెనె ననుచుం, బరమామోదములతోడఁ♦బయనమగుటయున్.

చ. పురిఁగల సద్భటాంగనలు ♦ పూజ్యుని రామునిఁ దోడితేరఁగా
భరతునితోఁ బ్రయాణమగు ♦ భాగ్యము గల్గుట సంతసిల్లి వే
గ రమణులం దమిం జనఁ ద♦గం బురికొల్పిరి సైన్యనాయకుల్
త్వరపడి యుద్ధబండ్లను జ♦నంబునఁ బోవు రథాళివాజులన్. ౨౪ 2882

తే. భటులఁ గూరిచి సైన్యంబు ♦ బరవసమున
సిద్ధముగఁ జేసి, రంతట ♦ క్షితిపతిసుతుఁ
డట్లు బలమెల్ల సంసిద్ధ♦మౌట నరసి
గురుని యాజ్ఞను బొందంగఁ ♦ గోరి యచట. ౨౫ 2883

చ. అరదము నింకఁ దెమ్మనుచు ♦ నంతికమం దలరారు మంత్రితోఁ
ద్వరపడి యాజ్ఞచేయఁగ న♦తండు తదాజ్ఞను సంగ్రహించి హ

---

1 విష్టికర్మాంతికాః-అనిమూలము. 'విష్టయః భృతిమంతరేణ జనపదేభ్య స్సమానీతాః కర్మకరాః' అనివ్యాఖ్య. 2 అతిశయించు.

ర్థరతిని బొందు చిత్తమున ♦ సాధుతురంగమయుక్తమైన యొ
క్కరథముఁ దెచ్చెఁ; బౌరుష మ♦ఖండమహాధృతి గల్గు నాతఁడుఁ. ౨౮

సీ. తగినట్టిమాటల ♦ దారుణాటవినున్న విఖ్యాతు గురు రఘు♦వీరు సుప్ర
సన్నునిఁ జేయఁగా♦స్వాంతమ్మునం బూని యామనుమంత్రునితోడ♦ననియె నిట్లు;
త్వరపడి నీవేగి ♦ బలనాయకులతోడ బలములఁ గూర్పంగఁ ♦ బలికి వార
లట్లు చేయఁగఁ జేయ♦వయ్య! నేను జగద్ధితంబును గోరి వ♦నంబునందు

తే. నున్న శ్రీరామునిఁ సుప్ర♦సన్నుఁ జేసి
యిటకుఁ దోడ్కొని రానెంతు ♦ నిప్పుడనుచుఁ
బలికె; భరతాజ్ఞచే సచి♦వవరుఁ డఖిల
వాంఛలప్పుడు ఫలియింపఁ ♦ బరిఢవిల్లి. ౩౦౧ 2885

సీ. ప్రకృతిప్రధానుల ♦ బలనాయకుల సుహృజ్జనుల నెల్లను బిల్చి ♦ జనపతిసుతు
నాజ్ఞను వెలిపుచ్చె♦నంతటఁ బ్రతిగృహమున విప్రనృపవైశ్య♦లునువృషలులు
నుష్ట్రఖరంబుల ♦ నుత్తమరథములు మదకరీంద్రములను ♦ మానితకుల
సంభవములు నయి ♦ జవమునఁ బరుగిడఁ జాలినహయముల ♦ సరగసిద్ధ

తే. పఱచి భరతుని యాజ్ఞను ♦ వనమునందు
నలరు రామునిఁ దోడ్తేర ♦ నరుగవలయు
ననెడు వాంఛను వేగ ప్ర♦యాణమైరి
వనము నెప్పుడు చేరుదు ♦ మనెడు కాంక్ష. ౩౨ 2886

ఎనుబదిరెండవ సర్గము సంపూర్ణము.

## ౮౩ - వ సర్గము.

భరతుఁడు పయనమయి పోయి గంగాతీరంబు చేరుట.

క. నరపతిపుత్రుం డంతటఁ, దపుణమునఁ మేలుకాంచి ♦ తనయుత్తమస
త్తురగాన్వితరథమును శ్రీ, కరురామునిఁ జూడ నెక్కి ♦ కదలెఁ ద్వరతోఁ. ౧

క. భరతుని ముందు పురోహిత, వరసచివులు సూర్యరథము ♦ భంగి వెలసి స
త్తురగములఁ బూన్పనలరెడు, నరదంబులు నెక్కి పయన♦మై చని రంతఁ. ౨

చ. భరతుని యాజ్ఞ నప్పురిని ♦ భాసిలు తొమ్మిదివేలదంతు లా
యరదము వెంటఁబోయె; నటు ♦ లర్కకులాభరణుండు పోవ నా
సురుచిరసద్యశోమహిమ ♦ శోభిలు నాతని వెన్క నాఱువే
ల రథములెల్ల నాయుధము♦లఁ ధరియించిన యోధవారముల్. ౪ 2889

క. చనియెను సత్వరతాత్ముని, ఘనుని జితేంద్రియుని భరతుఁ ♦ గానకుఁ జనువా
నినిగూడి వాజిభటు లొ,య్యన [1]నియుతసమానసంఖ్య ♦ లరిగిరి వేడ్కఁ. ౫

1 శతంసహస్రాణ్యశ్వానాం-అనిమూలము. నియుతమనఁగా లక్ష.

సీ. కైక సుమిత్రయు ♦ [1]ఖ్యాతిఁ గాంచినయట్టి కౌసల్యయును రాముఁ♦గానమండి
తోడ్కొని వచ్చెడుఁ ♦ దోరపువేడ్కల యానంబులెక్కి ప్ర♦యాణమైరి
కైకేయి తనదు న♦కార్యమునకును బశ్చాత్తాపమందుచుఁ ♦ జనియె ముందు,
పూజ్యలౌ నరులుగుం♦పులుగూడిపోవుచు ననుజాతయుక్తుఁడై ♦యలరురాముఁ

తే. గాంచుఁ గాంక్షలచేఁ జిత్ర♦గాథ లతనిఁ
గుఱిచి వచియించుకొనుచును ♦ గోర్కు లలరఁ
బోయి రవ్వార, లీరీతిఁ, ♦ బూజ్యరామ
చంద్రునిం గూర్చి పల్కిరి ♦ సంతసముల. ౭ 2891

చ. ఘనములయట్లు నీలతను ♦ కాంతిఁ జెలంగినవాఁడు గానఁ జోఁ
దనరుచు దూరమైనను ని♦తాంతము ప్రీతి జనింప కుండునే
కనుక మనోజ్ఞు రాముఁ గనఁ♦గాఁ దగుఁ జుండి మహాభుజుండు గా
వునఁ దనివార దానములఁ ♦ బూనిక సల్పెడువాఁడు, కంటిరే!. ౭౹ 2892

క. స్థిరచిత్తుండు దృఢవ్రతుఁ, డరయఁగ నతఁడాట నాశ్రి♦తాళి మనుచు సు
స్థిరకరుణఁ జెలఁగు, లోకో,త్కరశోకనివారకుండు♦గా రాముండుర్. ౭౪ 2893

క. కనుకర్ మనశోకంబులఁ, బెనుకృప వారించునట్టి ♦ వీఁడని రామున్
గన నెప్పుడొనొ యాతఁడు, కనఁబడి నంతటనె తమసుఁ ♦ గలఁచు రవివలెన్.

క. మనశోకంబుల నడఁచును, వినుఁడీ సందేహమేల ♦ వేగమ చనుఁడీ
యని వారు చిత్రముగ నా,తని గాథలఁ జెప్పుకొనుచుఁ ♦ ద్వరపడి చనుచున్.

ఆ. ఒకరినొకరు ప్రీతు ♦ లొప్ప నాలింగన,ములను జేసికొనుచు ♦ లలితగతుల
నరిగి; రెవ్వరెవ్వ ♦ రారామునకుఁ బ్రియు, లట్టి వారలెల్ల ♦ నరిగి రంత. ౧౦౪

సీసమాలిక —

పత్త్రకతతి, పౌర♦వారంబు సంతస మలరఁ బోయెను గాన ♦ కంతఁ బద్మ
రాగాదిపావన ♦ రత్నంబులను సానఁ బెట్టువారును, నేర్పు ♦ లుట్టిపడఁగఁ
గోరి పనుల్ చేయు♦కుమ్మరుల్, తంతువాయులు మఱియాయుధ♦ములను జేయు
నట్టివారును, మయూ♦రావళి యీఁకలచేత వీవనలను ♦ జేయువారు
పెనుఱంపముల వృక్ష♦వితతి ఛేదించెడు పనివాండ్రు, దంతంబు♦లను దగంగ
గోడల నెఱిమెఱుఁ♦గుల రంజిలఁగఁ జేయువారును, మణులకు♦దారు ముఖము
లకుఁ జక్క రంధ్రంబు♦లను వేయువారును,దంతపుఁబనివాండ్రు,♦తగుసుగంధ
వస్తువులమ్మి జీ♦వనము చేసెడువారు, సున్నపుఁ బనిచేయు ♦ చున్నవారు,
ఖ్యాతిఁగాంచిన స్వర్ణ♦కారులు, కంబళ్ల నున్నట్టి ముఱికిఁ దీ♦యుపనివాండ్రు,
తలయంటి స్నానముల్ ♦ తగినట్లు చేయించువారును, నలుఁగుల♦వఱలఁ జేయు

---

1 కౌసల్యాచ యశస్విని-అనిమూలము.

వారు, వైద్యులును, ధూ♦పంబులు వేసెడు నట్టివారును, సుర♦నరుచగుగతిఁ
జేయువా, రంబర♦వ్యాయామముం జేయువారుఁ, గుట్రపువాండ్రు ♦ పల్లెలందు
గొల్లపల్లెలయందు ♦ నుల్లసిల్లెడు మేటి మనుజులు, స్త్రీముఖాల♦మునను బ్రదుకు
వారు, వేశ్యలును, గై♦వర్తకుల్ రామునిఁగనభరతునివెంటఁ ♦ జనిరి మఱియు
వేదవేత్తలు, యోగ♦విదులు సదాచారపరులగు బ్రాహ్మణుల్ ♦ భరతువెంట
నెద్దులబండ్లపై ♦ నెక్కి వేలకొలంది చనిరి మనంబుల ♦ సంతసముల

తే. నిట్లు వారెంచఱును దగి♦నట్లు శుద్ధ
వేషములఁ దాల్చి శుభవస్త్ర♦వితతిఁ గట్టి
యెఱ్ఱ గందంబులను మేను ♦ లింపుసూప
వివిధవాహనముల నెక్కి ♦ వెడలి రెలమి. ౧౭ 2897

క. సేనలు పెనుసంతసముల, మానసములు తనర రాము ♦ మంజులగుణునిం
గానలనుండి మరల్పఁగఁ, దా నరిగెడు భరతుఁ డనుచుఁ ♦ దమి నాతనితోఁ౯.

క. చని వారు కరిహయస్యం,దనములపై దూరభూమి ♦ తలమున దిగి రెం
దు నదు వినుఁడు శ్రీరాముని సఖుఁడౌ గుహుఁడు, బంధు♦ముఖ్యులతోడ౯.

క. అతఁ డప్రమాదమున భూ,మితలంబును బ్రోచుచుండు ♦ మించిన భాగో
ద్ధతి శృంగిబేరపురమా, నతనికి నావాస, మప్పు♦రాంతికసీమ౯. ౨౦ 2900

క. తనరారు జాహ్నవీనది, ఘనభంగార్భటుల వెలయఁ♦గా దానికడ౯
మనుజేంద్రసుతుని సైన్యము, చనిచని యట విడిచెఁ జారు♦జాహ్నవిచెంత౯.

తే. చక్రవాకంబు లొప్పార ♦ సాధుజలము
లలరఁగానున్న తత్తీర♦మందు సేన
విడిసె వాకైనపుశిని దగ ♦ వెలయు భరతుఁ
డాత్మసైన్యంబు సురగంగ ♦ నచటఁ గాంచి. ౨౨ 2902

క. తనసచివులతో నివ్విధి, ననియెను మీయిచ్చవచ్చి♦నట్లుగ సైన్యం
బును గంగాతీరంబున, వినిర్మలస్థలములందు ♦ విడియింపుఁ డీఁక౯. ౨౩

ఆ. ఇందు విశ్రమించి ♦ యీనది దాఁటుద, మెల్లి; స్వర్గమునకు ♦ నేగినట్టి
జనకు [1]నౌర్ధ్వదేహ ♦ శర్మసంసిద్ధికై, తర్పణంబుచేయఁ ♦ దలఁచినాఁడ. ౨౪

క. సురనదిలో దిగి యిప్పుడె, కరణీయంబుల నొనర్తుఁ ♦ గా కన సచివో
త్కర మట్లే చేయుదమని, భరతాజ్ఞను స్వేచ్ఛ సైన్య♦వారంబునకు౯. ౨౫

క. పలుతావుల వేఱ్వేఱుగ, సులలితసికతాతలముల ♦ శోభిల విడుదుల్
వెలయించి; రంత భరతుం, డలఘుతరాపన్నమూహా♦యగు గంగదరి౯. ౨౬

---

1 ఔర్ధ్వదేహనిమిత్తార్థమ్-అనిమూలము. 'ఊర్ధ్వదేహస్యసుఖప్రయోజనాయేత్యర్థః' అని వ్యాఖ్య. దీనినసుసరించియే శర్మశబ్ద మిటఁ జేర్పఁబడియె. శర్మమన సుఖము.

తే. సేన లన్నింటి విడియంగఁ ♦ జేసి సుమహి
తాత్ము రాముని గొనివచ్చు♦నట్టి విషయ
ము మదిం దలపోయుచు ♦ ఘనతరాత్ముఁ
డందు నొకచోట విడిసె గం♦గాంతికమున. ౨౬ 2907

ఎనుబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౮౪ - వ సర్గము.

గుహుఁడు భరతుని సత్కరించుట.

తే. అంత గంగాతరంగిణీ ♦ ప్రాంతమందుఁ
జక్కఁగా దిగియున్న యా♦సైన్యపంక్తిఁ
గాంచి నివ్వెఱపడి గుహుఁ♦డెంచి పలికెఁ
దనదు బంధువులం గాంచి ♦ వినుఁడు మీరు. ౧ 2908

క. సరిదధిపతివలె సైన్యం, బరుదుగ విస్తారమగుచు ♦ నగపడియెడు నే
వరునను గనినను దుదఁ గా,సరాదు మది నెంతచూచి♦నం గతమేమో. ౨

క. భరతుండు దుష్టమతియై, యరణ్యములనున్న యన్న ♦ కపకారము చే
యురతిం దానై వచ్చెనొ, పరికింపఁగ సత్యమె యిది ♦ పల్కు లిఁకేలా. ౩

క. కనఁబడియెడి నదిగో స్యం,దనమున వంశక్రమాగ♦తంబయి యురుదా
ఘనకోవిదార కేతన,ము నృపాత్మజుఁ డిపుడు దొట్ట్య♦ముం బూని వెసన్. ౪

సీ. మన దాశజనుల న♦ల్లను గట్టివేయునో మనల వధించునో ♦ మదిని దూర
మరియ సీతం డిప్పు ♦ డశవులకుం దంత్రి పనుపంగ నేగి యె♦న్వఁ సహాయ
ము జేయువారు లే♦క నిలిచి దుర్బలుఁడైన శ్రీరాఘవుం ♦ డాత్మపురికి
వచ్చినచో రాజ్య♦వైభవంబులు తన కరగతంబులు నొట ♦ కలుగదనుచు

ఆ. వానిఁ బొందఁ గోరి ♦ వరగుణు శ్రీరాముఁ
దనకు జ్ఞాతియనుచు ♦ దారుణముగఁ
జంపఁ బూని యింత ♦ సైన్యమ్ముతోఁ గూడి
వచ్చుచున్నవాఁడు ♦ వైభవమున. ౫ 2912

చ. భరతుని మాట యేటి కని ♦ పల్కుదు రేమొ తలంప మిత్రుఁడై
పరఁగెడు నాకు రాఘవుఁడు ♦ పాలకుఁడో నటుగాన మీరలె
ల్లరు రఘువర్యుకార్యములు ♦ లోఁతిపి గాపని యెంచి జాహ్నవీ
పరిసర మాశ్రయించియె ని♦వాసము చేయుఁడి యప్రమత్తులై. ౬ 2913

క. పరిచరు లెల్లరు గంగా, తరంగిణిని నాశ్రయించి ♦ తగ నద్దముగా
గురుతరసేనాయుతులై, [1]తరణులలోఁ బలల ఫలవి♦తతులం దిన్నచున్. ౭

1 తరణులు=ఓడలు.

తే. ఏటి రేవులఁ గాచుచు ♦ నెప్పుడుండ
వలయు; నావల నైదువం♦దలను గూర్చి
వయసుకాండ్రగు సుభటులఁ ♦ బవరమునకుఁ
దగినవారిని నూర్వురఁ ♦ దగు నిలుపఁగ. ౭ 2915

క. ప్రతినౌకయందు నీపద్ధతి నిలుపుడు గాక, యనుచుఁ ♦ దానాజ్ఞను జే
సి తగన్ గుహుండు బంధు,ప్రతతికి నిట్లనియె; మఱియు♦భరతుఁడు మదిలోన్.

ఉ. పాపనచిత్తుఁడౌచు రఘు♦పాలకుఁడై తగు రామునందు దు
ర్భావము లేకయుండిన శు♦భంబగు రీతిని సైన్యమిద్ధరా
పావనగంగ దాఁటెడిని ♦ భావము వేఱుగనుండెనేని తెం
పావహిలంగఁ జంపఁబడు ♦ నంచు వచించి నిషాదభర్తయున్. ౯ 2917

తే. మత్స్యమృగమాంసములు మఱి ♦ మధువుఁ బట్టు
వస్త్రములు మొదలైన యు♦పాయనములఁ
గొనుచు భరతుని కెదురుగాఁ ♦ జనియె; నంత
నానిషాదాధిపతి వచ్చు♦టపుడు గాంచి. ౧౦ 2918

క. వినయవిదుఁడు పౌరుషమునఁ, దనరు సుమంత్రుఁడు నిషాద♦ధరణీపతి రా
కను వినయమొప్ప భరతున, కనువుగఁ దెలియంగఁ జెప్పి♦యాదృతిఁ బలికెన్.

సీ. ఈనిషాదేశ్వరుం ♦ డెపుడు బంధుసహస్ర సేవితుండయి యొప్పు♦ *స్నిగ్ధతముఁడు
రాముని కితం డ♦రణ్యములం దిరుగం గుశలుఁడు వార్త♦కముల నెఱయుఁ
గావున నితఁడు నిన్♦గాంచంగఁ దగియుండు నెందు శ్రీరామాదు♦లింపలి వస
ములను వసింతురో ♦ తెలిసియుండును వీని కన శుభవచనంబు♦నతఁడు దాని

తే. విని గుహుండు నన్నుఁ గాంచెడు ♦ వేగమనియె
నంత భరతానుమతినొంది ♦ హర్షమలరి
బంధుసంయుతుఁడై వచ్చి ♦ భరతుఁ గాంచి
వినయమొప్ప గుహుం డిట్లు ♦ విన్నవించె. ౧౪ 2920

క. ధరణీశా! యీదేశము, పరికింపఁగ ద్వద్గృహోప♦వనతుల్యము మీ
రరుదెంచుట తెలియమి ని, క్కరణిం బొరపడితి మేము ♦ క్షమియింపఁదగున్.

ఆ. తలఁపవలయు సొంత ♦ దాసులయిల్లని
నీవు; గాన నిందు ♦ నిలిచి పోవ
వలయునని మేము ♦ ప్రార్థించువారము
మానుసవిని గొనుము ♦ మహితచిత్త!. ౧౬ 2922

సీ. మూలంబులను ఫల♦ములఁ బచ్చిమాంసంబు నెండినమాంసంబు♦నిందుఁ గలుగు
పలుదెఱంగుల ధాన్య♦ముల మానిషాదులు సమకట్టి రిందు నీ♦సైన్యమెల్లఁ

* స్నిగ్ధతముఁడు=ప్రియమిత్రము.

జక్కఁగా భుజియించి ♦ సంతృప్తినలరి యీరాత్రియంతయు నిందె ♦ రమణఁ గడప
వలయునంచని నేను ♦ బ్రార్థించుచున్నాఁడఁ గావున నీవును ♦ గాంక్షితాను

తే. సారముగ మేము చేయు పూ♦జలను బొంది
సైన్యములఁ గూడి మీరేగఁ ♦ జనుస్థలికిని
బోవఁదగు రేపు, దాసుని ♦ బూర్ణమతిని
గా నొనర్పుము, యని పల్కెఁ ♦ గరము భక్తి. ౧౮ 2923

ఎనుబదినాల్గవ సర్గము సంపూర్ణము.

## ౮౫ - వ సర్గము.

భరతుని గుహుఁడు పూజించుట.

చ. అన విని ప్రాజ్ఞవర్యుఁడగు ♦ నాభరతుండు సహేతుకంబుగా
ననియె మదగ్రజాత సఖ! ♦ యాదృతి నింతటి నాదుసేన కో
య్యన సకలోపచారముల ♦ నారయ నొక్కఁడవయ్యుఁ జేయఁగా
మనమున నెంచి కోరితివి ♦ మాకిపుడన్నియుఁ జేసినట్టులే. ౨ 2924

క. అనుచు మహాతేజుఁడు సిరిఁ, దనరారెడు భరతుఁ డీవి♦ధంబున మైత్రి
కనుపట్టు పల్కుఁ బల్కుచుఁ, గని యతని నిషాదపతిని ♦ గ్రమ్మఱఁ బలికెన్. 3

సీ. ఏమార్గమునఁ బోవ ♦ నిద్ధతేజుండగు నాభరద్వాజుని ♦ యాశ్రమంబు
కనఁబడు నీదేశ♦మున గహనంబుగాఁ బరఁగెడు జాహ్నవీ♦ప్రాంతభూము
లియ్యవి జలముల♦నే క్రక్కుచున్నవి కావున దాఁటంగఁ ♦ గష్టమనిన
మతిమంతుఁడా రాకు♦మారుని పల్కులు విని కరములు మోడ్చి♦వినయమలర

తే. గహనగోచరుఁడై తగు ♦ గుహుఁడు పలికె
మహితకీర్తి! నృపాత్మజా! ♦ మానిషాదు
లప్రమత్తతఁ జాపంబు ♦ లంది నీదు
వెంట వత్తురు నేను నీ♦వెంట వత్తు. ౪ 2926

క. రామునకు హాని నొనరుప, నీమార్గముఁ బట్టి యిట్టు ♦ లిట రావుకదా!
రాముం డెవరికిఁ గష్టం, బేమాడ్కిని గలుగనీయఁ ♦ డింపుకడై యనన్. ౫

క. అనుపమసేనం దీనిం, గొనివచ్చుటఁ జూడ నాకుఁ ♦ గొంత మనమునం
గనుపట్టెడి సంశయ మా,తనిఁ గననే నింత సుభట♦తతియేల? యనన్. ౬

క. భరతుం డది విని [1]యభ్రము, కరణిన్ నిర్మలుఁడు గానఁ ♦ గనుఁగొన కిట్లా
ధరణీశుఁ డనినఁ గోపస్ఫురణముఁ గన కమలవాక్య♦ముల నిట్లనియెన్. ౭

మ. అనుమానం బిటు నీకుఁ గల్గనె కటా ♦ [2]యాకష్టకాలంబు నిం
కను రాకుండును గాక; జ్యేష్ఠుఁడు గదా ♦ కాఁబట్టి రాముండు నా

1 ఆకాశ ఇవ నిర్మలః-అని మూలము. 2 మాభూత్ స కాలో యత్కష్టమ్-అని మూలము.

జనకుఁ రీతిఁగ నెన్నఁగాఁ దగుఁ జుమీ! ♦ సందేహలేశంబు నీ
మనమందుఁ ననుఁగూర్చి పొందకుము! యే♦మాత్రంబు సౌమిత్రమా !.

క. వనినుండిన కాకుత్స్థునిఁ, గొనిపోవఁగఁ బోవువాఁడ ♦ గుహ! కావున నీ
మనమున వేఱొక తెఱఁగున, నను నెన్నకు సత్యమిదియ♦నఁ గుహుఁ డంతన్.

ఆ. భరతభాషితములఁ ♦ బ్రముదితవదనుఁడై, పరమసమ్మదంబు ♦ పట్టరామి
నతఁడు మరల నిట్టు♦లనియె భరతునితో, న ప్రయత్నరీతి ♦ నవనిరాఁగ. ౧౪

క. దానిఁ విడనాడఁగ నీ, మానసమునఁ గోరితి విట ♦ మంచిది జగతిన్
గానం ద్వత్సమ ధర్మం, బూనిన ధన్యాత్ము నేను ♦ బూర్వం బెపుడున్. ౧౫

సీ. వ్యసనంబులన్ బెండు♦వడు రాము మరలఁ దోడ్కొనిరాఁగనీవును♦గోరుచున్న
వాఁడవు గాన శా♦శ్వతముగ నీకీర్తి వ్యాపించియుండు లో♦కాళియందు,
ననియిట్లుభరతుండు♦నాగుహుండునుమాటలాడుచుండంగమా♦ర్తాండుకాంతి
యల్పమయ్యెను రాత్రి♦యరుదెంచె శ్రీమంతుఁడౌ భరతుండంత♦నాత్మసేన

తే. నిలిపి యాయాయిస్థలముల ♦ నెమ్మిఁ గూర్చు
చున్ గుహుండుండఁ దానను♦జుండు శయ్యఁ
బవ్వళించిరి, సిరిచేత ♦ వఱలి ధైర్య
వంతుఁడై యున్నయట్టి యా♦భరతునకును. ౧౬ 2934

సీ. ఇంచుక శోకంబు♦నేని గల్గించెడు పాపంబుఁ జేయని♦వాని కతుల
ధర్మాత్మునకును జి♦త్తంబున శ్రీరాము చింతామయంబు న♦నంతము నగు
పెనుశోక మదయించె♦వనయంతికమునందు నుండు నడవి గాలు♦మండెడువాని
వేఁడికిఁ దపియించు ♦ వృక్షంబునుం దాని కోటరదహనుండు ♦ గూఢజనితుఁ

ఆ. డగుచుఁ బెలుచఁ దాప ♦ మందంగఁ జేసెడు
నట్లు భరతు, దహనుఁ ♦ డాత్మలోన
నిగులఁ దాపమొంద ♦ మించుఁ బొగపముచుఁ
జేసె దాన నతఁడు ♦ గాసి నొందె. ౧౭ 2935

క. అరుణాభతప్తము హిమభూ,ధర మొగిఁ దుహినాంబువులను♦దాఁ గ్రక్కెడు నె
క్కరణి నటు [1]శోకశుచిచే, భరతావయవములు స్వేద♦వారిని గ్రక్కెన్. ౧౮

[2]సీ. ధ్యానమే గుహాలందు ♦ దట్టముగా నున్న పాషాణపంక్తియై ♦ పరఁగుచుండ
నిట్టూరుపే ధాతు♦నిచయమై విలసిల్ల, దైన్యమే వృక్షసం♦తతిగఁ దనర
నాయాసమానస♦వ్యథలు శోకము నను పెనుశిఖరంబులు ♦ వెలయఁ మోహ
ములెభయంకరజంతు♦వులుగనొప్పారంగ, సంతాపములనునో♦షధులు,వెదురు

1 శోకశుచి=శోకాగ్ని. 2 ఇందు శోకమును మహాపర్వతముగాఁ జెప్పుట యాధికభారము
నవారము నను నర్మ,పా. పికె యని తెలియఁదగినది.

తే. గ్రాలుచుండంగ నిట్టి దుః♦ఖఘనశిఖరి
కైక తనయునిపైఁ బడ్డ ♦ కరణియయ్యెఁ
బురుషతిలకుండు భరతుండు ♦ పొదలు తాప
మున మనంబు గలఁగ నూర్పు♦లను విడుచుచు. ౨౦ 2937

తే. తెలివితప్పి విపత్తుల♦వలనఁ గుంది
స్వాంతతాపజ్వరంబున ♦ సంచరించి
తనదు గుంపును విడిచిన ♦ ఘనవృషభము
భంగి సంతాపమును బొందెఁ ♦ బలువిధముల. ౨౧ 2938

క. పరిజనయుతుఁడై యొక్కెడ, భరతుం డుండఁగ నిషాద♦పతి గుహుఁడును స
త్వరగతి వచ్చి నృపాత్మజు, పరిసరమును జేరి యతని♦వదనముఁ గనుచున్.

క. ఆతనికంటెను దానును, జేతస్సున మిగుల వెతలఁ ♦ జెందియు నచటన్
సీతాపతిఁగూర్చి సువా, గ్వ్రాతంబున నూఱడించి ♦ పలికె నతనితోన్. ౨౨

ఎనుబదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౮౬ - వ సర్గము.

—ఓం గుహుఁడు భరతునకు రామవిషయకవృత్తాంతములఁ జెప్పుట. ఓం—

చ. వనముల సంచరింప నల♦వాటును గాంచిన యాగుహుండు రా
ట్తనయుని నప్రమేయగుణ♦ధర్ముని నూఱడిలంగఁ బల్కి చ
య్యన మహితాత్ముఁడై తనరు♦నట్టి సుమిత్రతనూజుఁ డన్నపై
నునిచిన సాధుభావమును ♦ నొయ్యనఁ జెప్పఁదలంచి యిట్లనున్. ౧ 2941

క. శరచాపాదుల శ్రీరఘు,వరు నన్నను గావఁ దాల్చి ♦ వరగుణములచేఁ
బరఁగుచు నిద్రింపని యా, గురుభక్తినిఁ గాంచి మిగులఁ♦గూర్మిఁ బలికితిన్.

చ. ఇనకులభూషణా! యిదిగో ♦ యింపును హాయిని గూర్చు శయ్యనీ
కని రచియింపఁగాఁ బడియె ♦ హర్షసుఖంబుల నిచ్చు దీనిమీఁ
దను శయనింపవయ్య గుణ♦ధామ! నిరంతరధర్మచిత్త! మే
మనయము దుఃఖముల్ గనఁగ ♦ నష్టుల మీవు సుఖోచితుండవే. ౩ 2943

తే. నిద్రఁ గనవయ్య! శ్రీరాము♦నిం దగంగఁ
గావ మేల్కొని మేముండఁ♦గాఁ గడంగు
వార; మీలోకమున రఘు♦వరునికంటెఁ
బ్రియతరుం డొక్కరుఁడు లేఁడు ♦ వెదకి చూడ. ౪ 2944

క. కావున శ్రీరామునికై, యేవిధమునఁ దమకపడకు ♦ మిటు మేలుకొనం
గా వలెనే నీయెదుటన్, బావనచరితా! యసత్య♦వచన మనుదునే. ౫ 2945

సీ. శ్రీరాము సత్కృప◆చేత నీజగమునయం దేను విస్తృత◆యశమును, బర
లోకనాథనభూతి◆మై కనుపట్టెడు ధర్మంబు, న్యాయల◆బ్ధమగు విత్త
మును బొందఁగోరెద ◆ విను మట్టివాఁడనౌ నే విలుఁదాలిచి ◆ నిఖిలబంధు
సంయుతుండను నయి◆జానకితోఁ గూడి శయనించియున్న యా◆సాధుమతిని
తే. బ్రియసఖుని రామచంద్రునిఁ ◆ బ్రియముమీఱఁ
గాచుచుండెద, నెప్పుడీ ◆ కాననములఁ
దిరుగుచుందును గాన నేఁ ◆ దెలియనట్టి
స్థలము లిందెవ్వియును లేవు ◆ సత్యమిద్ది ౭ 2946

క. చతురంగసైన్యములు వచ్చి తాఁకినను నోర్వఁ గలము ◆ సిద్ధంబిది; యం
చతిశయమువమునఁ బల్కితి, నతఁ డెంతో మహాత్ముఁ డౌట◆నాదృతి మీఱన్.

క. అనిశము ధర్మంబున దృష్టిని నిల్పినవాఁడు గానఁ ◆ జెప్పెడు మావా
క్యనికరముల విని [1]మమ్ముం, గని సరసపువచనములను ◆ గడువడిఁ దేల్చెన్. ౮

క. దీనతఁ గనుచున్ మఱియున్, దా నిట్లనియెన్ సుమిత్ర◆తనయుఁడు వినుఁడీ
జానకితోడన్ దశరథ, సూనుం డిలపైఁ బరుండఁ ◆ జూచెదు నాకున్. ౯

ఆ. ప్రాణధారణంబె ◆ బహుకష్టముగ నున్న, దే యికెట్లువచ్చు ◆ నిపుడు నిద్ర
యితరసుఖము లేవి◆యే నెట్లు పొందెదనో, వినుము రాము మహిమ◆విన్నవింతు.

క. సురదైత్యులు తాఁకిన సంగరమున నేరాము నోర్వఁ◆గాఁ జాలరో దా
శరథి యతం డిపు డిలపైఁ, బరుణేఁచుతఁ తృణములందుఁ ◆ దా శయనించెన్.

క. కనుమా! నిష్ఠావరతి మా, జనకుఁడు భూస్థిపతేముల ◆ సాధుతపమ్ముల్
ఘనభక్తిఁ జేసి యావర, తనయునిఁ గనె లక్షణములఁ ◆ గాంచెను వానిన్.

క. ఈతం డొకండె పితృభక్తిలక్షణయుతుం ◆ డౌ నీతం డీ
రీతిగఁ గానకు రాఁగా, భూతలపతి బ్రదుక లేఁడు ◆ పో, యిఁక మీఁదన్. ౧౨

క. చిరకాలము జీవింపఁడు, ధర వేగమె విధవయౌను ◆ నప్పు డిది సుమా
తరుణులు సంతోషపురమున, సిగము విలాపించి దాని ◆ గాంచి మిగులన్. ౧౩

ఆ. ఇప్పు డూరునందు ◆ రెంతయు శబ్దంబు, వెలసి యడఁగియుండఁ◆గలదటంచుఁ
దోఁచుచున్న దందుఁ ◆ దోయజనేత్ర కౌసల్య నృపతి నాదు ◆ జననియుసగ.

క. మనసులు కుందినవారౌట నిఁకన్ జీవింప లేరట◆కన్ బ్రదికిరిపో
వనటం బొగులుచు నీరే,యిని గడుపుదు రంత మీఁద ◆ నీల్గుట నిజమా. ౧౫

సీ. శత్రుఘ్నుఁడను నాత్మ◆జాతుని ద్వైతీయుఁ
గనుచు నొక్కపుడు నా◆జనని బ్రదికి

---

[1] మమ్మున్-అను నీబహువచనము "ఏవ మస్మాభి రుక్తేన" అను మూలానుసారమే యని తోఁచుచున్నది.

యుండిన నుండునే♦మో కాని వీరునిఁ
గన్నట్టి కౌసల్య ♦ కడుఁ దపించి
మృతినొందుఁ, [1]గార్యంబు ♦ మించిపోయెను మించి
పోయెఁ గార్యం బెల్లఁ ♦ బోయెఁ బోయె
రాజ్యంబునందు శ్రీ♦రాముని నునుపక
తనకోర్కె సాగమి ♦ జనకుఁ డీల్గఁ

తే. గలఁడు; జనకుండు మృతినొందు ♦ కాలమందు
నతనికిఁ జేయఁదగినకా♦ర్యములనెల్లఁ
జక్కఁగాఁ జేయునట్టి యా♦సత్కుమారు,
లెల్ల ప్రజలుఁ, గృతార్థు లిం♦కేమిచెప్ప. ౧౮ 2957

సీ. సుందరచత్వర♦బృందంబు లలర, విభక్తమహాపథ ♦ భాసురమయి
ప్రాసాదములు హర్మ్య♦పంక్తులు దనరంగ స్వర్ణరత్నాఢ్యమై ♦ సామజాళి
హయరథనిబిడమై ♦ యతులవాద్యధ్వనుల్ ప్రతిశబ్దముల నీన ♦ బహుళమంగ
ళములు పూర్ణంబులై ♦యమరంగ, సంహృష్ట పుష్టజనంబులు♦పొలుచుచుండ

తే. నలరి యారామములు మహో♦ద్యానములును
నిండియుండంగఁ దనరుచు ♦ నిఖిలదేవ
తోత్సవంబుల వెలయు న♦యోధ్యయందు
[2]శర్మయుక్తులై విహరింపఁ ♦ జాలువారు. ౨౧ 2958

చ. వనిఁ బదునాలుగేండ్లు చన ♦ వారకచేసిన యాప్రతిజ్ఞఁ జ
క్కని విధమొప్పఁ దీర్చుకొని ♦ క్రమ్మఱ క్షేమముగాఁ జెలంగురా
మునిఁ దమిఁ గూడి శర్మమునఁ ♦ బొంగుచు మేము నయోధ్య, నో నిషా
దనృపవరేణ్య! చేరుదుమె ♦ దారుణదుఃఖము దాఁటువారమే. ౨౨ 2959

చ. అనుచు మహాత్ముఁడౌ దశర♦థాత్మజుఁ డీవిధి నేడ్చుచుండఁ నన్
గనుచు వచించుచుండఁగఁ ద♦గన్ గడచెన్ నిశ యద్ది తెల్లవా
ఱిన రవితోఁచెఁ జక్కఁగ[3] నె♦ఱిం దగు వారలు జాహ్నవీతటం
బున నిటనే జడల్ భరత ♦ పొంకముగా ధరియించి రవ్వలన్. ౨౩-౪ 2960

క. నేనును వారల సుఖముగ, నీనది దాఁటించినాఁడ ♦ [4]నిభవరసమతం
గానంబడి బలమొప్పఁగ, భూనాథాత్మజులు వారు ♦ పొలిచిరి మిగులన్. ౨౫

ఆ. [5]అరుల నేఁచువార ♦ లట్లు వల్కలముల, జడలఁ దాల్చి తీవ్ర♦చాపవిశిఖ

---

1 అతిక్రాంత మతిక్రాంత మనవాప్య మనోరథమ్-అనిమూలము. దీనియర్థమే విస్తరించి యిట్లు వ్రాయఁబడినది. 2 సుఖితా విచరిష్యంతి రాజధానీమ్-అనిమూలము. 3 నెఱిన్ = అందముచే. 4 కుంజరయూథపోపమా - అనిమూలము. దీనికే ఇభవరసమతన్ - అని వ్రాయఁబడినది. 5 పరంతపా-అనిమూలము.

ములను ఖడ్గములను ♦ విలసిల్లి నలుదెసల్, గనుచు సీతఁగూడి ♦ వనికిఁ జనిరి.

ఎనుబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౮౭ - వ సర్గము.

{ రాముఁడు జలము లాహారముగా గారచెట్టుక్రిందఁ బండుకొనిన వృత్తాంతము గుహుఁడు చెప్పుట. }

క. అని యిట్లు గుహుఁడు శ్రీరాముని యును దమ్ముని యు గనున♦మును జెప్పిన దా
నిని నప్రియవాక్యంబును, విని భరతుఁడు మదిని జాల♦విధములఁ [1]దలఁచెన్.

క. తనకోరినరీతిని రఘు,తనయుఁడు మరలునొ మరల్పఁ ♦ దగక చనునొ యం
చును దలపోయుచుఁ జింతం, గని పరవశుఁడయ్యె దిక్కు ♦ గాననిరీతిన్. ౧

సీ. సుకుమారుఁ డతిబల♦శోభితుండు మృగేంద్ర భుజశిరుండును జారు♦పుండరీక
విస్తృతనేత్రుండు ♦ ప్రియదర్శనుం డెల ప్రాయము గల్గిన♦వాఁడు నయిన
భరతుఁ డించుకసేపు ♦ ప్రజ్ఞ తప్పియు వేగ తెలివొంది యన్నకుఁ ♦ గలిగినట్టి
కష్టంబులకు మది ♦ కడుఁ బల్లటిల్లఁగా నంకుశతాడిత ♦ హస్తిపోల్కి

తే. ధరఁబడియె; నంత నతని చెం♦తనె యనుజుఁడు
నున్నవాఁడొట దురవస్థ ♦ నొందియున్న
భరతునిం గౌఁగిటం జేర్చి ♦ వగల స్రుక్కి
యేడ్చెఁ బెద్దయెలుంగున ♦ నిలకు సొరగి. ౪ 2965

క. పతిఁ బాసిన దుఃఖంబున, నతిశయముగ స్రుక్కి దీన♦లై యుపవాస
స్థితిఁ గంది కృశించెడు నా, సతులెల్లను వచ్చిరటకు ♦ సరగున నంతన్. ౫

క. ధరణిఁబడి తెల్వి దప్పిన, భరతునిఁ జుట్టుకొని యేడ్వ ♦ వ్యథలం గని యా
తురమునఁ గౌసల్యయు వే, పరిసరమున కేగి సుతుని ♦ బట్టుకొని తగన్. ౬

తే. కౌఁగిటం జేర్చుకొనియె; నా♦కమలనేత్ర
యాతనిం బట్టుకొని [2]దూడ♦యందుఁ బ్రీతి
నలరు ధేనువు వత్సను♦వలెఁ దపించు
చుండి వగఁ గుందు కౌసల్య♦యును గుమారు. ౭ 2968

క. కనుఁగొని యేడ్చుచుఁ బలికెన్, దనయా! శ్రీరామువిరహ ♦ దారుణరోగం
బున బాధింపంబడునే, తనువిది, మాప్రాణములిఁకఁ ♦ ద్వదధీనములే. ౮

క. తనయుఁడు తమ్మునితోడన్, వనమునకుం బోయినాఁడు ♦ పతి మృతుఁడయ్యెన్
గనుక నిఁకన్ నీవొకఁడవె, తనయా! మాకెల్ల దిక్కు ♦ తథ్యము సుమ్మా. ౯

క. నీముఖమై వర్ణ్యంబును, రాముఁడు గనిదైన మరలి ♦ రాకుండఁ దటం

---

1 ధ్యాన్నం జగామ-అని మూలము. 2 వత్సలాస్యం యథావత్సమ్-అనిమూలము.

చీమాడ్కి బ్రదికియున్నా,మో మానితచిత్త! పుత్ర! ♦ యురుగుణనిలయా!.౯

సీ. అనుజాతునిఁ గూర్చి ♦ యైన నా కేక పుత్రుండగు రామచం♦ద్రుని గుఱించి
యైన నీకెవత్తైన ♦ నప్రియవార్తను దెలిపిరే? యని యూమె ♦ పలికె; నంత
నమ్మహాకీర్తియు ♦ నల్లనఁ దెలివొంది విలపించుచునె తల్లి ♦ విధముఁ గాంచి
జననిరో నీవు చె♦ప్పినవార్త యేమియు వినలేదు భయమొందఁ♦జనదటంచు

ఆ. నూఱడించి గుహుని ♦ నురుదుఃఖభాగునిఁ
గాంచి పలికె నన్న♦గారు రాత్రి
శయనమిందు నెచట ♦ సల్పిరి? సీతయు
నెందునుండె ననుజుఁ ♦ డెటఁ బరుండె?. ౧౧॥ 2972

క. వారేమి భుజించిరో యే, యేరీతిఁ బఱుండి నారొ ♦ యిదియంతయు నా
కారసి తెల్పుము, యన గుహుఁ, డారాజకుమారుతోడ ♦ [1]నాత్మనలరుచున్.

క. తనచెంత కతిథియై యు, [2]జ్జనపతి పుత్రుండు ననుఁగు♦సఖుఁడు హితుఁడునై
తనరెడు శ్రీరాముఁడు రాఁ,గను దానేరీతిఁ బూజఁ ♦ గావించెఁ దగన్. ౧౨॥

తే. దానినంతయుఁ జెప్పఁగాఁ ♦ బూని యిట్టు
లనియె; రామునిభోజన♦మునకు బహువి
ధములుగా నన్నములను భ♦క్ష్యముల, వివిధ
ఫలములను జోష్యలేహ్యాది ♦ పరికరముల. ౧౩॥ 2975

క సమకట్టించితినే; [3]దా,నము సేయుటయే తలంప ♦ నరపతులకు ధ
ర్మమునా నొప్పారెడు ధ,ర్మము నెంచి గ్రహింపఁడయ్యె ♦ క్ష్మాపతివానిన్.

చ. అనుపమసత్యశౌర్యుఁడగు ♦ నారఘువీరుఁడు వానినెల్లఁ గై
కొనుమని నాకె యాజ్ఞ నిడె ♦ కూరిమితోఁ జెలికాఁడ! యంచు న
న్ననునయ మొప్పఁగాఁ బిలిచి ♦ యల్లన నిట్లను; క్షత్రియాన్వయం
బున [4]జనిఁ గన్న మాకెపుడు ♦ పోలదు సుమ్ము ప్రతిగ్రహంబిలన్. ౧౪॥ 2977

ఉ. దానము మాత్రమే తగును ♦ దథ్యమిదంచు మృదూక్తిచే సమా
ధానము పెట్టెఁ గీర్తిని ని♦తాంతము రాజిలు రాముఁ; డంతటన్
జానుగ లక్ష్మణుం డరిగి ♦ జాహ్నవినారిని దెచ్చి యీయఁగాఁ
దాను గ్రహించి త్రాగి వని♦తామణితో నుపవాసముండెఁ జూ. ౧౭ 2978

తే. అంత లక్ష్మణుఁ డారాముఁ ♦ డాదరమునఁ
ద్రాగ మిగిలినజలమును ♦ ద్రాగె; వారు

---

1 సోఽబ్రవీద్భరతం హృష్టః-అని మూలము. 2 ఈవిశేషణములు మూలానుసారములే.
3 క్షత్రధర్మ మనుస్మరన్-అని మూలము. 'దానమేవ క్షత్రధర్మః నత్వా దానమితి' అనివ్యాఖ్య.
4 జని=పుట్టుక.

ముగురు వాఙ్నియమంబునఁ ♦ బొలిచి నిశ్చ
లాత్ములగుచు నుపాసించి ♦ రపుడు సంధ్య. ౧౮ 2979

క. తరువాత లక్ష్మణుఁడు స,త్వరముగఁ దాఁ బోయి తెచ్చి ♦ దర్భలశయ్యన్
సుకుచిరముగఁ గావించెను, ధరాత్మజను గూడి యెలమిఁ♦దచ్ఛయ్యపయిన్.

క. మీయన్న పవ్వళించెను, నాయన! యీతీరమందు ♦ నడుచుటఁ బంక
ప్రాయముగ భూమియుండుట, నాయిరువురి పాదములకు ♦ నది తగులుటచేన్.

ఆ. జలము తెచ్చి రామ♦చంద్రుని పాదముల్
తానె కడిగె; భూమి♦తనయ జలము
లందుకొనుచుఁ దానె ♦ యంఘ్రిలఁ గడుగుకొ
నియెను; వారలంత ♦ నిదురపోవ. ౨౦ 2982

సీ. సౌమిత్రియును దూర♦భూమిని నిలుచుండి వారిఁ గాచుచునుండె♦శ్రీరఘువరుఁ
డాధరణీజతో ♦ నారాత్రి శయనించి నది యిందె గారచె♦ట్టిదియె సుమ్ము!
దర్భలు నివియె నం♦తట లక్ష్మణుఁడు పరంతపుఁడు గావున నల్లె♦త్రాటి దెబ్బ
తగులకుండఁగ స్వహ♦స్తమునకు బంధింపఁ దగిన [1]తలమునుహ♦స్తకవచమును

ఆ. దాల్చి బాణపూర్ణ♦ధనువు నెక్కిడి చేతఁ, దాల్చి నిద్రవోక ♦ తాను రాత్రి
వారి చుట్టుఁ దిరిగి ♦ యారయుచుండెను, ధనువు బాణములను♦దాల్చి నేను.

క. అతఁడేమి చేయునో యని, మతి సంశయమంది బంధు♦మండలి నను ను
ద్ధతి మీఱఁ గొలువ [2]నింద్ర, ప్రతిమునిఁ గాపాడుచుంటి ♦ రాముని రేయిన్.

ఎనుబదియేఁడవ సర్గము సంపూర్ణము.

---

౮౮ -వ సర్గము.

{ సీత యాభిరణములలోని బంగరుపొడి గారచెట్టుక్రింద రాలియుండుటకు భరతుఁడు శోకించుట. }

చ. అనుచు నిషాదభూమివిభుఁ♦డాడిన నాభరతుండు మంత్రులున్
విని యలచెట్టుక్రిందికిని ♦ వేగమ పోయిరి [3]రాఘవుండు శ
య్యను రఘువీరుఁ డానిశి, మ♦హత్తరకష్టము లొందుచుం బరుం
డెనె యను చింతచేఁ గని క♦డింది విచారముతోఁ బ నంతటన్. ౧ 2985

క. జనయిత్రులఁ గన్గొని యి, ట్లనియె మహాత్ముఁడగు రాముఁ ♦ డారాత్రియటన్
దనివొంది పవ్వళించెను, గన నయ్యెను నలిగినట్లు♦గాఁ బవళింపన్. ౨ 2986

---

1 తలాంగుళిత్రవాన్-అనిమూలము. 2 మహేంద్రకల్పమ్-అనిమూలము. 3 రాఘవుండనఁ గానిట భరతుఁడు.

సీ. సుమహితభాగ్యాభి♦శోభితంబగు సత్కులంబున జనియించి ♦ లలితభోగ
శాలియై తగిన ద♦శరథుని కడుపున జనియించినట్టి వి♦శాలకీర్తి
రామచంద్రుండు ధ♦రన్ శయనించియె నిదురింపఁదగునె, యే♦నిర్మలాంగుఁ
డతిమృదులంబగు ♦ నజినంబు పైభాగమందునఁ బఱచి కు♦లానుమాప
తే. ముగ సమూల్యంబుగా నుండఁ♦దగిన శయ్య
లను బరుండినవాఁ డిప్డు ♦ లలిధరణిని
బవ్వళించె నదెట్లొ నే♦ పలుకఁ జాల
మఱియు నాయన్న దివ్యవి♦మానములను. ౮ 2987

సీసమాలిక:—

ప్రాసాదతలముల ♦ వఱలు కూటాగారములను; రాజతహైమ♦ములయి దివ్య
శర్మదాయకములౌ ♦ శయనంబు లలరారఁ, బుష్పసంచయములఁ♦బొలిచి చంద
నాగరువాసనల్ ♦ హర్షంబు నింపంగ శ్వేతాభ్రకాంతులఁ ♦ జెలఁగి శుకని
నదము లొప్పంగఁ, జ♦ల్లఁదనంబు చెలువారఁ గర్పూరవాసనల్♦గ్రాలుచుండఁ
గాంచనమయభిత్తి♦కాసమూహంబుతో నలరుచు మేరువు♦వట్లు వెలయు
మంచిమేడలపైన ♦ నంచితరీతిని శయనించువాఁడయి ♦ సరస గీత
ములును విపంచికా♦ముఖనిస్వనంబులుఁ బరిచారికావరా♦భరణరవము
లట్లె మృదంగాది ♦ హారిరవంబులు బోగుకొనంగ నె♦ప్పుడును నిద్ర
మేల్కని ప్రొద్దున ♦ మించువేడుక వందిసూతమాగధజన♦స్తోమమెల్ల
ననురూపగాథల ♦ ఘనసుతులను వినుతింపఁగాఁ బడుచును ♦ సంపదలను [లఁ
వెలయుచుండును గదా♦యల రామచంద్రుఁడీయిల నెట్లు శయనించె♦నెఱుఁగఁజా
. గ్రూరమృగంబుల ♦ యారావములకెట్లు మేల్కొనుచున్నాఁడు♦మిగులభక్తి
తే. సేవకులు పరిచర్యలు ♦ సేయుచున్న, వాఁడిపుడు వని నేరీతి ♦ వఱలువాఁడొ
యొంటిగా, గడ్డిమీఁద నె♦ట్లొ పరుండె, నేను [1]వినిని నమ్మంగ♦నేర నిపుడు. ౯

క. ఇది సత్యము గాదని నా, మదిఁ దోఁచుచున్న దిప్డు ♦ మానస మిది మో
హదశం బొందినదేమో, యిది కలయా నిశ్చయముని ♦ యెంచెద నేనున్.

క. కలయే కాకుండినచో, బలశాలికి రాముని కివి ♦ వసుధాస్థలిలోఁ
గలుగన్ వచ్చునె? యేవే,శలనైనన్ స్వప్న మని త♦లంచెద నాత్మన్. ౧౦
తే. దశరథున కాత్మజుండయి ♦ తనరు రాముఁ
డిలఁ బరుండంగఁ గలిగె నిం♦కేమిచెప్ప
వచ్చు నిక్కాలమునకంటె ♦ బలయుతంబు
దైవముంగూడఁ గాదిది ♦ తథ్యము సుమి!. ౧౧ 2991

క. జనకుని పుత్రిక ప్రియదర్శన దశరథు కోడలు రఘు♦రామునకుఁ బ్రియాం

[1] అశ్రద్ధేయమిదమ్-అనిమూలము.

గన యిట్టి సీతయును ధర,ణిని దా శయనించె నింక ♦ నేనే మందున్. ౧౩

సీ. ఇదిగో నాయన్నయు ♦ నిందుఁ బరుండిన శయ్య కన్పడియె నీ♦శయ్యపైని
బవళించి నిదురించు♦పట్టునఁ గఠినమౌ నేల యొత్తుకొనంగఁ♦జాల శ్రమముఁ
బడి పొరలులలెల్ల♦బాగుగఁ దెలియంగ నయ్యెఁ గావున రాము♦నవయవముల
యొత్తుడువలన నిం♦దున్న దర్భలు చాల నలఁగియున్నవి; త్వాత♦నయయుదివ్య

తే. శయనమున నిందు మార్గసం♦జనితకష్ట
మున స్వకీయవిభూషణ♦ములను దీయ
కయె పరుండినదనియెంతుఁ ♦ గనుక నిందు
నందుఁ గనకపరాగంబు ♦ లగపడియెడి. ౧౪ 2993

తే. అట్టితటి సీతపై చీర ♦ యరయ నిందుఁ
దగిలియుండుట తెలియన♦య్యెఁ గద కాన
నచ్చటచ్చటఁ దంతువు ♦ లమలకాంతి
వెలయుచున్నవి నేనేమి ♦ పలుకఁ గలను. ౧౫ 2994

చ. తనుఁ గని యెల్లవారను ని♦తాంతము చింతిలునట్టి దుర్దశం
గనిన పతివ్రతామణియు ♦ క్ష్మాపతివర్య ప్రియాత్మజాత యిం
కను సుకుమారి యిట్టిదగు ♦ క్రమగుణోన్నత సీత యిట్టి శ
య్యను బవళించియే వెతల ♦ నందకయున్నది కాననే నెదన్. ౧౬ 2995

క. సతులకుఁ బతిశయ్య సమం,చితసుఖద మ్మనుచును దలఁ♦చెద; రాముఁడు భూ
మితనూజాన్వితుఁడై యీ, క్షితిఁ జేరి యనాథుని గతిఁ ♦ జెందెనె వెతలన్.

తే. నానిమిత్తమె యీకఠి♦నంపు శయ్య
పైని శయనించెఁ గద! యేమి ♦ పలుకువాఁడ
నయ్యయో! నే నదెంతపా♦పాత్ముఁడనొకో
శ్రమము పాలుగఁ జేసితి ♦ రామచంద్రు. ౧౮ 2997

సీ. సార్వభౌమాన్వయ♦జాతుండు లోకైక సమ్మతుండును మఱి ♦ స్వర్గలోక
సంప్రియుండును దుఃఖ♦సరణి కనర్హుండు శర్మంబునే పొందఁ ♦ జాలువాఁడు
కువలయశ్యాముండు ♦ సువిహితమానసుండును బ్రియదర్శనుఁ♦డనఘుఁ డరుణ
నయనుండునగు నిట్టి ♦ నాయన్న జనిగుణములఁ బ్రజారంజన♦మునను దేహ

తే. లక్షణంబుల రాజ్యంబు ♦ లలివహింపఁ
జాలియుండంగ భూరిరా♦జ్యంబు విడిచి
కఠినభూమిని శయనించెఁ ♦ గా యదెట్లొ;
లక్ష్మణుండె మహాభాగ్య♦లలితుఁ డిపుడు. ౧౯ 2998

క. ఈలాటి కష్టతరమౌ, కాలంబున రాము విడువ♦కయె సేవింపం
జాలెఁ గావున ధన్యుం, డే లక్ష్మణుఁ డెన్నిచూడ ♦ నెన్నివిధములన్. ౨౦

క. జనకజ సిద్ధార్థయె యగు, వనమునకున్ జనియె రాము♦భద్రుని వెంటన్
మన మాతని విడిచితి మిం,క నతం డిటనుండి మనము ♦ కానకు రాఁగన్.

క. కని మన సేవలఁ గొనునో, మనమునఁ గైకొనఁడొకొ యను♦మానముతోఁ జేన్;
మనుజేంద్రుఁడు మృతుఁడయ్యెను, వనముల కీ రాముఁ డిపుడు♦వచ్చెను గానన్.

క. ధరణి యిది యిప్డు నడిపెడు, పురుషుఁడు లేనట్టి యోడ♦పోలిక భూనా
థరహితమై శూన్యాకృతిఁ, బరికింపఁగఁ దోఁచె నేమి♦పల్కుదు నింకన్. ౨౨

[1]చ. జనపతి లేకయుండినను ♦ క్ష్మాతలమెల్ల నుపద్రవంబులం
గన కిపుడుండ నేమనినఁ ♦ గప్రభుజాబలమొప్పు రామచం
ద్రుని గురుశక్తిఁ గావఁబడి ♦ యాధిగనొప్పిన భూమి రాముఁడున్
వనముల నుండినన్ గొనఁగ ♦ వాంఛను బూనఁడు భూపుఁ డెప్పుఁడున్. ౨౩

సీ. ప్రాకారరక్షణ ♦ పరివర్జితంబయి, యపగతసన్నాహ ♦ హయగజమయి
యపిహితద్వారమై ♦ యప్రహృష్టబలంబునై యరక్షితమయి ♦ యఖిలసాధ
నవిహీనమై రక్ష♦ణంబును గానక దుర్దశలకుఁ జిక్కి ♦ తోఁచుచున్న
యీయయోధ్యను గర♦శాభిపూరితభక్ష్యములఁ బోలె శత్రురా♦జులుగొనంగ

తే. మనము లందైనఁ దలఁప, రీ♦దినము మొదలు
ఫలములన్ దుంపలను దిని ♦ పరమనియతి
జడలు దాలిచి నారవ♦స్త్రములఁ గట్టి
కొని [2]పరుండెద గడ్డిపై♦ననొ ధరణినొ. ౨౪ 3004

క. ఆతఁడు చేసిన శపథం, బీతఱి నే నాశ్రయించి ♦ యీవనములలో
నే తృప్తిగ [3]శిష్టాబ్ద, వ్రాతము వసియించియుండు♦వాఁడ నతనికై. ౨౫

తే. ఇట్లు చేయుటచే రాముఁ ♦ డెన్నినట్టి
ప్రతిన వ్యర్థము కానేర ♦ దితనికొఱకు
వనమునం దేను నివసింప ♦ ననుజుఁడైన
యట్టి శత్రుఘ్నుఁడును నను ♦ ననుసరించు. ౨౬ 3006

క. అనుజుండయిన సుమిత్రా, తనయునితోఁ బూజ్యరీతిఁ ♦ దనరెడు రాముం
డు నయోధ్యను బాలనమునఁ, దనుపంగలఁ; డార్యులైన ♦ ధరణీదివిజుల్. ౨౭

క. రాముని నభిషేకింతురు, మామకవాంఛితము దీని ♦ [4]మద్గృహదివిజుల్
ప్రేమించి తీర్తు రా నే, రామునికడ కరిగి భువి శి♦రముసోఁకంగన్. ౨౮ 3008

ఆ. వందనములు సల్పి ♦ బహువిధంబులఁ బ్రస
న్నునిగఁ జేయువాఁడ ♦ మనమున నతఁ

---

1 ప్రథమపాద మవతారిక ననుసరించి వ్రాయఁబడినది. 2 అద్య ప్రభృతి భూమౌతు శయిష్యేஉహం తృణేషువా-అని మూలము. 3 శిష్టాబ్దవ్రాతము = మిగిలినవత్సరములు. 4 మద్గృహదివిజుల్ =మాపలదేవతలు.

డలరఁడేనియుందు ♦ నడవి నాతనిఁ గూడి
[1]వలవ దనఁగఁ దగఁడు ♦ భక్తు నన్ను. ౩౦ 3009

ఎనుబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

## ౮౯-వ సర్గము.

భరతుఁడు భరద్వాజాశ్రమమున కేగుట.

చ. ఇనకులజాతుఁడౌ భరతుఁ ♦ డెట్టులో యానిశి జాహ్నవీతటం
బున నె వసించి యుండి యటఁ ♦ బ్రొద్దున లేచి ప్రియానుజన్మునిం
గని వచియించె; నిద్రకును ♦ గాలమె యిద్ది కుమార! లెమ్ము యిం
కను శయనించె దేల? త్వర♦గాఁ జని [2]యాగుహుఁ దోడి తెమ్మికన్. ౧ 3010

ఆ. [3]నీకు శుభము గలుగుఁ♦గాక యాగుహుఁడు దాఁ
టించు మనల నది న♦టంచుఁ బలుకు
సరసవాక్యములను ♦ శత్రుఘ్నుఁడును బురి
కొలుపఁబడి వచించె ♦ లలిత[4]భణితి. ౨ 3011

క. నీవు వచించిన యార్యుని, వేవిధములఁ దలఁచుకొనుచు ♦ విహ్వలమతినై
యీవిధి మేల్కొని యున్నా, నేవిధమున నిద్రవచ్చు ♦ నిప్పుడు నాకున్. 3

చ. అని వచియించె నిట్లిరువు ♦ రా నరకేసరు లాదరంబుతోఁ
గనరుచు మాటలాడుకొనఁ ♦ గత్సనుయంబున నే, గుహుండు వ
చ్చి నిలిచి చేతు లొగ్గియె వ♦చించెను [5]రాఘవ! యీనదీతటం
బున సుఖరీతి రాతిరిని ♦ బుచ్చితివే కద సానుజుండవై. ౪ 3013

తే. నీకు నీసైన్యమునకును, ♦ నేకరణిని
గాని యేలాటి బాధలు ♦ కానుపింప
కుండఁ గాలంబు గడచెనే ♦ యొప్పుగ నన
గుహుని నెయ్యంపుఁ బల్కుల♦కున్ మనమున ॥ 3014

---

1 వసే వస న్యాహ్వాతి మా ముపేక్షితుమ్ - అనిమూలము. నార్హాతి యనుట భక్తిపరత్వము చేతనేగాని యితరబుద్ధిచేఁ గాదని తెలియఁదగు. 2 గుహునిఁ దోడ్కొని రమ్మని తమ్ముని నియోగించుట రామదర్శనపరత్వముచేఁ గాని పరిజనులు లేకగాదని యెఱుంగునది. 3 ప్రాతరాశీర్వాదము వృద్ధాచారమని యెఱుంగవలయు. 4 భణితి-ఇది సాధుపాఠము. ఫణితి యనునది యించుక యాలోచించి ప్రయోగింపఁదగినపాఠము. మేదినీకోశమున భాదివర్గమున నిది చేర్పఁబడినది. వాచస్పత్యము మొదలగు నాకరములయం దిట్లే ప్రయోగింపఁబడియున్నది. మాధవాచార్యకృత ధాతుపాఠమున నిది భాదిగానే వ్రాయఁబడినది ఇట్లుండఁగా నిది ఫణితి యని సామాన్యముగా వాడఁబడుట యేలొకో తెలియరాకున్నది. ఫణితి యన నాగటిచాలని యాకరముల నున్నది. 5 రాఘవశబ్దము కాకుత్స్థశబ్దమువలెఁ బ్రయోగింపఁబడినది.

క. రామాసక్తుండగు నా, భూమీశకుమారుఁ డలరి ♦ పొందుగఁ బలికెన్
నీమేదిని సౌఖ్యముగా, నే మాకున్ దోఁచె రాత్రి ♦ యిట నీవలనన్. ౬౹

చ. వలసిన పూజలన్నియును ♦ బాగుగ మాకొనఁగూడె నింకఁ గా
వలసిన [1]దీసురాపగను ♦ వైళమె దాఁటుటయే కదా జవం
బలరఁగ నీదు సేవకులు ♦ [2]హారితరంబులఁ బెక్కులైన నా
కలఁ గొనివచ్చి యీనదిని ♦ గ్రన్నన దాఁటఁగఁ జేయఁగాఁ దగున్. ౮ 3016

చ. అన విని యారఘూద్వహుని ♦ యాజ్ఞ నిషాదవిభుండు వేగమే
చని పురిఁజొచ్చి బంధుజన♦సంతతినిం గని మేల్కొనుండు లెం
డని పురికొల్పి [3]మీకు శుభ♦మా నిఁక నోడలనెల్లఁ దేఁ దగున్
మనుజవరాత్మజన్మునిని ♦ మంత్రిచమూయుతుఁ గాఁగ జాహ్నవిన్. ౯ 3017

క. తరియింపఁ జేయుదము స,త్వరముగ నని పల్కి లేచి ♦ వారెల్ల నిషా
దరమణు నాజ్ఞను నొకో, త్కరమును శతపంచకమును ♦ గై చేసి తగన్. ౧౦

తే. అన్ని రేవులనుండి చ♦య్యన నచటికిఁ
దీసికొని వచ్చి మఱియు స్వ♦స్తికములనెడు
మంచి నావల రాజస♦న్నానయోగ్య
ములను గొని వచ్చి యచ్చట ♦ నిలిపి రవియు ౧౦౹ 3019

[4]సీ. మూలల ఘంటాస♦మూహంబు చెలువార బంగారుపూతలు ♦ పరిఢవిల్ల
నములపతాకంబు♦లలరఁగాఁబొలుపొందె. ఫలకకుడ్యములందుఁ♦జెలఁగియుంట
నందు గవాక్షంబు ♦ లలరారుచుండుటఁ దగిన వాయువుపీవ ♦ ధరణివిభుఁడు
గూరుచుండుటకయి ♦ కొమరుగ సంధిబంధములు గట్టిగ నొప్పఁ♦దనరె నవ్వి

తే. యందు నొకదాని రుచిరమై ♦ యమరియున్న
దాని స్వస్తికనౌకను ♦ దా గుహుండు
తెచ్చెఁ; దత్తలమెల్లను ♦ దివ్యపాండు
కంబళాచ్ఛాదితంబయి ♦ క్రాలుచుండె ౧౧౹ 3020

సీ. ఆనంపజనకమ్ము♦లగు గంటలనినాద మందొప్పుచుండంగ ♦ నందు భరతుఁ
డనుజన్మయుక్తుఁడై ♦యపుడెక్కె నితరనౌకలపైఁ బురోహితుం♦డలఘుతపము

---

1 సురాపగన్=గంగానదిని. 2 హారితరంబులన్-దీనికిమూలము లేకున్నను సుఖముగా దాఁటు నుపయుక్తములైనవి. అనునర్థము విరసముగాను గాన నిటఁ జేర్పఁబడినది ౘ ఉత్తిష్ఠత ప్రబుధ్యధ్వం భద్రమస్తు చ వ స్సదా-అని మూలము. ఈరామాయణమునఁ బలుతావుల "భద్రంతే భద్రమస్తు" ఇత్యాదిరూపముగా నీవాక్య ముపయోగింపఁబడుచుండును. ఇది కవితానైపుణ్యమునకు బాధకము గాదనియు నిది పఠనపరులకు శుభస్కరమనియు భావము గ్రహింపఁదగు. 4 అన్యాస్స్వస్తికవిజ్ఞేయా మహాఘంటా ధరావరాః, శోభమానాః పతాకాభి ర్యుక్తవాతా స్సుసంహతాః- అని మూలము. ఇందర్థశ్లోకమున కీ సీసపద్యము వ్రాయుట యిందలిశబ్దములకు వ్యాఖ్యాతలు వ్రాసినయర్థము ననుసరించియే యని తెలియఁదగు.

కలిమి నొప్పు వసిష్ఠుఁ ♦ డలరు బ్రాహ్మణులు ముందెక్కిరి తర్వాత♦నృపునిదార
లైన కౌసల్యాదు ♦ లారోహణముచేసి; రంత బండ్లను మఱి♦యంగడులును

తే. సరగ నెక్కింపఁబడియె [1]వ♦సతులకెల్ల
నిప్పు పెట్టిరి శ్రీవృద్ధి ♦ కప్పుడచటి
పందిరులు కాలుఁశబ్దంబు ♦ పడవలెక్కు
నపుడు నేముందు నేనుముం ♦ దనెడు రవము. ౧౮౪ 3021

క. స్నానము చేసెడు వారల, దా నినదము స్వీయపరిక♦రావళిఁ గొనుచో
నౌ నాద మొక్కరీతి మ,హానాదంబగుచు దివము♦నంటెఁ బెలుచన్. ౧౮౫

తే. గాలిచేఁ దవ్వరఁ బోవుట♦కై పడగలఁ
గట్టి యుండుట నౌక ల♦క్కాలమందు
నానిపాదులు పైకెక్కి ♦ నంతలోనె
యవియె జనమును గొనిపోయె ♦ నతిజవమున. ౧౮౬ 3023

సీ. కొన్ని యోడలయందుఁ♦గువలయాశ్వులెయుండి రఁదుకొన్నింటిలో♦హాయము
నింకఁగొన్నింటిలో♦నెక్కువవెలగలయరదముల్,బండ్లన♦ట్లరదములకుఁ గలుండె
గట్టు వాహనములు ♦ కడునిండియుండె, నంతట నౌకలన్నియుఁ ♦ దత్తటంబుఁ
జేరి యోజనమును ♦ జెచ్చెఱ నట దింపె భారహీనత నవ్వి ♦ పరఁగుటఁ గని

తే. కర్ణధారులు బహుచిత్ర♦గతులవాని
జలములందును ద్రిప్పిరి ♦ [2]సామజములు
తమపయినిఁ గట్టఁబడిన సౌ♦ధములతోడ
మావటీలొగిఁ బురికొల్ప ♦ మందగతుల. ౧౮౭ 3024

క. జలముల దిగి నది దాఁటుచు, సలీలఁ జనుచున్న భూరి♦శైలములవలెన్
జెలఁగెను మఱికొందఱు నౌ,కలపైఁ జని నదిని వేగ ♦ కడచిరి మఱియున్.

సీ. తెప్పలపైఁ గొంద ♦ ఱప్పుడు పోయిరి [3]కుంభఘటంబులఁ ♦ గొందఱే రి
రింకను గొందఱు ♦ నీఁదుచు దాఁటిరి ఘనజాహ్నవీస్నాన♦కలన మిగులఁ
బావనమా చమూ♦పటలంబు దాశులు దాఁటింప సురనది ♦ దాఁటి మైత్ర
మను ముహూర్తమున బ్ర♦యాగవనంబును జేరెను, భరతుండ♦స్థిరమునీషుఁ

తే. డంత నూఱట గలిగించి ♦ యాచమూవి
తతికి నట వారివారికిఁ ♦ దగినచోటు

---

[1] ఆవాసం సేనానివేశం, ఆదీపయతాం అగ్నినా జ్వలయతాం రాజభటావా నిర్గమనకాలే—శ్రీసమాగమార్థం ఆవాసం దహంతీతి ప్రసిద్ధిః-అని వ్యాఖ్య. దీని ననుసరించియే వ్రాయఁబడినది.
[2] సవైజయంతాస్తు గజాః-అనిమూలము. 'రాజానోవా గజోపరి గృహాణి నిర్మాయ గచ్ఛంతి' అని వ్యాఖ్య.
[3] కుంభఘటైః-అనిమూలము,

తేర్పఁబుపఁ బంచి మునివర్యు ♦ నిద్ధతేజు
నాభరద్వాజుఁ గనఁగ న♦త్యాదరమున. ౨౨ 3026

క. మునివర్యులతో భరతుఁడు, చని గీష్పతి పుత్రు, వేద♦సంఘూధ్యయనుఁ
ఘనమతిని భరద్వాజుని, గనుటకు ముందుగనె తాను ♦ గాంచెన్ వనమున్.

ఆ. ఆశ్రమంబు చేరి ♦ యద్దాని చుట్టును, బలసియున్న రమ్య♦వనము మిగుల
గొప్పదయిన దాని ♦ నప్పుడు కని లోని, కరిగె మానులెల్ల ♦ నరుగుదేర. ౨౩

ఎనుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౯౦ - వ సర్గము.

భరతుఁడు భరద్వాజునితో మాట్లాడుట.

క. నరవరుఁడు ధర్మవిదుఁడో, భరతుఁడు క్రోశమితదూర♦పథమున మానీ
శ్వరుఁడైన భరద్వాజుని, పరమాశ్రమ మలరఁ జూచి ♦ బలము నిలుపుచున్.

చ. శరములఁ జాపఖడ్గముల ♦ జక్కనియాభరణాళిఁ దీసి యం
బరముల నెల్లనున్ వదలి ♦ వస్త్రయుగంబును [1]క్షౌమమున్ ధరిం
చి రహితరాజవేషుఁడయి ♦ చెచ్చెఱఁ గాల్నడకం బురోహితుం
డరుగఁగ వారివెంట నచి♦వాళిని గూడి చనెన్ దివ్యుఁడై. ౨ 3030

తే. అంత నాభరద్వాజమ♦హర్షి స్వీయ
నయనపథమునఁ దోఁచినం♦తనె భరతుఁడు
మంత్రులను గూడ నట నిల్పి ♦ మానిఁ గూడి
చనియె లోనికి; నాతపో♦ధనుఁడు నపుడు. ౩ 3031

చ. అరుదుగ నవ్వసిష్ఠముని ♦ యతిథిగతుంపయినంత నర్ఘ్యమున్
నరగ గ్రహించి తెం డనుచు ♦ ఛాత్రుల కానతి యిచ్చుచున్ మహా
దరమున నాసనంబు విడి ♦ తాఁ దగ లేచి వసిష్ఠమాని న
త్వరముగఁ జేరె; నంత నృప♦తల్లజపుత్రుఁడు చాలభక్తితోన్. ౪ 3032

తే. వందనము చేసె నాభర♦ద్వాజుఁ డవల
మునివరేణ్యుని సంగతి ♦ మనమునందు
నతని దశరథభూనాథు♦సుతునిఁ గాఁగ
నెఱిఁగి ధర్మజ్ఞుఁడో ట వా♦రిద్దఱకును. ౫ 3033

చ. క్రమమున నర్ఘ్యపాద్యముల ♦ గాఢముదంబున నిచ్చి యవ్వలన్
సుమహితమా ఫలాళి నిడి ♦ సొంపగుమాటల నిట్లు పల్కె న్

1 భరతుఁడు నారచీరలఁ గట్టినట్లు లోపలఁ జెప్పి యిపుడు పట్టుపుట్టములఁ గట్టినట్లు చెప్పుటకు "నైషదోషః. పూర్వం ప్రతిజ్ఞా మాత్రం కృతం భరద్వాజాశ్రమాత్పరం ఇటాధారణమితి" అనువ్యాఖ్య ప్రమాణము.

మమె గృహసంస్థు లెల్లరును ♦ మంగళమే నగరంబు సైన్యకో
శములును క్షేమమే సచివ♦సంతతిమిత్త్రులు లెస్స యుందురే!. ౬౪ 3034

చ. అనుచు వచించెఁ గాని నృపుఁ♦డంతకు మున్నె దినంబు చేరుటల్
మనమున నే యెఱుంగుటను ♦ క్ష్మాపతిమాటఁ దలంపఁడయ్యె, నం
త వతని నవ్వసిష్ఠముని ♦ తల్లజుఁడున్ భరతుండు గాంచి మీ
కనయము నగ్నిహోత్త్రములు ♦ హాయిగ సాగుచునున్నవే కదా!. ౭౪ 3035

క. ఆరోగ్యమె కద దేహము, భూరుహములు శిష్యవితతి ♦ పొలుపొందుఁ గదా?
సారంగాదులుఁ బక్షులుఁ, జారుగతిం బొదలుఁగాదె? ♦ సతతము వనిలోన్. ౮

చ. అనిన మహాతపోవిభవుఁ ♦ డమ్మునిచంద్రుఁడు వారితోడ ని
ట్లనియెను; క్షేమమన్నిఁటను ♦ హర్షమె యెప్పుడటంచుఁ బల్కి రా
మునిదగు స్నేహబంధమున ♦ మోమొకరీతిని మార్పునొంద నా
య్యన భరతుం గనుంగొనుచు ♦ నార్యపరా! యని పిల్చి యి ట్లనున్. ౯

తే. ఉర్వినంతయుఁ బాలించు♦చుండు సమయ
మందు నద్దాని విడిచి నీ♦వరుగుదెంచు
టిచటి కిత్తఱి నేలొకో ♦ యెఱుఁగఁ జెప్ప
వయ్య నిర్మలతను గాంచ ♦ దాత్మ యిపుడు. ౧౦ 303[illegible]

సీ. అరిజనాంతకుఁడు ప్ర♦హర్షదాయకుఁడునో నెవనిఁగాన్పృతా♦నెలమిఁగననో
భ్రాతతో దారతో ♦ బహుకాలము వసింప వనికి నెవ్వాఁడు పం♦పంగఁబడెనో
వనితావశుండైన ♦ తనతండ్రిచేఁ జతుర్దశవర్షములు వన♦స్థలి వసింప
వలయు నీవని విని♦ర్మలయశుం డెవ్వాఁడు పలుకంగఁ బడియెనో♦పాపదూరుఁ

తే. డైన యారామునకు వాని ♦ యనుజునకును
నీవు నిష్కంటకంబుగా ♦ నిఖిలరాజ్య
మనుభవించుతలంపున ♦ నాత్మఁ బాప
కార్యమును జేయఁ గోరవు ♦ గాదె? యిపుడు. ౧౩ 3039

క. అని పల్కిన మునివచనము, లను విని భరతుండు కన్ను♦లన్ సలిలంబుల్
పనివడిఁ గాఱఁగ మౌనిం, గని పలికెన్ దొట్రుపాటుఁ ♦ గను మాటలతోన్.

క. నను మనమునఁ గాలత్రయ,ము నెఱింగిన నీవె యిట్టి ♦ మూర్ఖునిగా నెం
చినచో హతుఁడనె యైతిని, విను దోషము నావలన భు♦విం గలుగదు సూ!.

క. అనుమానమైన లేదఘ, మును జేసితినేమొ యనుచు ♦ మునివర్యా! కా
వున నిట్లనుశాసింపకు,ము; నేను లేనితఱి తల్లి ♦ మూఢత్వమునన్. ౧౭

క. పనివడి చేసిన కార్యం, బును నేమది నిష్టపడను ♦ బుధనుత! యద్దా
నను నాకు సంతసములే, దనఘా! యంగీకరింప ♦ నాత్మను దానిన్. ౧౮

చ. పురుషలలాముఁ డైన రఘు♦పుంగవునిన్ ముద మొందఁ జేసి య
ప్పురమును జేర్చి భక్తిమెయిఁ ♦ బూజ్యతదీయపదారవిందముల్
నిరతముఁ గాంచి మ్రొక్కుటకు ♦ నేనిట వచ్చితి నీవు నన్ను నా
దరమున నిట్టివానినిగఁ ♦ దప్పక యెంచి యనుగ్రహింపుమా. ౧౭ 3044

క. ధరణీశుండగు రాముం, డరణ్యమున నెందునుండు ♦ నాదృతిఁ జెపుమా
ధరణీదివిజా! యనియెన్, గరుణింపుచు యనుచుఁ జెంతఁ♦గ్రాలు మునివరుల్.

క. మునివరుఁ బ్రార్థించిరి యం,త నతండు ప్రసన్నుఁడగుచుఁ ♦ దద్భరతునితో
ననియెం బూరుషపుంగవ!, ఘనరఘుకులమందు జనని♦గాంచిన నీకున్. ౧౯

ఆ. అన్న ననుసరించి ♦ యఖిలేంద్రియంబుల
వశముఁ జేసికొనుచు ♦ భవ్యమతుల
యాత్మ ననుసరించి ♦ యనువుగ మెలఁగుట
యనెడు నివ్వి దగు; మ♦హాత్మ! భరత!. 3047

సీ. యోగప్రభావమ్ము ♦ నొందిన నేను నీయాత్మలోనున్న యి♦యలఘువిషయ
ము నెఱింగితిని మఱి♦యును దానిదృఢమును గావించుటకును న♦గ్రజుని నీవు
సేవించుటను గల్గు ♦ స్థిరకీర్తి నలుదెసలను వృద్ధి నొందించు ♦ పనికినిట్టు
లడిగితి ధర్మజ్ఞుఁ♦డైన రాముండును జానకియు మఱి ల♦క్ష్మణుఁడు నెచట
ఆ. నున్నవారొ యిప్పు♦డొగి నేనెఱుంగుదుఁ, జిత్రకూటమనెడు ♦ శిఖరివరము
నందు నున్నవాఁడు ♦ పొందుగ నీయన్న, యచటి కెల్లి పోదు ♦ వార్య నీవు.

క. నేఁ డిచ్చట నీమంత్రుల, తోడన్ వసియింపవయ్య! ♦ తొరపుఁ బ్రజ్ఞం
గూడినవాఁడవు కోస్యల, నీడేర్పం బగినవాఁడ ♦ వి వగుదువు సూ!. ౨౩

క. కనుకనె మత్కాంక్షితమును, నొనరింపుము సార్థకముగ ♦ నోరఘువర్యా!
యన విని ప్రసిద్ధకీర్తిం, దనరుచు మతివిభవమును, ను♦దారతఁ గనుటన్. ౨౪

తే. అట్లె యొనరింతునని పల్కి ♦ హర్ష మెసఁగ
మంత్రులను గూడి యయ్యాశ్ర♦మమున నాఁటి
రాత్రి నివసింపఁ దగు ముని♦రాజు నాజ్ఞ
ననుచు నిశ్చయమును జేసి♦కొనియె నిలువ. ౨౮ 3051

తొంబదవ సర్గము సంపూర్ణము.

## ౯౧ - వ సర్గము.

భరద్వాజముని భరతాదుల కాతిథ్య మొసఁగుట

చ. తనదగు నాశ్రమంబుననె ♦ తా నివసింపఁ దలంపుఁగొన్న యా
తనిఁ గని యమ్మునీంద్రుఁ డను ♦ ధర్మవిదుత్తమ! భోజనంబు దాఁ

కను గొను మాతిథేయమును ♦ గాంక్ష నటన్న మునీంద్రుఁగాంచి యి
ట్లను భరతుండు మౌనివర! ♦ యాదృతి నాపలు కాలకింపుమా!. ౧५ 3052

చ. వనమున నున్నవానిఁ గొని ♦ పాద్యము నర్ఘ్యముఁ బండ్లు మూలముల్
కనికర మొప్ప మాకొసఁగి ♦ కమ్రవిధిన్ దగ నాతిథేయమున్
దనివి చనంగఁ జేసితిరి ♦ తా రిది చాలదె యింకనేమి నా
విని చెఱునవ్వు పొల్పెసఁగ ♦ వింతగ నమ్ముని వాని కిట్లనున్. ౨५ 3053

తే. ప్రీతిగలవాఁడవే యని ♦ చేతసునను
యెఱుఁగుదును నేను నీవన్న ♦ నెంతమాత్ర
మైన యుపచారమునకును ♦ హార్ష మొందు
వాఁడవే యైన నీదగు ♦ బలములకును. ౩५ 3054

తే. విందుచేయంగఁ గోరెదఁ ♦ బ్రీతి యెట్టు
లలరునో దాని కనుగుణ♦మైనరీతి
ననుమతించుటయే యుక్త♦మనుచు మఱియుఁ
బలికె; నరపుంగవా! నీవు ♦ బలమునెల్ల. ౪५ 3055

క. కడుదూరంబున నిలిపి యొ,కఁడవే వచ్చి తిట కేమి♦కారణమో యి
క్కడ కేలరావొ బలయుతి, నుడుగక వివరింపనయ్య! ♦ యున్నది యట్లే. ౫

క. అన విని భరతుఁడు కేల్మో,డ్పున నాతాపసవరేణ్యుఁ ♦ బూజ్యునిఁ గని యి
ట్లనియె మహాత్మా! కోపం,బును గందువు నీవటంచు ♦ భూరిభయమునన్. ౬

క. బలములతో రానైతిని, నిలాధిపతియేని ధార♦ణశుని సుతుఁడై
నలయక పయన మ్మగు తఱి, బలములు చనుమార్గమందు ♦ బాటబు లున్నన్.

ఆ. వార లుండుపట్లు ♦ వరుసఁగఁ దప్పించి, సైన్యబాధ మునుల♦సమితి కెల్లఁ
గలుగకుండు నట్లు ♦ గా వేఱుత్రోవలఁ, బోవవలయు నట్లు ♦ గావున నిట. ౭

తే. వాజివరములు మనుజులు ♦ వారణేంద్ర
ములు మదావిలచిత్తముల్ ♦ వెలయ సేన
యది విశాలధరాస్థల ♦ మెల్లఁ గ్రమ్ము
కొనుచుఁ జనుదెంచుచున్నది ♦ వెనుకొని నను. ౮ 3060

క. అవి యన్నియు నిట వచ్చిన, భవదీయాశ్రమ మహీజ♦వారము సరసుల్
భువియు మఱి పర్ణశాలలు, జవమునఁ జెడుఁగాన నొంటిఁ ♦ జనుదెంచితిఁ జూ.

క. అనిన మహర్షియు సైన్యం,బును వే రప్పింపుమన్నఁ ♦ బొందుగ మౌనీ
శుని యాజ్ఞ భరతుఁ డచటికిఁ, దనసేనను రాఁగఁ జేసెఁ ♦ దదవసరమునన్.

సీ. అంత భరద్వాజుఁ ♦ డాత్మశుద్ధినిఁ గోరి యగ్నిశాలకుఁబోయి♦యందుమూఁడు
పర్యాయములు శాస్త్ర♦పద్ధతిగా నాచమన మొనరిచి రెండు♦మాఱు లోష్ఠ

ములఁ దుడుచుకొని య♦బ్బలముల కాతిథ్య మొనఁగూర్పవిశ్వక♦ర్మనుదగంగ
నాహ్వానమంత్రంబు ♦ ననువుగఁ బఠియించి పిలిచె నిట్లని; గృహా♦దులను వేగ

తే. కట్టు శక్తిని దగు విశ్వ♦కర్మఁ ద్వష్టఁ
బిలుచుచున్నాఁడ భరతుని ♦ బలయుతముగ
నిలిపియున్నాఁడ నాతిథ్య ♦ మొలమి నీయఁ
గావునన్ విశ్వకర్మ రాఁ ♦ గడఁగుఁగాక, ౧౨ 3063

క. చనుదెంచి నేను గోరిన, పనిఁ దీర్చునుగాక యట్లె ♦ వైవస్వతునిన్
ధనపతిని వరుణు నీముగ్గురిని బలరిపుముఖుల నర్హ♦రీతిఁ బిలిచెదన్. ౧౨౹

క. కోరితి నాతిథ్యం బీ, భూరమణాత్మజున కీయఁ ♦ బొంగుచు దివిజుల్
నా రచియించెడు నీపని, గారవమున రక్షణంబుఁ ♦ గావింపఁ దగున్ . ౧౩

క. ధర దివిఁ దూర్పునకో పడమరకో చనుచున్న నదులు ♦ మత్ప్రియమునకై
యరుదెంచుఁగాక యన్నియుఁ, దరుణము దాఁటకయె రాజ♦తల్లజు పనికై. ౧౪

సీ. అందుఁ గొన్నినదులు ♦ హారితరంబును ఖర్జూరముఖఫల♦కలితరసము
తోఁ జేయఁబడుచు మృ♦దుతరమగు మైరేయమద్యమిచ్చునుగాక♦మఱియుఁగొన్ని
చక్కఁగాఁ గాచిన ♦ సారాయి నిచ్చునుగాక; యింకను గొన్ని ♦ కమ్రజలము
నిక్షురసంబు నా ♦ నెసఁగి శీతంబగు దాని నిచ్చునుగాక ♦ గానమునకు

తే. దేవగంధర్వజాతులై ♦ దివ్యశక్తి, నలరు విశ్వావసువు మొద♦లయినవారి
నట్లె నిర్జరజాతుల ♦ నప్సరసల, మఱియు గంధర్వజాతుల ♦ మానినులను. ౧౬

క. వేవే పిలుచుచు నున్నా, నీవిధమున నాట్యమునకు ♦ నిద్ధతరంబౌ
ధీవిభవములఁ జెలంగెడు, నావిశ్వాచిని ఘృతాచి ♦ నాహ్వానింతున్. ౧౬౹

ఆ. అట్లె నాగదంత ♦ నామిత్రకేశిని, హేమశిఖరి వసతి ♦ నెసఁగు హేమను
మఱి యాలంబుస యను ♦ మానినిఁ బిలిచెద, నాటలాడి పాడి ♦ యలరఁ జేయ.

చ. వనజజుఁ గొల్చు నచ్చరల ♦ వాసవుఁ గొల్చెడి కంజనేత్రలన్
మనమున నెంచి పిల్చెదను ♦ మానినిరీతిని [1]నృత్తగాన మిం
పును గలుగంగఁ జేయుటకుఁ ♦ బూనికసాధనపంక్తిఁ గొంచు న
య్యనఘుని దుంబురుం గలిసి ♦ యావృతి రాఁ దగు నాదుసానతిన్. ౧౭

తే. భవ్యవస్త్రాభరణములే ♦ పత్రములుగఁ, బ్రౌఢవనితాకదంబమే ♦ ఫలతతులుగ
నలరి యుత్తరకురుదేశ♦ముల దివిజని,వాసమగు [2]చైత్రరథ మిట♦వచ్చుఁ గాక.

సీ. భగవంతుఁడౌ చంద్రుఁ ♦ డగణితమైత్రిచే నరుదెంచి భక్ష్యభో♦జ్యముల లేహ్యా
చోష్యంబు లనఁబడు ♦ సుందరచాతుర్విధాన్నంబులను దృప్తి ♦ నలరఁ జేయు

---

1 సపరిచ్ఛదాః-అనిమూలము. 'సపరిచ్ఛదాః నృత్తగీతాద్యుపకరణసహితాః' అని వ్యాఖ్య. తుంబురుఁడు అప్సరసలకు గానశిక్షకుఁడు. 2 చైత్రరథము=ఇది కుబేరుని యుద్యానము.

వానిఁ జెక్కించెనని ♦ బహువిధంబులుగాఁగఁ గల్పించుఁగాక, యిం♦కనునతండె
భూజాతములనుండి ♦ పొలుపుగ నప్పుడేరాలిన వింతపూ♦మాలికలను

తే. ప్రాగుటకు సురమొదలైన ♦ ద్రవ్యములను
బలువిధంబులుగాఁ దగు ♦ పలలములను
దయనొసంగును గాక; యి♦త్తరుణమందు
ననుచు నాహ్వానమంత్రంబు♦లను జపించె. ౨౧ 3072

సీ. యోగబలంబున ♦ నొప్పి [1]యాహ్వానింప రానిచో వారి ని♦ర్యాణమొందఁ
గాఁజేయు శక్తిచేఁ ♦ గ్రాలి యమ్మునియు శిక్షాస్వరములు నక్కఁ♦గాఁబలుకుచు
జపియించె మంత్రాళి♦సత్వరముగ; నిట్లు ప్రాఙ్ముఖుండయి హ♦స్తపద్మయుగము
ముకుళించి మదిని స♦మ్మోదంబు చెలువార ధ్యానించుచుండ నా♦యమరులెల్ల

తే. వచ్చి రయ్యాశ్రమమునకు ♦ వైభవముల
వేఱువేఱుగ, హాయిగ ♦ వీచుచుండె
మలయ దర్దురశిఖరుల ♦ నులఁగి చెనుట
నార్చుచు శుభంబుగాఁ దమి ♦ ననిలుఁ డంత ౨౨ 3073

క. సురలును దివి నిలువంబడి, సొరిదిగఁ గురిపించి రమల ♦ సుమవృష్టుల వే
పరఁగెను నలుదిక్కుల నిర్జరదుందుభినాదము లోఁగి ♦ సరసముగాఁగన్. ౨౩

సీ. శుభవాయువులు వీచె ♦ సురకాంతలాడిరి దేవగంధర్వులు ♦ దివ్యరీతిఁ
బాడి వీణియలను ♦ వాయించి రాధ్వని కడు మృదుతరమయి ♦ కర్ణసుఖము
లలరఁగా శ్రుతిసామ్య♦మందుచు లయగుణయుక్తమై గగనంబు ♦ నుర్వి నిండి
యుండిన ప్రాణుల♦కొగి శ్రోత్రవిషయమై చెలువారె; నంత మ♦ర్త్యులకుఁగర్ణ

తే. సుఖదమై యొప్పు నాధ్వని ♦ సొరిది మించి
నిలువఁగా భరతునిసైన్య♦నికర, మట్టె
విశ్వకర్మనిర్మాణైక♦విధుల నెల్లఁ
గాంచె నత్యంతసంతోష♦కలితమగుచు ౨౫ 3075

చ ధరణియుఁ బంచయోజనమి♦తంబగు దాఁకను హెచ్చుతగ్గులం
బొరయక నీలరాశివలెఁ ♦ బూజ్యవిదూరజరత్నరాశి నాఁ
బరఁగుచునున్న శాద్వలవి♦భాసురభాగము లొక్కరీతిఁగాఁ
గరము వెలుంగనుండె, నటఁ ♦ గాంచినవారికి వేడ్కపుట్టఁగన్. ౨౬ 3076

సీ. బిల్వముల్ పనస క♦పిత్థముల్ బీజపూరకము లామలకముల్ ♦ రమ్యచూత
తరువులు ఫలవిభా♦సురములై యందొప్పె, దివ్యోపభోగ్యమై ♦ తేజరిల్లి

---

1 తేజసా ప్రతిమేనచ-అనిమూలము. 'అనాగమనే. దండనసామర్థ్యేనచ యుక్తః' అని వ్యాఖ్య. దీనియర్థమే యిట విస్తృతము.

సరసమై యుత్తర♦కురుదేశములనుండి చైత్రరథవన ము♦చ్చటికి వచ్చె;
దివ్యతరంగిణుల్ ♦ తీరస్థభూరుహసంతతి నలరుచు ♦ సరగ వచ్చె
తే. నాలుగిండ్లబవంతులు ♦ నాగతురగ
శాలలును మేడలట్లె ప్రా♦సాదములును
గుసుమతోరణములు శుభ ♦ మెసఁగఁ బుట్టె
మునివరుని యోగబలమునఁ ♦ గనుచునుండ. ౩౬ 3077

క. సితమేఘసన్నిభంబయి, యతులంబయి తోరణముల ♦ నలరుచు నచటన్
క్షితిపతి సౌధంబొక్కటి, వితతంబయి గానుపించె ♦ వింత గలుగఁగన్. ౩౭

సీ. సితపుష్పదామసం♦సేవితంబయి చారుగంధసమ్మిళితమై ♦ కరమలరుచు
నలుచదరంబయి ♦ వెలసి విశాలమై యాసనశయ్యల ♦ యానములను
దనరుచు శర్కరా♦దినిఖిలరసముల దివ్యభోజనముల ♦ భవ్యవస్త్ర
ముల నలరారుచుఁ ♦ బలువిధంబులఁ దగు నోదనాపూపాదు♦లొప్ప, ధౌత
ఆ. ములును స్వచ్ఛములును ♦ లలితంబులును నగు
పాత్రములును వెలయఁ ♦ బరఁగి, రుచిర
బహువిధాసనములఁ ♦ బ్రబలి స్వాస్తీర్ణశ
యనములను జెలంగి ♦ తనరునదియు. ౩౮ 3079

చ. అనుపమమైనియానతి మ♦హాభుజుఁడౌ భరతుండు రత్నరా
శినిబిడమైన యాగృహముఁ ♦ జేరెఁ బురోహితమంత్రివర్గ మా
తని వెనువెంటనే చని ని♦తాంతము తద్రచనాచమత్కృతిం
గని ముదమొందె నంత నృప♦కాంతుని సూనుఁడు తద్గృహంబునన్. ౩౯

క. కనుపట్టు దివ్యసింహాసనము సితచ్ఛత్రచారు♦చామరములనున్
గని వానిచుట్టు తిరిగెను, దనమంత్రులతోడ నృపునిఁ ♦ దాఁ గనురీతిన్. ౪౦

సీ. మఱియు నాతఁడు దాని ♦ త్స్వామినాథురీతిగాఁ బూజించి శ్రీరాఘ♦వుండు దాని
యందుఁగూర్చుండిన♦యట్లుగ భావించిమనుతమ్రొక్కుచునుజా♦మరమునందు
కొనిదానికింగ్రింద♦గనుమంత్రులకుఁదగునొకయాసనముఁదా♦నుద్యనమున
నుపవిష్టుఁడయ్యె; నం♦దొగిఁగూరుచుండిరి మంత్రిపురోహితుల్ ♦మఱియు వారి
తే. పిదప సేనాధిపతియు నా♦పిదప శిబిర
కర్తయును గూరుచుండిరి; ♦ కడఁగి యంత
నమ్ముహూర్తంబునందె పా♦యసపుఁబంక
మలరు నదులెల్ల మునిపతి♦యాజ్ఞఁ బూని. ౪౧ 3082

క. భరతుని ముంగటఁ బ్రవహించె, రయంబున; నామహర్షి♦శేఖరు కృపచే
నిరుతటముల వానికి న,చ్చెరువుగ సౌధములు వెలసెఁ ♦ జిత్రము లలరన్.

ఆ. ఆముహూర్తముననె ♦ యబ్జజుఁడంపఁగా, మేటిసొమ్ములొప్ప ♦ మించు దివిజ

కాంత లరుగుదెంచి ♦ రెంతయు వేడ్క,నిరువది వేలమంది ♦ జనములలర. ౪౩

క. కనకప్రవాళమౌక్తిక, వినిర్మితాభరణరాజి ♦ వెలయఁగ రత్నా
ఘనిబిడకలాపములరఁగఁ, జనుదెంచిరి ధనదు నాజ్ఞఁ ♦ జానలు ప్రీతిన్. ౪౪

క. ఇరువదివేలుగ వారొప్పిరి; శతమఖునాజ్ఞ నంత ♦ వే వచ్చిరి యే
పురుషుఁడు తము గ్రహియించిన, మరులెత్తియె వెఱ్ఱివాని ♦ మాడ్కిం దిరుగున్.

తే. అట్టి సౌందర్యములఁ దగు♦నట్టి యచ్చ
రలును వింశతిసాహస్ర♦ములు భరతుని
నలరఁ జేయంగ నందనో♦ద్యానసీమ
నుండి యటఁ జేరి రప్పుడు ♦ నిండు వేడ్క. ౪౫ 3087

[1]క. నారద తుంబురు గోపులు, సారసమిత్త్రాభు లఖిల♦శాస్త్రజ్ఞులు త
ద్భూరి [2]మహము నాగింపఁగఁ, గోరిన గంధర్వపతులు ♦ కుతుకము లలరన్.

సీ. భరతుని ముందటఁ ♦ బాడిరి; మునియాజ్ఞఁ బుండరీకయు,నలం♦బుసయు, వామ
నయు, మిశ్రకేశిని ♦ నాట్యము సల్పిరి సురల యుద్యానాళి ♦ శోభిలుసుమ
ములు చైత్రరథమునఁ ♦ గలపూలమాలిక లన్నియు నమ్మౌని ♦ యాశ్రమంబు
నలరు ప్రయాగయం♦దలివృక్షములయందు వఱలె నమ్మౌని ప్ర♦భావమునను

తే. భరతుముందట నీలాగు ♦ పరిఢవిల్ల
సైనికులకయి యమ్మౌని ♦ శాసనమున
మద్దెలల మ్రోయఁగాఁ జేసె ♦ మహితబిల్వ
తరువులటువేసెఁ దాళముల్ ♦ తాండ్రచెట్లు. ౪౬ 3089

సీ. అశ్వత్థభూజంబు ♦ లలరుచు నాడె నమ్మునిమహత్త్వంబున ♦ గని సరళము
లును దాళవృక్షంబు♦లును దిలకంబులుఁ గానుఁగువృక్షముల్ ♦ గూనులు మఱి
వామనములునయి ♦ వర్తించుచుండె నయ్యాశ్రమంబునయందు♦నలరుశింశు
పములు జంబూమహీ♦జములు నామలకంబు లింక నయ్యెడవిలో♦ నెనఁగువృక్ష

తే. ములును మఱి మాలతీమల్లి♦కలును జాతి
లతలు నావిపినమునఁ గ♦లయితరు సుల
తలును స్త్రీరూపములఁ దాల్చి ♦ తద్బలముల
ముందటన్ నిల్చి యిట్లని ♦ మంపలించె. ౪౭ 3090

క. సురయందు నిచ్ఛయుండిన, సురఁ గ్రోలుం డాఁకలిఁగొని ♦ స్రుక్కెడువారల్
గర మరుదగు పాయసమును, బరిశుద్ధంబై చెలంగు ♦ పలలముఁ దినుఁడీ!.

క. అని పల్కి యొక్కనికి నే, డెనిమిదిమందిగను జేరి ♦ యింతులు నలుఁగుల్

---

1 నారద స్తుంబురు గ్గోపః-అని మూలము. గోపనాముఁ డొకఁడు నారదతుంబురులతో సముఁడు గలఁడు. 2 మహము=ఉత్సవము.

దనివారఁ బెట్టి స్నానము, లను జేయించిరి తటంబు♦లఁ రమ్యముగన్. ౯౫

సీ. రుచిరలోచనలైన ♦ విచికిలగంధులు వారికి పాదసం♦వాహనంబుఁ
జేయంగ నటువచ్చి ♦ పాయక తడి యొత్తి భూషితాంగులఁ జేసి♦పొలుపుమీఱ
నేకాంతమున వారి♦నెంతయుఁ దమి మీఱ సురఁ ద్రాగఁ జేసిరి;♦తురగములకుఁ
గరిఖరోష్ట్రములకు ♦ వరవృషభములకు వానివానికిఁ దగు♦భంగి విధిగ
తే. వాహనావళిరక్షకుల్ ♦ వరమునీంద్రు
నాజ్ఞ నాహారములఁ నిచ్చి ♦ రంతఁ బ్రబలు
లైన వాహనపాలకు ♦ లా భరతుని
భటుల వాహనములనెల్లఁ ♦ బలువిధముల. ౯౬ 3093

క. తినుటకుఁ బ్రేరేపించుచు, ననువుగ నిక్షువుల మధువు ♦ నట్టులె పేలా
లను బెట్టిరి వానికిఁ, దృ, ప్తిని దిని యవియెల్ల మదవి♦వృద్ధిన్ దనరెన్. ౯౭

సీ. హయరక్షకుఁడు తన♦హయమిద్ది యనియుఁ గుంజరరక్షకుఁడు తన♦కరియిదియని
తెలియఁజాలకయుండె ♦ నలసైన్యమునఁ గలవారెల్ల మదమును♦వఱలఁ జేయు
నట్టి వస్తువ్రాత ♦ మాహారముగఁ గొని మత్తిల్లి సురఁ ద్రాగి ♦ మై మఱచుచు
స్వచ్ఛందనాదులా ♦ సకలభోగంబుల నంది యొప్పిరి; వార ♦ లభిలషించు
తే. నట్టివస్తువులను స్వేచ్ఛ ♦ ననుభవించి
చక్కఁగాఁ దృప్తినొందుచు ♦ సాంద్రరక్త
చందనముఁ బూసికొనుచు ని♦ర్జరవధూస
హస్రములఁ గూడి యెంతయు ♦ నలరుచుండి. ౯౮ 3095

చ. పురమున కేని కాననము ♦ పొంతకునేనియుఁ బోము మేమిఁకం
గరము సుఖంతు మిచ్చటనె ♦ కానల రాముఁడు శర్మ మిమ్ములన్
భరతుఁడు హాయినిం గనుచు ♦ వర్ధిలుచుండురుగాక యెట్టిలో
వరముని యాశ్రమస్థలమె ♦ వాసము మాకని పల్కి రెంతయున్. ౯౯ 3096

తే. కాల్బలంబులు నేనుంగు♦గముల నెక్కు
భటులు గుఱ్ఱపురౌతులు ♦ వాజిహస్తి
బంధకులు నట్టి విందున ♦ బలిసి [1]నాథుఁ
డరయ లేఁడని పల్కిర ♦ ట్లుప్పు డచట. ౧౦౦ 3097

క. భరతుని వెనుకొని వచ్చిన, నిరుపమశక్తిం జెలంగు ♦ సిఖిలభటులు ని
ర్జరపురమిదె యని యుబ్బుచు, నరుదుగ గుమిఁగూడి పల్కి♦రధికధ్వనితోన్.

క. ఆడుచుఁ బాడుచు నవ్వుచుఁ, గూడుచు వారెల్ల వేల♦కొలఁదిగ నొకచో
నాడంబరముగఁ బల్కుచు, నేడకొ పరుగిడుచు నుండి♦రెంతయు వేడ్కన్.

[1] అనాథా స్తంబిధిం లబ్ధ్వా-అనిమూలము. అనఁగాఁ దాకి స్వతంత్రుల మనుకొని అని భావము.

తే. పూలదండలఁ దాలిచి ♦ పొలుపుమీఱ
నిట్లు సైనికులందఱు ♦ నిచ్చఁ జనుచు
నమృతమట్టులు తగిన యా♦యన్న మిచ్చు
కొలఁదిఁ దినియు రుచిరభక్ష్య♦ములను గాంచి. ౬౩ 3100

క. మనములఁ దృప్తిం బొందక, తినఁగా మఱియుం దలంచి ♦ తీవరమున న
ప్పనిచేయ మొదలు పెట్టిరి, కని విని యెఱుఁగని విధంబు♦గా విందలరన్.

క. పరిచారకదాసీభట, తరుణులు మఱి బలమునందుఁ ♦ దగువారెల్లన్
గరమరుదగు నంబరముల, ధరియించి చరించి రందుఁ ♦ దమి చెలువారన్.

క. కరిఖరధేనూష్ట్రాశ్వో, త్కరములుఁ గ్రీడార్థమృగప♦తత్త్రులు మానీ
శ్వరుమహిమ గలిగి భక్ష్యో,త్కరమున సంతృప్తినందె♦గడుఁబూన్కి మెయిన్.

ఆ. ఒక్కఁడైన నందు ♦ నొండువిధంబగు, భక్ష్యమును దినండు ♦ భవ్యమౌని
మహిమఁ గలిగినట్టి ♦ మానితాహారంబె, తినిరి వారలెల్లఁ ♦ దృప్తి మెఱయ.

[1]సీ. నల్లవస్త్రముఁ దాల్చి♦న పురుషుం డాఁకలి గొన్నవాఁడును ధూళిఁ♦గూడినట్టి
తలవెండ్రుకలవాఁడు ♦ మలినదేహుండును గానరాఁడయ్యె నొ♦క్కండు గాని
యందఱుఁ జెన్నారి ♦ యలరారుచుండిరి మఱి పంది మేఁకల♦మాంసములును
[2]మంచివ్యంజనములు ♦ మాఁగినఫలములు శర్కర లోనైన ♦ సరసవస్తు

ఆ. వులను గలిపి కాచి ♦ యలవరించిన పాక
భేదములును, మఱియుఁ ♦ బ్రియరసముల
నలరు సూపములు సి♦తాన్నమ్ములును నిండి
యుండు పాత్రవితతు ♦ లొప్పుచుండ. ౬౪ 3105

ఆ కుసుమచిత్రశిల్ప♦గుంభితములయి యు
ప్పాత్రములను పస్త♦భర్మనిర్మి
తములుగాఁ జెలంగ ♦ సుమతి వారలు వానిఁ
గాంచి యచ్చెరువులఁ ♦ గాంచి రపుడు. ౬౫ 3106

[3]క. కసఁదగియెం గూపంబులు, వనపార్శ్వములందుఁ గన్రు♦పాయసపంకం
బున నిండి; యందుఁ దిరిగెడి, [4]మునుపటి ధేనువులె క్షీర♦ముల నిచ్చెఁ గడున్.

ఆ. కోరినన్నిపాలు ♦ గోవులు పితుకంగ, వృక్షవితతినుండి ♦ విమలమధువు
గురియుచుండ బావు♦లరుదగు మైరేయ, మద్యపూర్ణములయి ♦ మమత నింప.

సీ. బావులచుట్టు కుం♦భంబుల లెస్సఁగాఁ బచనంబు చేయఁగాఁ ♦ బడిన జింక-
నెమిలి కోడిమొదల♦గుమృగపక్షులమాంసములుతనరారంగఁ♦గొలఁదికెక్కఁ

1 నాశుక్లవాసాస్తత్రాసీత్-అని మూలము. 2 వ్యంజనములు=కూరలు. 3 బభూవు ర్వనపార్శ్వేషు కూపాః పాయసకర్దమాః-అనిమూలము. 4 మునుపటి ధేనువులై-దీనికి "తాశ్చ కామదుఘా గావః" అనిమూలము. 'గావః పూర్వమేవపనచర్యాః' అని వ్యాఖ్యయుఁ బ్రమాణములు.

డైనట్టి యన్నకుం♦భాదులు లక్షలకొలఁది వ్యంజనపాత్ర♦ములును, గోట్ల
కొలఁదిగా స్వర్ణైక♦విలసితములగు భోజనపాత్రములు మఱి♦యును దగంగ

తే. శుంఠి మొదలైనయట్టి వ♦స్తువుల వేసి, సంస్కరింపంగఁ బడినట్టి ♦ సారరుచిర
దధిని నిండిన కుండలు ♦ [1]స్థాలు, లక్లై, పెద్దచట్లును వెలయ నా♦విందు వెలసె.

సీ. మిగులఁ గ్రొత్తదియును ♦ మిగులఁ బ్రాఁతదియునుగాక [2]కపిత్థంబు♦కరణి వాస
నలఁ గూడి మేలయి♦వెలయు మజ్జిగతోడఁ గొన్నిమడుఁగులుసం♦పన్నములయి
తనరారెఁ; ద్రిఫలంబు ♦ లనఁబడు శుంఠిపిప్పళ్లును మిరియముల్ ♦ పరఁగునేల
కులు లవంగములు త♦క్కోలముల్ నాగపుష్పముచక్కెరయునున♦ల్లమునుజీల

తే. కఱ్ఱయును జేర్చి యొక్కపా♦కంబు చేసి
నట్టి దధితోడ నిండిన♦యట్టి మడుఁగు
లందుఁ గన్పడుచుండెఁ; బా♦యసము నిండఁ
గలుగు మడుఁగులు నొకకొన్ని ♦ వెలయుచుండె. ౨౩ 3110

తే. శర్కరయు దానితోఁ జేయు ♦ సరసములగు
పిండివంటలరాసులు ♦ వీనివెనుక
వ్యంజనంబులుగాఁ గిరి♦వ్రజము పోల్కి
నలరె; నాసైనికులు ముద♦మంది యపుడు. ౨౩½ 3111

సీ. తటినీతటములఁ బా♦త్రంబుల నలరెడు నుసిరికమొదలుగా ♦ నొప్పువాని
తోఁ జేయఁబడినట్టి ♦ తోరపుఁ గల్కముల్ చూర్ణముల్ మదికిని♦సొంపునింపు
తైలముల్ వేఁడి యు♦దకములు లోనగు స్నానార్హవస్తువి♦సరముఁ గాంచి;
రంతట స్వచ్ఛంబు♦లై కూర్చములుగల దంతధావనకాష్ఠ♦తతుల, శ్వేత

తే. చందనంబును గవచసం♦ఛన్నములగు
విమలదర్పణముల, వస్త్ర♦సముదయములఁ
[3]బాదుకలఁ జెప్పులను నంజ♦నాదులుంచు
బరణులను దువ్వెనలఁ గాంచి ♦ రిరుదు గలుగ. ౨౬½ 3112

తే. ధనువులను శస్త్రకూర్చము♦లను సుకవచ
ములను, జిత్రములగు పఱు♦పులను, నాస
నముల, నుష్ట్రఖరాశ్వనా♦గముల, నీరు
త్రాగుమడుఁగుల సలిలపూ♦ర్ణములఁ గనిరి. ౨౭ 3113

---

[1] స్థాల్యః కుంభ్యః కరంభ్యశ్చ అనిమూలము. [2] సుసంస్కృతాః - అనుమూలమునకు వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థము ననుసరించి యీపద్యభాగమంతయు వ్రాయఁబడియె. 3 పాదుకోపానహాంశ్చైవ యుగ్మానిచ సహస్రశః-అనిమూలము. 'పాదుకాః దారునిర్మితాః ఉపానహః చర్మనిర్మితాః' అని వ్యాఖ్య.

సీ. అవగాహనార్హంబు♦లగు నవతరణప్రదేశంబు లొప్పారు ♦ దివ్యకువల
యాంభోజసౌందర్య ♦ మలరార, నంబరవిధమున స్వచ్ఛమై ♦ వెలయు నీరు
తనరఁగా సుఖముగ ♦ మునుఁగ నర్హములగు సరసులఁ గాంచిరి ♦ సాధునీల
వైడూర్యములరీతి ♦ వర్ణంబు లపురంగ [1]మృదుఘాసరాసుల ♦ నెల్లయెడలఁ

తే. గనిరి మున్నెన్నఁడును దారు ♦ గన్నదియును
విన్నదియుఁ గాక తనయంత ♦ వెలసి యద్భు
తమయి స్వప్నసమానమై ♦ తనరునట్టి
యాతిథేయంబుఁ గని వార ♦ లాత్మ నలరి. ౮౦౪ 3114

క. భరతున కీరీతి మునీశ్వరుఁ డీవిందును నొనర్చె ♦ బళిబళి యనుచుం
గరము మది విస్మయంబులఁ, బరఁగిరి భటులెల్ల; నంత ♦ బరవస మలరన్. ౮౧

క. నందనవనమున నిర్జర, బృందము క్రీడించు భంగి ♦ వితతమనోజ్ఞా
నందముఁ గూర్చు తదాశ్రమ, మందీవిధి వారు నిచ్చ ♦ నలరుచునుండన్. ౮౧౪

క. ఆరాత్రి గడచె నంతట, గారవమున నిర్జరాళి ♦ గంధర్వులు ద
న్నీరేజేక్షణులు నదుల్, సారతపోధనుని మాని♦చంద్రుని భక్తిన్. ౮౨౪ 3117

ఆ. వీడుకొనుచుఁ బోయి ♦ రాడుచు వచ్చిన,దారి గృహములకును ♦ వారు, పిదపఁ
దెల్లవారినంత ♦ నుల్లము లలరంగ, వీరలల్లె మద్య♦ధారలాని. ౮౩ 3118

సీ. సరసమౌ చందనా♦గరువుల పూతలఁ దులకించుచుండిరి ♦ పలువిధములఁ
దనరారుపూదండ♦లును దక్కువస్తువుల్ నలుచోట్లఁ బడియును ♦ నైజకాంతి
సంపదలను వీడఁ♦జాలక నూతనవిధమున నారాత్రి ♦ వెలసినట్లె
యలరారుచుండె; మహా♦త్ముఁడా మునివరుతపముపెంపునఁ గ్రొత్త♦తళుకుగలిగి

ఆ. యింద్రజాలమట్టు ♦ లెసఁగి క్షణంబులో
మఱుఁగు పడెక ముందు ♦ మూడ్కి నతుల
కాంతిసంపదలను ♦ గలిగిన వయ్యెను
[2]జూడఁజూడ మదికిఁ ♦ జోద్యమలర. ౮౪ 3119

తొంబదియొకటవ సర్గము సంపూర్ణము.

## ౯౨ - వ సర్గము.

భరతుఁడు చిత్రకూటమునకుఁ బ్రయాణము చేయుట.

క. పరివారముతో నంతట, భరతుఁడు రాముఁ గను వేడ్క ♦ పరగంగ మునీ
శ్వరుచెంతకేగె విహితా,దరమున నాతిథ్యముఁ గొని ♦ తద్దయు భక్తిన్. ౧

1 మృదుఘాసము=మెత్తనిగడ్డి. 2 ఇది పైయర్థమును బోషించుటకుగా వ్రాయఁబడియె
నని యెఱుంగవలయు.

చ. మునిపతి యగ్నికృత్యముల ♦ ముందుగఁ దీఱిచి తన్నుఁ జూచు వే
డ్క నరుగుదెంచి కై మొగిచి ♦ గారవ మొప్పు సమీపభూస్థలం
బున నిలుచున్న యప్పురుష♦పుంగవునిన్ భరతుం గుమారునిం
గని వచియించె; నోయనఘ! ♦ కాననమం దిటఁ బర్ణశాలలోన్. ౩౫ 3121

క. రాతిరి సుఖముగ జరిగెనె, యాతిథ్యము నేను జేయ ♦ నందఱుఁ దృప్తిం
జేతములఁ బొందిరే, నా, కాతెఱఁగెఱిఁగింపు మనిన♦నా భరతుండున్. ౩౬ 3122

తే. అతుల తేజమ్మునం బొల్చు ♦ నమ్మునీంద్రుఁ
డును [1]దనుం జూడరాఁగఁ బ♦యనము చేయు
చుండుటం గని దోసిలి ♦ యొగ్గి మ్రొక్కి
పలికె మహాత్మ! నేను మం♦త్రులును బలము ౩౭ 3123

చ. తురగము లాదియైనవియుఁ ♦ దోరపుఁ దృప్తిని గామితార్థముల్
పరఁగుటఁ జెందినారమిఁకఁ ♦ బల్కెదు నేను సేవకుల్ భటో
త్కరముఖులైన మేమును సు♦ఖంబుగనే శ్రమమెల్ల వీడఁ దా
పరహితకాయముల్ పొదల ♦ భవ్యతరాన్నముఖంబులం గడున్. ౩౮ 3124

క. పరితృప్తిఁ బొందినారము, సురుచిరగేహములయందు ♦ సుఖముగ రాత్రిన్
జరపితిమి; మునీంద్రా! యిష్టరతిన్ మిము వీడుకొందు ♦ నరగున నింకన్. ౩౯

క. చెంతను వసించు నన్నను, నెంతయు వేగంబ చూడ ♦ నెంచి చనెద మీ
రింతకుఁ గరుణాదృష్టిన్, గాంతురుగాత మిఁక నన్ను ♦ క్ష్మాసురతిలకా!. ౪౦

తే. యోగదృష్టిని సర్వంబు ♦ వేగ చూడఁ
జాలుదురు మీరు జనకుని ♦ శపథమెల్ల
సార్థకము చేయ ధర్మంబు ♦ నాచరించు
నన్న యాశ్రమమేదియో ♦ యానతిమ్ము!. ౪౧ 3127

క. దానికి మార్గం బెద్దియొ, యే నెలవున నద్దియుండు ♦ నెంతయొ దూరం
బా నిచటి కద్ది, యంతయు, నే నెఱుఁగఁ దలంతుఁ గరుణ♦నేర్పడఁ జెపుమా!. ౪౨

క. అని యిటు భరతుఁడు వేఁడిన, ఘన తేజుం డురుతపస్వి ♦ కని యాతని న
న్నను జూచు వేడ్క నొప్పెడు, మనమునఁ దగువానిఁ బలికె ♦ క్ష్మాపతితనయా!. ౪౩

క. విడువక మూఁడున్న అయామ,సుడదూరము పోయినంత ♦ మానియుతంబా
నడవిన్ బర్వతమున్నది, కడుసుందరసానువితతి ♦ కాననములతోన్. ౪౪ 3130

ఆ. చిత్రకూటమనుచుఁ ♦ జెప్పుదు రాకొండ, దాని కుత్తరమునఁ ♦ దనరుచుండు
మహితరీతి వెలయు ♦ మందాకినీనది, పుష్పితద్రుమాళి ♦ పూర్ణ మగుచు. ౪౫

క. దానితటంబులఁ బుష్పిత, కాననములు సొంపునింపుఁ ♦ గానఁ గుమారా!
యానదికిఁ బ్రక్కఁగానే, కానంబడుఁ జిత్రకూట ♦ కమ్రశిఖరియున్. ౪౬

---

1 ఆశ్రమా దభినిష్క్రాన్తం-అనిమూలము. తనతోటి బయలుదేరుచున్న మునిని.

క. గిరినదులకు నడుమను గల, దరయఁగ నొకపర్ణశాల ♦ యందున్నారా
తరణికులాభరణులు ము,వ్వురు నిశ్చయ మిద్ది భరత ♦ భూరిగుణనిధీ!. ౧౩

[1]తే. వాహినీనాయకా! మహా♦భాగ! యామ్య
మునకు నిటనుండి పోవుదా♦రి నొకకొంత
దూరమీరథహస్తులఁ ♦ దురగములను
బొదలు సేనను దోడ్కొని ♦ కదలిపోయి. ౧౪ 3134

క. తరువాత నిర్ఋతిదిక్కుగఁ, బరఁగెడు మార్గమునఁ బొమ్ము ♦ వనమార్గంబుల్
తరమే విస్తృతిఁ గాంచఁగ, నరయఁగ సూక్ష్మములు గాన♦నాపార్శ్వములన్.

క. కనఁబడెడు ప్రదేశంబులు, ఘనములుగా నందు సేనఁ ♦ గైకొని పొమ్మా
మనుజశిరోమణి రాముని, గనఁగల వట నని, యె, రాజ♦కాంతామణులున్.

[2]క. విని పయనంబని యా వా,హనముల విడువంగఁ దగని♦యబలలె యయ్యున్
మునిఁ జూడ వాని దిగి యా,తనిఁ బరివేష్టించి; రందుఁ ♦ దనయార్తిమెయిన్.

ఆ. మిగులఁ జిక్కి వయసు ♦ మీఱినకతమున
వడఁకుచున్ మొగంబు ♦ బహుళదీన
భావ మొంద దుఃఖ♦బద్ధయై కౌసల్య
తా సుమిత్రఁ గూడి ♦ తనకరముల. ౧౫ 3138

క. మునిపాదంబులఁ బట్టుచు, ఘనభక్తి నమస్కరించెఁ; ♦ గైకయు ఫలముం
గనలేని కోర్కెఁ గోరియుఁ, దను నిందలపాలు లోక♦తతి చేయంగన్. ౧౬

క. మనమున దుఃఖించుచు రా,ముని నడవికిఁ బంపు కృత్య♦మున సిగ్గొలయున్
మునిపాదములకు మ్రొక్కెను, దనమనమున ఖేదమొలయఁ♦దన్ముని యెదుటన్.

తే. నిలువఁజాలక వలఁగొను ♦ నెపమున నట
నుండి భరతుని దరికేగి ♦ యుండె; నంత
దృఢతమవ్రతుఁడగు మౌని ♦ దివిజపతియు
భరతుఁ గని రాఘవా! యని ♦ పలికె నిట్లు. ౧౭ 3141

క. వీరంటఁ జు నీతల్లులు, వీరలపేరులను వినెడు ♦ వేడ్క గలదు నేఁ
గోరితి వినుపింపుమ యన, నారఘువీరుండు వాగ్మి♦యాట నతనితోన్. ౧౯

తే. పలికెఁ బ్రాంజలియై మునీ♦శ్వర! వెతలను
ననశనంబునఁ గృశియించి ♦ యధికదీన
యగుచు మఱి ధర్మదేవత ♦ యట్లు వెలయు
నీమె నాతండ్రిమహిషియా ♦ హితమనీష!. ౨౦ 3143

సీ. కౌసల్య యనుపేరుఁ ♦ గాంచిన దీసాధ్వి యదితి వామనుని గ♦న్నట్లు పురుష
సింహుని శ్రీరాము ♦ సింహగంభీరగమనునిఁ బ్రియంబునఁ ♦ గనియె, మనసు,

1 వాహినీపతే-అనిమూలము. 2 హిత్వా యానాని యానార్హాః-అనిమూలము.

కంది గుందఁగ ఘోర♦కాననంబునఁబుష్పములుభూమిపై రాలి♦వెలయఁగనఁగ
నైనట్టి [1]కర్ణికా♦రాహ్వయద్రుమశాఖనలెఁ గనంబడుచు వే♦వడఁకుచున్న

తే. యట్టి యీదేవిదా వామ♦హస్తవరము
నూఁతఁగాఁ బట్టుకొని నిలు♦చున్న యీమె
యగు సుమిత్ర మహావీరు♦లై పరాక్ర
మములఁ దగువారిఁ గనియె నా♦త్మజుల ఘనుల. ౨౩ 3144

క. లలితుల లక్ష్మణశత్రుఘ్నుల నశ్వినమానులగుచుఁ ♦ గొమరారెడు వా
రల నిర్వుర; వినుమవ్వలఁ, దెలిపెద నీదేవిచరిత ♦ దివ్యమునీంద్రా!. ౨౪ 3145

[2]సీ. పురుషవరేణ్యులై ♦ పోదలు రాఘవలక్ష్మణులు దండకావనం♦బులకుఁ బంప
నయి జీవనాశనం ♦ బలవడినంతటి కష్టము లందిరో, ♦ క్ష్మావిభుండు
తనయుల దిగనాడి ♦ తా స్వర్గమొందెనో యెవ్వతెకొఱకు నా♦యింతి కోప
వతి బుద్ధి లేనిది ♦ ప్రతిలేని సౌందర్యవతినని తన్నుఁ దా ♦ భావముందుఁ
దలఁచుచు నైశ్వర్య♦ములనెఁ గోరుచుదుష్టురాలయియును యోగ్య♦రాలిరీతిఁ

ఆ. గానఁబడెడు నదియుఁ ♦ గడుఁ గ్రూరురాలును
బాపనిశ్చయమునఁ ♦ బరఁగునదియు
నైన యీమె తల్లి ♦ యీ నాకు నీదేవి
వలన నాకు నిట్టి ♦ వ్యసనమొదవె. ౨౫ 3146

చ. జననిని బట్టియే వ్యసన♦జాలము నివ్విధిఁ బొందుచున్నవాఁ
డ ననుచు బాష్పధారల న♦డంగెడుఁబల్కులఁ దామ్రనేత్రుఁడై
యనితరసాధ్యకోపమున ♦ నాభరతుండు మహాహి భంగిగాఁ
గనఁబడి యూర్పులన్ విడిచి ♦ గాంచుచు మానిని నుండె నంతటన్. ౨౬

[3]ఆ. భావికాలవిషయ♦పటలి నెఱింగిన, బుద్ధిశాలి మౌని♦పుంగవుఁ డిటు
పలుకుచున్నయట్టి ♦ భరతునిఁ గని పల్కె, నర్థయుక్తవాక్కు ♦ లలరుచుండ.

క. నీతల్లియందు దోషం, బీతఱిఁ గలదంచు బుద్ధి ♦ నెంచకుమా! నీ
భ్రాతను వనముల కంపుట, చేత నిఁకన్ ముందుగ సుఖ♦సిద్ధి కలుగునో. ౨౭

క. సురలకు దానవులకు నీ,శ్వరతత్త్వం బెఱుఁగనట్టి ♦ క్ష్మాసురమానీ
శ్వరులకు నిఁక ముందు శుభం, బరయఁగఁగలుగంగనున్న♦దనిన భరతుఁడున్.

క. మునికిఁ బ్రదక్షిణముగ వం,దనములు తమిఁజేసి దీవ♦నలు గైకొని సై

---

1 కర్ణికారము=కొండగోఁగు. 2 క్రోధనామకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీం, ఐశ్వర్యకామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీం, మమైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయాం- అను మూలానుసారమే యీపద్యము వ్రాయఁబడియె నని యెఱుంగునది. 3 మహాబుద్ధి రిదం వచన మబ్రవీత్-అనిమూలము 'అతీతానాగతవర్తమానజ్ఞో మహర్షిః భావిరావణవధాదికం హృది నిధాయ దేవాదీనాం సుఖోదర్కం భవిష్యతీ త్యుక్తవాన్' అనివ్యాఖ్య.

న్యనికరములఁ బయనము గ,మ్మని యాజ్ఞాపించె; నంత ♦ నాసైన్యంబుల్.

క. పలు తెగల వారలగుటన్, జెలఁగుచు స్వర్ణాంకితముల ♦ సిద్ధరథములన్
బలువిడి నెక్కిరి తగిన, ట్లలరుచు శ్రీరాముఁగాంచు ♦ నామోదములన్. ౩౨౪

సీ. కరిణులు మగయేన్గు♦గములు బంగరుత్రాళ్లు నడుముల నలరఁగఁ♦బడఁగలొప్ప
వర్షర్తువున ఘన♦ధ్వనులతోఁగూడిన ఘనములతీరున ♦ గంటలెల్ల
ధ్వనులఁ జేయుచునుండఁ♦బయనంబుచేసెను; భవ్యతమంబులై ♦బహువిధముల
విలువలేనట్టివై ♦ వెలసి పెద్దవియును జిన్నవియును నయి♦యున్న మేటి

తే. వాహనము లెల్ల వెడలెను ♦ బాదగతులఁ
గాల్బలంబులు చనె నృప♦కాంత లెల్ల
రామదర్శనకాంక్షల ♦ రమణ దివ్య
వాహనము లెక్కి చనిరంత ♦ భరతుఁ డెలమి. ౩౩౪ 3153

క. మునివరు లాజ్ఞాపింపఁగ, [1]వనజప్రియకువలయాప్త ♦ భాసదృశంబై
తనరారు రుచిరశుభశిబి,కను నెక్కి బలాన్వితుఁడయి ♦ కదలెన్ వనికిన్. ౩౬౪

సీ. గజవాజిరథసమా♦కలితమై దక్షిణ వాహినియయి, వారి♦వైభవమునఁ
దనరు గంగానది ♦ దక్షిణతటమున విడిసియుండినయట్టి ♦ విపులసేన
గిరులయందును దరం♦గిణుల పార్శ్వంబుల మృగపక్షిజాల స♦మ్మిళితములగు
వనముల దాఁటి మే♦ఘనికరమట్టులు యామ్యదిగ్భాగంబు ♦ నావరించి

తే. పయనమై పోయెః గజవాజి ♦ భటనికాయ
సంతతామోదమునఁ దగు ♦ సైన్యమద్ది
విపినభాగంబుఁ జొచ్చుచు ♦ నపుడు మృగప
తత్రులన్ బెదరించుచుఁ ♦ దనరుచుండె. ౩౯౪ 3155

తొంబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౯౩ - వ సర్గము.

భరతుఁడు చిత్రకూటప్రాంతవనమును బ్రవేశించుట.

చ. వనమున [2]నమ్మహాపృతన♦వాసిగఁ బోవుచునుండ నవ్వనం
బునఁ గల యూథసంఘములు ♦ పోలఁగ దానిని గాంచి భీతిచే
తను గలగుండు నొందుచు ని♦తాంతము మత్తిలియున్న సామజా
ది నిఖిలయూథముల్ గొనుచుఁ ♦ దెంపుదొరంగి చనెన్ జవంబునన్. ౧

క. వనరాజిని బర్వతవా,హినులందును గాననయ్యె ♦ నెలుఁగులు దుప్పుల్

---

[1] చంద్రార్కతరుణాభాసాం-అనిమూలము. 'తరుణచంద్రార్కకాంతిమ్'అని వ్యాఖ్య. [2] అమ్మహాపృతన=ఆగొప్పసేన.

ఘనరురుమృగములు, నంతటఁ, దనసైన్యము పృథురవముల♦ధరఁ బగులింపన్.

తే. ధర్మమతియైన భరతుండు ♦ తా ముదంబు
నంది సైన్యంబుతోడఁ బ్ర♦యాణమగుచుఁ
జనియె నామహితాత్ముని ♦ సైన్య మబ్ధి
భంగి విస్తారమై మహా♦ధ్వనులు చెలఁగ. ౩ 3158

క. ఘనములు వర్షాకాలం, బున నాకాశమును గ్రమ్ము ♦ పోలికఁగా భూ
మిని నావరించి నడచె; జ,వనాశ్వములచేత హస్తి♦వారముచేతన్. ౪ 3159

క. ధర యత్తఱి వ్యాప్తంబై, చిరకాలము గానఁబడని ♦ స్థితిఁజెందెను, శ్రీ
కరుఁడైన భరతుఁ డవ్విధిఁ, ద్వరతోఁ గడు దూర మరిగి ♦ వాహనవితతుల్.

క. అలయుటఁ గన్గొని మంత్రం, బుల నేర్పఱియగు వసిష్ఠ♦ముని [1]మంత్రివరున్
జ్వలనాభ తేజునిం గని, పలికెన్ నేనెట్లు విన్న♦వాఁడనొ మొదటన్. ౬

తే. ఎట్టి రూపంబుగా నుండు ♦ నిదియటంచు
నూహచేసితినో యట్టు ♦ లోక్యరీతిఁ
గనఁబడుచునున్న, దామాని ♦ కాంతుఁ డెన్ని
చెప్పినట్టి స్థలికిని వ♦చ్చితిమి మనము ౭ 3162

క. ఇదిగో పర్వతవరమి, య్యదియే యాఁ జిత్రకూట ♦ మనునది గంగా
నది యిదియే కనఁబడు న, ల్లదిగో దూరమున విపిన ♦ మసితాబ్దమునన్.

క. గిరులం బోలిన మామక, కరులివియే చిత్రకూట ♦ కమ్రప్రస్థో
త్కరముల భంజించెడు; జల,ధరములు వర్షర్తువున ను♦దకసంగతిచేన్. ౯

తే. నల్లనై యుండి యుర్వి [2]వ♦నముల విడుచు
నట్టు లీ వృక్షములు కొండ♦యందు సాను
తలములందెల్లఁ బుష్పసం♦తతిని రాల్చు
చున్నయవి చూడుమాయని ♦ యొప్పఁ బలికి. ౧౦ 3165

చ. అనుజునిఁ గాంచి యిట్లనియె ♦ నద్రి మొనళ్లను గూడియున్న భం
గిని మృగసంఘసాంద్రమయి ♦ కిన్నరులుండఁ గలట్టి తావులం
దనరుచు నున్న యీశిఖరి ♦ తల్లజమున్ గనుమా; శరత్తునన్
ఘనములు నీరిఁబాసి లఘు♦గాత్రములై యలరారుచుండుటన్. ౧౧ 3166

క. అనిలప్రేరితములయి ది,విని నతివేగమునఁ బోవు♦విధమున నివిగో
కనుమా జింకలగుంపులు, మనజను లదలింపఁ బఱచె ♦ మంజుల గతితోన్.

[3]ఆ. దాక్షిణాత్యనరులు ♦ తమనీలచికురము, లను బలకలుగాఁగ ♦ లలితరీతి

---

1 వసిష్ఠం మంత్రిణాం వరమ్-అనిమూలము. 2 వనములు=నీటిని. 3 మేఘప్రకాశైః ఫలకై ర్దాక్షిణాత్యా యథా నరాః-అనిమూలము. 'దాక్షిణాత్యాహి కేశానుద్ధృత్య బద్ధ్వా కుసుమాపదై రలం కుర్వంతి' అని గోవిందరాజులు. 'దాక్షిణాత్యాహి ఫలకాన్ బుష్టాదిచర్మపినద్ధాన్ కృత్వా తేషు పుష్పాణి వికీర్య శిర స్సుధారయంతీతి ప్రసిద్ధిః' అని మహేశ్వరతీర్థులు.

సిగను వేసి పూల ♦ సొగసొనరించెడు, నట్టు లీ మహీరు♦హముల పిండు.

క. శిరముల సురుచిరవాసన, లరుదుగఁ గల్గించు పూల ♦ నలరించుకొనెన్
గరము భయదంబుగాఁ దగు, నరణ్యమిది విగతమాను♦షారవమయ్యెన్.

క. మన సైనికజనులుండుట, జనసంకులమౌ నయోధ్య ♦ సరణి నిపుడు నా
కును గన్పడుచున్నది దీ,నిని గనుమా నాల్గుదెసల ♦ నీవో యనుజా!. ౧౪

క. తురగాది ఖురసమాహతి, ధరనుండియె రేఁగినట్టి ♦ దారుణరజ మం
బరముఁ దగ నావరించెను;, మరుత్తు నాకుం బ్రియంబు ♦ మదిఁ గాంక్షించెన్.

తే. కాననే రాముఁడుండిన ♦ మానితాశ్ర
మంబు గనఁబడదని యీరఁ♦జంబు వేగ
పాఱఁ దోలుచు నున్నాఁడు ♦ బరవసమునఁ
గంటివే లక్ష్మణానుజా! ♦ కాన సొగసు. ౧౫ 3172

[1]క. సారథివర్యులు మనమున, శ్రీరాముం గనెడువేడ్కఁ ♦ జెలఁగుచు నిదిగో
వారువములఁ బూన్చిన రథ, వారము పై నెక్కి తోలు♦వారలు గంటే. ౧౬

క. అరదంబుల ధ్వని కులుకుచు, సురుచిరబర్హిములతోడ ♦ సొంపుగఁ గననౌ
వరబర్హిణములు నెలవులఁ, ద్వరపడి చేరెడిని గనుము ♦ వత్సా! యివిగో!. ౧౭

తే. ఈప్రదేశము మిక్కిలి ♦ యింపు గలుగఁ
జేయుచున్నది గాన దే♦వాయతనము
నకును జనుమార్గమో యని ♦ నాకుఁ దోఁచు
చున్న దియ్యది మునివాస ♦ మెన్ననిజము. ౧౮ 3175

క. వనిని [2]సితాంకహరిణములు, వనితలనుం గూడి మేను ♦ ప్రసవంబులతో
డను జిత్రితమైనట్టులు, కనఁబడుచున్న యవిరుచిర♦కాయంబులతోన్. ౧౯

చ. పురుషవరేణ్యులైన రఘు♦పుంగవు లేయెడ రామలక్ష్మణుల్
నిరతనివాసశర్మముగ ♦ నిర్మితమై తగు పర్ణశాలనుం
దురో యులపర్ణశాలను గ♦నుంగొన సైనికు లిప్పుడీవనం
బరయఁగఁ బోవఁగావలయు ♦ నన్న రఘూత్తము నానతిం దగన్. ౨౦ 3177

క. పురుషులు శూరులు కొందఱు, కరముల శస్త్రాళిఁ దాల్చి ♦ కాననభూమిన్
ద్వరగఁ బ్రవేశించుచు నం, దరయుచు ధూమమును గాంచి♦రాశ్చర్యముగన్.

తే. ఇట్లు ధూమాగ్రమును జూచి ♦ యోగు దెంచి
భరతుతో నరులుండని ♦ పట్టులందు
నగ్ని యుండదు గావున ♦ నందె రాఘ
వులు చెలంగుట స్పష్టమం ♦ చలరి పలుక. ౨౨ 3179

1 సూతముఖ్యై రధిష్ఠితాన్-అనిమూలము. 2 సితాంకహరిణములు=తెల్లమచ్చలజింకలు.

తే. ఒక్క వేళఁ బరంతపు ♦ లుర్వినాథ
తనయులుండకయున్న నా♦స్థలమునందుఁ
దత్సమానులు మానులు ♦ తగ నివాస
మొప్పఁ జేయుట నిశ్చయ ♦ మోమహీశ!. ౨౩ 3180

క. మాయాశయ మిదియని వా, రా యడవిని వెదకి పలుక ♦ నరిమర్దనుఁడౌ
నాయుర్వీశకుమారుఁడు, న్యాయంబగు వారిపలుకు ♦ నాలించి తగన్. ౨౪

క. బలములఁ గని యిట్లను మీ, రలికిడి సేయకయ యుండ♦నగు, నిఁక మీఁదన్
గలభూమి దాఁటఁ గూడదు, నిలువందగు నిందె నృపుల ♦ నేనొక్కండన్.

తే. మఱి సుమంత్రుండు సచివుల ♦ మండలమున
ఋత్విజులలో వసిష్ఠుఁడీ♦రీతి మేము
ముర్వురమె పోవఁగాఁ దగు ♦ నెవ్వరింకఁ
జనఁ దగదటంచుఁ బల్కెన ♦ సైన్యమెల్ల. ౨౬ 3183

క. భరతుని యాజ్ఞం దలనిడి, యరణ్యమున నందె నిలిచె ♦ నాతఁడు ధూమం
బరయఁదగు చోట దృష్టిని, బరఁగించె; న్నిలిచియున్న ♦ భటవారములున్.

చ. నరపతి సూనుఁ డట్టులు వ♦నంబునఁ దమ్మొగి నిల్పిపోవ స
త్వరముగ నింక రాముఁ బ్రియ♦దర్శనునిం గనవచ్చునంచు నా
దరమున నెంచి సంతస ము♦దారముగా మదులందు నిండఁగా
భరతుని యాజ్ఞ నిల్పి పొగ ♦ వచ్చెడు మార్గము చూచుచుండఁగన్. ౨౭

తొంబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౯౪ - వ సర్గము.

రాముఁడు పర్వతశృంగారమును సీతకుం జెప్పుట.

క. భరతుండు చనియె, నవ్వల, సురతుల్యుండైన రాము♦శుభ్రాంశుఁడు భూ
ధరకాననములయందుం, జరియింపం దలఁచువాఁ డ♦చట గిరియందున్. ౧

తే. ఒక్క మాసము వసియించి ♦ యక్కడకును
భరతుఁ డరుదెంచు దినమున ♦ వసుధపుత్రి
కెలమిఁ గూర్పంగఁగోరి స్వ♦హృదయమునకు
సంతసముఁ గూర్పఁబూని యా♦జనకసుతకు. ౧౪ 3187

తే. చిత్రకూటవిశేషముల్ ♦ చెలఁగి చూపి
పలికె; నింద్రుండు శచికిఁ జె♦ప్పంగఁ బూను
విధమునన్; గామినీ! మనో♦జ్ఞ ధర దీనిఁ
గనుచు నుండుట నాకు ని♦క్కాలమందు. ౨౪ 3188

క. సుచిరరాజ్యము విడుచుట, సరసప్రియమిత్రవరుల ♦ సంగతిలేకి
ట్లురుకాననములఁ దిరుగుట, తరుణీ! వగఁ గూర్పలేవు ♦ తథ్యము సుమ్మీ!. 3

సీ. కళ్యాణి! యీగిరి ♦ కమనీయబహువిధపక్షిగణంబును ♦ బహుళధాతు
వంతంబు నగుచు నం♦బరమును నొరయుచు నున్నట్లు పొడవులై ♦యొప్పుశిఖర
ములచేతఁ జక్కఁగా ♦ నలరారుచున్నది, శిఖరిరాజంబగు ♦ చిత్రకూట
మతులధాతుసమూహ ♦ మగుటచే నిందలిస్థలములు కొన్ని ర♦జతనిభములు
తే. రక్తపీతవిచిత్రవ♦ర్ణములు కొన్ని
యింద్రనీలాభములు కొన్ని ♦ యెసఁగుఁ బుష్య
రాగశుద్ధస్ఫటికవర్ణ ♦ రంజితములు
కొన్ని, కేతకవర్ణముల్ ♦ కొన్ని తనరు. ౫ 3190

తే. కొన్ని చుక్కలవలె నొప్పుఁ ♦ గొన్ని పాద
రసమువలెఁ బొల్పుమీఱుచు ♦ రాజిలెడు; సు
లలితమునివర్యసన్నిధి ♦ మెలఁగుచుంట
శాంతిగుణమున వనమృగ♦సంఘమెల్ల. ౬ 3191

క. అలరారెడు కనుమా, జింకలు శార్దూలములు ద్వీపి♦గణ మెలుఁగులు ప
క్షులు బహువిధములఁ దిరిగెడు, గలుగదు వైరంబునిందుఁ ♦గడుఁజిత్రముసూ.

సీ. సహకారములు పన♦సలు వేగిసంబులు నేరేళ్లు లొద్దుగల్ ♦ మోరటులును
జంత్రలూడుగుచెట్లు ♦ సరసంబులై తగు తినిశముల్ బిల్వంబు♦లును వెదుళ్లు
దుమ్మికిచెట్లును ♦ గుమ్ముడుచెట్లును వేఁపలు నులిమిరి ♦ వృక్షములును
నిప్పలుఁ దిలకంబు ♦ లెల్లెడ రేఁగులు నాఁపలుక్, కదంబ ♦ హారితరువు
తే. లెల్లెడలఁ బ్రేంకతేఁగల ♦ నేఱుమద్దు, లల్లి దానిమ్మచెట్టు లీ♦యాదియైన
వెల్లఁ బుష్పఫలచ్ఛాయ ♦ లుల్లసిల్ల, నుంట సిరి పెంపు నింపుచు ♦ నున్న దద్ది.

క. కను కొండనెత్తములపైఁ, గనినంతనె పులకరింత ♦ గలిగించెడు రీ
తిని నొప్పు కిన్నరులు తమ, వనితలతోఁ గ్రీడసల్పు ♦ వారు మునమునన్. ౧౧

క. తరుశాఖలఁ దమఖడ్గాంబరములఁ దగిలించియున్న♦వారలు విద్యా
ధరులెల్లఁ జూడుమా! త, త్తరుణులు క్రీడించు స్థలులు ♦తనరెడు మిగులన్.

క. ఒకచో సెలయేఱులు వే,ఱొకచో ధరమీఱివచ్చు ♦ నూటలు పొదలన్
*బ్రకటపు మదధారలఁ దగిన కరివలెం గ్రాలు సాధ్వి! ♦ నగరాజిత్తఁడున్. ౧౩

సీ. ఇంచలి గుహనుండి ♦ యేర్పడ వీతెంచు వాయువు వివిధపు♦ష్పముల రుచిర
వాసనల్ దృప్తిగా♦వహియించి ఘ్రాణేంద్రియమునకు మిక్కిలి♦హాయిగలుగఁ
జేయుచున్నదిగానఁ ♦ జిత్తము లెవరివి సంతోషమందంగఁ ♦ జాలకుండు!
సర్వాంగసుందరీ! ♦ యుర్వీధ్రమున నిందు నిను సుమిత్రాపుత్రు♦నిం దగంగఁ

---

* ప్రవన్నదఇవద్విపః-అనిమూలము.

తే. గలిసి పెక్కేఁడు లుందు నే ♦ నల యయోధ్య
వదలి వచ్చిన దుఃఖంబు ♦ బాధచేయ
కుండు, నోభామినీమణీ! ♦ యురుతరఫల
పుష్పముల నొప్పి బహుపక్షి♦పూగమగుచు. ౧౫ 3197

క. అతిశయమనోజ్ఞమై శిఖ,రతతులతోఁ గూడి యొప్పు ♦ రాజిల్లఁగ ను
న్నతమోద మొసఁగు నీగిరి, సతతముఁ గ్రీడింప వేడ్క ♦ జనియించె సతీ!.

క. వనమున నిందు వసించుట, జనకుని ఋణమెల్ల దీర్పఁ ♦ జాలుట ధర్మం
బున భరతునకుం బ్రీతిని, నొనఁగూర్చుట యనుఫలమ్ము ♦ లొప్పెఁ రెండున్.

సీ. కిన్నరసముదయ ♦ క్రీడాభిచేష్టితంబులు మలయానిల ♦ లలితకోకి
లాలాపములు మొద♦లైనవి మనసును వాక్కాయములను స్వ♦వశగతములు
గాఁ జేసికొనునట్లు♦గా నలరారెడి; వీనిఁ గాంచుచు నీవు ♦ వితతపర్వ
తమునందు నిందు నెం♦తయు నన్నుఁ బ్రేమతోఁ గలిసి క్రీడింతువే♦గద,విదేహ

తే. రాజపుత్రీ! మఱొక్కటి ♦ రమణ వినుము
నాదు ప్రపితామహాది భూ♦నాధమాను
లంగమును వీడినంత భ♦వాబ్ధి దాఁట
నమృతభోగ్యంబు వనవాస ♦ మనిరి గాదె?. ౧౮ 3200

క. వనవసతి ముక్తిసాధన, మనియే వారలు వచించి ♦ రద్రిని నీలం
బును బీతసితారుణములు, గను జెలఁగెడు కొండశిలలు ♦ గడువిస్తృతముల్.

క. నలుఁగడల నిండి నూఱుల, కొలఁదిగఁ జెలువారుచుండుఁ ♦ గోమలి! యిందుం
గల దివ్యౌషధులు నిశిని, విలసిల్లుచు నాత్మకాంతి♦వితతులఁ బెలుచన్. ౨౦

క: హుతవహుశిఖలం బోలుచు, నతిశయముగ వెలయుచున్న ♦ వారయ నెన్నో
యతివా! కనంగ నీపర్వతమున నున్నట్టి కొన్ని♦భాగము లరయన్. ౨౧ 3203

ఆ. గుహలు గలిగియుంట ♦ గృహములరీతిని
వృక్షనికరయుక్తి ♦ వెలయుచుంట
నొప్పుఁ గొన్ని యిందు ♦ నుద్యానముల భంగి
నేకశిలగఁ గొన్ని ♦ యొసఁగుఁ జుమ్ము!. ౨౨ 3204

తే. ధరణి భేదించుకొని మహీ♦ధ్రమిది లేచె
నొక్కొ యన్నట్లు కనఁబడు♦చున్న దిపుడు
శిఖర మిది మంజులంబయి ♦ చెలఁగుచున్న
దక్షిసంప్రీతికరమయి ♦ యబల! కంటె. ౨౩ 3205

పున్నాగకువలయ ♦ పుత్రజీవికములు భూర్జపత్రమ్ములు ♦ పొందుమీఱఁ
బయిఁ బఱువంబడి ♦ పద్మదళంబుల నలరు కాముకుల శ♦య్యలను గనుము!
కాముకసముదాయ♦కరసుర్దితములయి పాఱవేయంబడి ♦ పలుస్థలములఁ
బడిన పంకజహార♦పటలమ్ములును వార లనుభవించినయట్టి ♦ హారిఫలము

తే. లందుఁ గనఁబడుచున్నవీ ♦ యద్రివరము
బహుళమూలఫలోదక ♦ భాసమాన
మగుచు సౌగంధికసరస్సు ♦ నలక నుత్త
రకురుదేశాళి మించుక♦రణిఁ జెలంగె. ౨౮ 3206

చ. వరనియమాళి సత్పురుష♦వారము పోవు పథంబు నొంది [1]యీ
ధరమున నిన్ను లక్ష్మణునిఁ ♦ దద్దయుఁ గూడి చతుర్దశాబ్దముల్
జరపి స్వవంశధర్మమగు ♦ సత్పరిపాలనయుక్తిఁ బొల్చు భూ
వర సుఖమొందువాఁడ మృగ♦వామవిలోచన! ప్రాణనాయికా!. ౨౯ 3207

తొంబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౯౫ - వ సర్గము.

### రాముఁడు సీత నుపలాలించుట.

చ. జనకకుమారి కిట్లు నృప♦చంద్రుఁడు రాముఁడు చిత్రకూటభూ
ధ్రనిఖిలచిత్రముల్ తెలిపి ♦ తద్గిరినిం దిగి స్వచ్ఛవారితోఁ
గనుఁగొన రమ్యమై వెలయు ♦ గంగను శైవలినీవతంసమున్
గనఁబఱచెన్ మదిం గలుగు ♦ కౌతుకమెంతయుఁ బొంగుచుండఁగన్. ౧

చ. గురుజఘనాభిరామయయి ♦ [2]క్షోణిధరంబు ననంబుఁ జూచునా
దరమున మోము దమ్మి విత♦తంబయి చంద్రునిఁ గ్రిందుచేయ ని
ర్భరతరసంప్రమోదమున ♦ భాసిలు సీతనుగాంచి పద్మసుం
దరనయనాభిరాముఁడయి ♦ తా రఘురాముఁడు పల్కె నివ్విధిన్. ౨ 3209

సీ. అందమై చిత్రంబు♦లై తగు పులినంబు లలరార, సారస♦హంససేవి
తంబయి పద్మసం♦తతసంపదలఁ బొల్చి నెఱిఁ దగు మందాకి♦నీనదిఁ గను
జానకి! యీనది ♦ మానితతీరంబు లందున్న బహువిధ♦హారిపుష్ప
ఫలవృక్షములఁ గూడి ♦ వెలయుచు యక్షేశు సౌగంధికసరస్సు♦చందమునను
తే. ప్రబలుచున్నది మృగవిస♦రములు నీరుఁ
ద్రాగఁ గలిగిన జలములఁ ♦ దనరియును ని
తాంతరమ్యములై యొప్పు ♦ తటములఁ గన
జలకమాడంగ మదిఁ బ్రీతి ♦ కలిగెడి నిట. ౩ 3210

క. మునులదె ప్రేయసి! కృష్ణాజినముల జటలన్ ధరించి ♦ చెలఁగుచు మందా

---

1 ఈధరమునన్=ఈచిత్రకూటమునందు. 2 చారుచంద్రనిభాననామ్-అనిమూలము. దీనికి వ్యాఖ్యయందున్నభావమే యిటఁ జెప్పఁబడియె.

కిని మున్గువారు కాలం,బున [1]వల్కము లుత్తరీయ♦ములుగాఁ గనుమీ!. ౬

తే. సంశ్రితవ్రతులౌ ముని♦చంద్రులిదిగొ
హస్తములఁ బైకినెత్తి ని♦యమము చెలఁగఁ
దరణిఁ జూచుచునే యుప♦స్థానమును నొ
నర్చుచున్నారు సువిశాల♦నయన! కనుము!. ౭ 3212

చ. తరువులు కొమ్మలెల్లను [2]స♦దాగతి వే కదలింపఁగా సుమో
త్కరముల గంగ నెల్లెడలఁ ♦ గ్రమ్మఁగఁ జేయుటఁ జూడ నీమహీ
ధరము చెలంగి నృత్యము ము♦దంబునఁ జేయఁగ బూనువానిదా
కరణిని గృత్యముల్ సలుపఁ♦గా మది నెన్నినయట్లు తోఁచెడిన్. ౮ 3213

సీ. ముత్తియంబులతళ్కు♦మొదయునీరొకచోటఁబులినంబులొకచోటఁ♦బూజ్యలై
సిద్ధులొండొకయెడఁ♦జెలఁగుచుండఁగనదియారారుచున్నది♦యదియొకచుమ [న
వాయుధూతములుపు♦ష్పములుజొంపములుగఁ దటములఁబడియొప్పు♦తఱుఁగఁ జు
వుదకమధ్యమమున ♦ నొకచోటఁ దెప్పలఁ దేలుచుండెడు నట్టి♦పూలపిండు [న్న

తే. లను గనుంగొనుమా! ఘన♦లలితవేణి!
చక్రవాకము లొండొంటి ♦ సరసవచన
ములను బిల్చుచుఁ గూజితం♦బులను హాయి
గూర్చుచుం బూలపైఁ నెక్కుఁ ♦ [3]గోరి రతిని. ౧౧ 3214

చ. ఉరుతరచిత్రకూట మి వ♦యోధ్యను భద్రనికేతనార్థమై
పరఁగుట మించుఁగాన నిట ♦ వాసము యుక్తము గంగఁ గాంచుటల్
తరుణిరో! నిన్నుఁ జూచిన ము♦దంబును మించెడు నంచు నెంతు; ని
ర్భరశమముల్ దమంబును ద♦పంబును గల్గిన సిద్ధులాదృతిన్. ౧౨ 3215

తే. ధూతకల్మషు లౌటఁ బ్ర♦భూతభక్తి, వనిశముల్ స్నానమొనరింప♦నభ్రగంగ
వారిపాదరజస్సుల ♦ వజలు జలము, గలిగియుండును గాన న♦న్గలిసి నీవు. ౧౩

క. జలకేళిఁ దేలుమా [4]స్తన,ముల పిఱుఁదుల నిహతివలనఁ ♦ బుట్టి పెరుగు నూ
ర్ముల తాఁకున రక్తాంబుజ,ముల సితపద్మముల నీట ♦ ముస్గించి తమిన్. ౧౪

క. చెలికత్తియతోడం బలె, నిలాసుతా! నన్నుఁగూడి ♦ యీజాహ్నవిలో
జలకేళులఁ గావింపుమ, కలుగవు సంతాపములిఁక ♦ గంగాకేళిన్. ౧౮ 3218

క. వనచరజంతువులం బుర, జనులనుగా నీమహీధ్ర♦శతముఖుని నయో
ధ్యనుగా నీజాహ్నవినది, నిని సరయువుగాఁ దలంపు ♦ నీ వనిశంబున్. ౧౯

క. అనుజుఁడు ధర్మాత్ముఁడు నా, పనుపును జేయుచునె యుండు ♦ వదలక; నీవో

1 వల్కము, వల్కలము సమానార్థకములు. 2 సదాగతి=వాయువు. 3 అనేనచక్రవాకరతిర్దర్శితా-అనువ్యాఖ్యాసారమే యిది 4 స్తనజఘనాఘాతజనితతరంగై రితిభావః-అను వ్యాఖ్య కిది తెలుఁగు.

యనుకూలగతిం దనరితి, వనితా! సంతసముఁ గూర్చు♦వారలు మీరల్. ౧౪

సీ. ఇటు మూఁడు వేళల♦నిందుమునుంగుచు ఫలముల మధుమూల♦ములను దినుచు
నినుఁగూడినట్టి నే♦ను నయోధ్యఁగాని రాజ్యమ్మునుగాని ర♦వంతయైన
నొల్ల, నీగంగయు ♦ నొప్పుమనోజ్ఞమై మృగసమూహంబులఁ ♦ దగు మహర్షి
యాశ్రమబలమున ♦ హస్తిసింహంబులు వానరములు పర♦స్పరవిరోధ

ఆ. ములను మాని యిందు ♦ జలముఁ ద్రావుచునుండుఁ
గాన పాపహరము ♦ గాంగతీర
మిందు భూమిజమ్ము ♦ లెల్లఁ జక్కఁగఁ బూచి
యుంటఁ దృప్తి హెచ్చు♦చుండుఁ జుమ్ము!. ౧౭ 3221

క. జలకము లాడియుఁ గ్లేశం, బుల వీడియు నిందును సుఖ♦ముం బొందనివాఁ
డిలఁ గలఁడే యని రాఘవుఁ, డెలమిం బ్రియురాలితోడ♦ నెంతయుఁ బూన్కిన్.

క. పలువిధముల గంగానదిఁ, దలఁచి వచించుచుఁ బ్రసక్తిఁ ♦ దనకొప్పఁగ ని
మ్ముల నయనాంజనరీతిగ, నలరెడు గిరిపార్శ్వముల వి♦హారము సల్పెన్. ౧౯

తొంబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౯౬ - వ సర్గము.

{ అడవిమృగములు భయపడి పాఱుటం జూచి రాముఁడు తత్కారణమును లక్ష్మణుని జూడుమనుట. }

క. గిరినదియగు మందాకిని, యగుపగు వైభవము రాముఁ ♦ డటు ప్రీతిమెయిం
దరుణికిని జూపి యంతట, ధరము పయిం గూరుచుండి ♦ తా జానకికిన్. ౧

క. సురుచిరమాంసముఁ జూపుచు, వరుణీ! పరిశుద్ధ మాచుఁ ♦ దగు నిద్ధి రసో
త్కరమై పరఁగెడు నిది శుచిఁ, బరిపక్వంబైన దిద్ది ♦ భవ్యము సుభ్రూ!. ౨

క. అనుచున్ వశీకరింపం, గను జాలెడు మాటలాడి ♦ కాంతామణితో
డను గూడి ధర్మయుతబుద్ధిని దగు రఘువర్యుఁ డుండెఁ ♦ దృప్తిం గనుచున్.

తే. రాముఁ డీరీతి నచ్చట ♦ రమణిఁ గూడి
యుండఁగా నాతనిం జూచు ♦ నుద్యమమున
వచ్చు భరతుని సేనల ♦ పాదధూళి
యును ధ్వనియు మిన్నుముట్టె న♦త్యుగ్రరీతి. 3 3227

క. అత్తఱి నాపెనురవమున, కుత్తలపాటొంది బెదరి ♦ యూథపమృగముల్
చిత్తము లార్తిం బొందఁగఁ, దత్తఱమునఁ బాఱె మృగయు♦తములై దెసలన్.

క. సేనానినదము రాముఁడు, నా నత్తఱి వినియె నపుడె ♦ తద్ధ్వనికార్తిన్
గానలఁ బరుగిడు మృగసంతానము యూథపమృగాళిఁ♦దఁగనుఁగొనియెన్.

సీ. పరుగెత్తు మృగముల ♦ పటలంబుఁ గనుఁగొని యామహాధ్వనినదంబు ♦ నాలకించి
రఘువర్యుఁ డా సుమి♦త్రాపుత్త్రు దీప్తతేజస్కునిఁ గని పల్కె ♦ సత్వరముగ
నాహా! యిదేమి ప్రి♦యానుజాతా! సుమిత్రానందవర్ధనా! ♦ యట్లు చూడు
భయదమేఘధ్వని ♦ భంగి గంభీరమై తుములమై యొకనిస్వ♦నము వినంగఁ
తే. బడియె వనమునఁ బంచాస్య♦భయమువలన
బెదరి గజయూథములో మృగ♦వితతియో మ
హిషసమూహమొ దిక్కుల ♦ కెల్లఁ బాఱు
చున్న వాతురమున విను ♦ మొక్కమాట. ౧౦ 3230

క. ధరణీపుఁడో తత్సముఁడో, యరణ్యమున వేఁటలాడ ♦ నరుదెంచెనొ భీ
కరమృగమేదై నను నిటుఁ, దిరుగుచున్నదియొ యనుజ! ♦ తెలియందగుఁ జూ!.

క. గిరియిది పక్షివితతికిన్, జరియింప నశక్యముగును ♦ సౌమిత్రీ! స
త్వరముగ నీహేతువులను, బరికించి యథార్థ మెదియొ ♦ పలయుం దెలియన్.

క. అన విని లక్ష్మణుఁ డప్పుడె, చని చక్కఁగఁ బూచి చూడఁ ♦ జాల ననువుగాఁ
గనుపట్టు నొక్కవృక్షం,బు నెక్కి దెసలెల్లఁ గనుచుఁ♦బూన్కి మెఱయఁగన్.

క. తూరుపుదిక్కున దృష్టిన్, సారించె, నుదీచినట్లె ♦ చక్కఁగఁ జూడన్
వారణఘోటకములు రథ,వారములన్ నిండియున్న ♦ బల మగపడియెన్.

తే. యుద్ధసన్నద్ధమై యున్న ♦ యురుపదాతి
చయము దృగ్గోచరంబయ్యె ♦ సానుజములు
హయనికాయము పరకేత♦నాభిరామ
రథసమూహముగల సేన ♦ రామ! యిదిగో. ౧౫ 3235

క. చనుదెంచుచున్నయది యని, ఘననాదం బడరఁ దెల్పి ♦ కడువేగమ య
గ్నిని జల్లార్పుఁడు సీతయుఁ, జనుఁగాక గుహాంతరాళ ♦ సద్మ్మునకున్. ౧౬

క. శరకవచంబులఁ గొనుమా, శరాసనము సందికొమ్ము ♦ సత్వరమ యనన్
బురుషలలాముఁడు శ్రీరఘు,వరుఁ డాలక్ష్మణునిఁ గాంచి ♦ పలికెం గడఁకన్.

క. అనుజా! చక్కఁగఁ గనుమా, యనువుగ నీసేన యెవరి♦దై యుండునొ కే
తనచిహ్నములఁ గనినం,తనె యెరిదటంచుఁ దోఁచెఁ ♦ దగ నీ కనినన్. ౧౮

క. జ్వలనువలె మండిపడి యుజ్జ్వలరీతిని వచ్చుచున్న ♦ సైన్యముఁ గాల్పం
దలఁచినయటు కోపంబునఁ, బలికెను లక్ష్మణుఁడు రామ♦భద్రునితోడన్. ౧౯

చ. భరతుఁడు కేకయాత్మజకుఁ ♦ బట్టియె కావునఁ గ్రూరచిత్తుఁడై
వరములఁ గైక కోరఁ దన♦వాంఛయుఁ దీరఁగఁ బట్టభద్రుఁడై
పరఁగియు శత్రుహీనమగు ♦ భాసురరాజ్యముఁ బొందఁగోరుచుం
[1]బరులము గావునన్ మనలఁ ♦ బల్విడిఁ జంపఁగ వచ్చువాఁ డిదే. ౨౦ 3240

1 పరులము గావునన్=శత్రులము గనుక.

తే. ఇదిగో మిగులంగఁ బెద్దదై ♦ యెంతో కాంతి
గలిగి తనరారు భూరుహం ♦ బలరె ధ్వజము
నందు; నత్యున్నతస్కంధ♦మైన కోవి
దార కేతన మలరు స్యం♦దనమునందు. ౧౯ 3241

తే. [అల్లదిగో గొప్పబోదియ ♦ యట్టిశాఖ
లెల్లఁ జెలువారుచుండంగ ♦ నెంతో వింత
గాఁగ నీకోవిదారవృ♦క్షంపుఁ బడఁగ
యరదమునఁ గ్రాలుచున్న దో♦యన్న నిజము] 3242

సీ. వీరె గుఱ్ఱపురౌతు ♦ లౌర! వేగంబుగఁ బరుగెత్తు ఘోటక♦పటలి నెక్కి
యిచ్చవచ్చినయట్టు ♦ లిచ్చోటి కేతెంచుచున్నవారిదిగో, హ♦స్త్యుత్తమముల
నెక్కి వీరులు కొంద♦ఱంతయు నేడుకఁ బొదలుచున్నారు పెం♦పు వెలయంగ
వీరశిఖామణీ! ♦ భూరిచాపంబులఁ దాల్చి దుర్గముగ నీ ♦ ధరణీధరము

తే. నాశ్రయింతము; కాదేని ♦ యాయుధములఁ
దాల్చి సన్నద్ధులమయి యీ♦స్థలమునందె
నిలుత మింక [1]సంగరంబున ♦ నెలమి వచ్చు
కోవిదారధ్వజంబు చి♦క్కునె! మనకిట. ౨౦ 3243

ఆ. ఎవరికారణమున ♦ నింతటివ్యసనంబు, నీకు భూమిసుతకు ♦ నాకుఁ గలిగె
నట్టి భరతు నిప్పు ♦ డనిమొనఁ జూతునా, రఘుకులాబ్ధిసోమ! ♦ రమ్యనాము!.

క. వీరోత్తమ! యెవ్వనిదగు, కారణమున శాశ్వతముగు ♦ ఘ్నా రాజ్యము ని
ష్కారణముగ వీడితివో, శ్రీరామా! యరిభరతుఁడు ♦ చెచ్చెఱ వచ్చెన్. ౨౨

తే. వీఁడు నాకును వధ్యుఁడే ♦ గాఁడె; రామ!
[2]భరతునిం జంపినందునఁ ♦ బాపమేది
యైనఁ గలదని తోఁపదు ♦ మానసమున
వినుము వేఱొకమాటను ♦ విన్నవింతు. ౨౩ 3246

క. అపకృతి ముందొనరించిన, కపటాత్ముని నరి వధింపఁ♦గ నధర్మము ను
మ్మీ పుడమి ననుచున్ శాస్త్రము, లుపన్యసింపవు మహాత్మ! ♦యొకపరియైనన్.

క. మనకున్ భరతుఁడు ధర్మం,బును విడనాడియె యొనర్చెఁ ♦ బూర్వాపకృతిన్
గనుక నతం డనిఁ దెగఁగా, మనుజేంద్రా! యేలవయ్య! ♦ మహి నెల్లఁ దమిన్.

క. కరిభగ్నమైన భూజము, కరణిన్ రాజ్యమును గోరు ♦ కైకయు ననిలో
భరతుఁడు నాచేఁ దెగినం, బరమార్తినిఁ బొగులువృతుని♦భరతునిగనుచున్.

1 అపి నౌ వశ మాగచ్ఛేత్ కోవిదారధ్వజో రణే-అనిమూలము. 2 భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ-అనిమూలము.

తే. [1]సానుబంధసబాంధవ♦మైన కైక
నిపుడు వధియింతు, నేఁటికి ♦ నిల సమస్త
పాపపరిముక్తయె తగ ♦ వఱలుఁ గాక
మానదా! రాఘవా! యొక్క♦మాట వినుము. ౨౯ 3250

సీ. [2]స్తంభితక్రోధ మ♦సత్కారము నిట నా బాణముల నేఁడు నే♦పమున నెండు
పొదయందు నగ్నిని ♦ గదియించునట్టులు పగతుని సేనపై ♦ వైతు నిపుడు;
వాడితూపులఁ బగ♦వారి దేహంబులఁ దునుమాడి యీగిరిఁ ♦ దోఁచు నడవి
నంతయు రక్తమ♦యంబుగాఁ జేసెద; మచ్ఛరధారాభి♦మర్దితహృద
తే. యములఁ గరిహయముల భట♦సమితి నెల్ల
నిందుఁ గల క్రూరమృగతతి ♦ యీడ్చుకొనుచుఁ
బోవుఁగాక; మహాయుద్ధ♦ములను నాదు
శరధనుస్సుల కాహుతి ♦ సలిపినాఁడ. ౩౦ 3251

క. ఐనను నిత్తఱి సంగర, మేనొనరిచి భటవితతిని ♦ నెల్లను భరతున్
నా నిశితశరహతులఁగా, మానక యొనరించి ఋణము ♦ మాపెద రామా!.

తొంబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౯౭ - వ సర్గము.

రాముఁడు లక్ష్మణుని కోపమును శాంతి నొందించుట.

చ. అన విని యంత రాముఁడు మ♦హాత్తరకోపయుతాత్ము లక్ష్మణుం
గనుఁగొని సాంత్వనోక్తులఁ ద♦గం గ్రుధమాన్పుచు నిట్లు పల్కె; నో
యనుజ! మహాధనుష్కుఁడు మ♦హామతిమంతుఁడు కైకపుత్రుఁడో
ననువుగఁ గోరి తానె యిటు♦లాతురుఁడై చనుదెంచి నంతటన్. ౧ 3253

క. కరవాలచాపములతోఁ, బరఁగెడు కార్యంబు గలదె ♦ పల్కుము, యనుజా!
పురిఁ దండ్రి సత్యపాలన, మరసి యొనర్తునని పల్కి ♦ యనుజుఁడు రాఁగన్.

చ. పనివడి మృత్యుపాలికిని ♦ బంపుదు నేని పితృప్రదత్తమా
ధనమును రాజ్యముం గొనియెఁ ♦ దమ్మునిఁ జంపి యటన్న నిందలం
గను ఘనరాజ్య మేమిటికి ♦ గాల్పనె దానిఁగొనంగ నెంతు నే;
ధనమిది మిత్రబాంధవ వ♦ధంబున వచ్చునయేని లక్ష్మణా!. ౩ 3255

తే. అద్ది విషభక్ష్యతుల్యమే ♦ యగును దాని
నేను గ్రహియింప నెంచను ♦ సూనృత మిది

---

1 సానుబంధాం సబాంధవాం-అని మూలము. మంథరాదు లనుబంధులు. 2 అద్యేమం సంయతం క్రోధ మసత్కారం చ మానద, మోక్ష్యామి శత్రుసైన్యేషు కక్షేష్వివ హుతాశనమ్-అని మూలము.

ధర్మ మర్థంబు కామంబు ♦ ధాత్రి వీని
మీనిమిత్తమె కోరు చు♦న్నాను మదిని. ౭౪ 3256

క. అనుజా! యిది నిశ్చయమే, యని ప్రతినం జేయువాఁడ ♦ నవనీరాజ్యం
బనునది పలుఛిద్రంబులఁ, గనియుండుం గాన దానిఁ ♦ గాంక్షింపఁ జుమీ!. ౫

సీ. రాజ్యంబు సోదర♦ రక్షణార్థము ద్రవ్యసంగ్రహార్థమును, ద♦త్స్వాంతవాంఛ
లను దీర్చుటకు వార♦లను వృద్ధిసేయుటకును గ్రహియింపంగఁ ♦ గోరువాఁడఁ
గాని నాకొఱకుగాఁ♦గాదు, నాయీమాట తథ్యమేయని యాయు♦ధములముట్టి
ప్రతిన యొనర్చెదఁ ♦ బరమసౌమ్యా! సముద్రాంతమై తగిన యీ♦యవనినెల్ల

ఆ. నేను సంగ్రహింపఁ ♦ బూనినచోఁ గష్ట, మేమిలేదు లభ్య♦మే సుఖముగ
నైన ధర్మహీన ♦ మైనరీతిని వచ్చు, నమరవిభుతనైన ♦ నభిలషింప. ౭ 3258

క. నీకును శత్రుఘ్నునకుం, గైకేయీపుత్రకునకుఁ ♦ గాని సుఖము నా
కేకరణిఁ గల్గినన్ శిఖి, వే కావించుతను భస్మ♦విధిగా దానిన్. ౮ 3259

సీ. అది యెట్టిదియెయైన ♦ నభిలషింపను జుమీ మానదా! లక్ష్మణా ♦ మాటదీని
వినుముప్రాణంబులు♦వెలయఁ బ్రియంబులై వానికంటెఁ బ్రియుండు♦భరతుఁడగు
భ్రాతృవత్సలుఁడగుఁ ♦ బలుపల్కు లేటికనేల పెద్దలసేవయే ♦ విధియని మదిఁ [ను
వలపోసి మనదగు♦కులధర్మముఁ దలంచి యొగివచ్చియుండున♦యోధ్యకనుచుఁ

తే. దలఁచుచున్నాను వీర! మా♦తులుని పురము
నుండి చనుదెంచి పితృనాజ్ఞ ♦ దండకాట
వులకు జడలను వల్కల♦ముల ధరించి
నేను వచ్చుట విని సీత ♦ నిన్నుఁ గూడి. ౧౦ 3260

క. మనమున నాపై నెయ్యం, బనునది పైకొనఁగ వెతల ♦ నాకులితములై
తన యింద్రియములు తొట్రిలఁ, జనుదెంచెన్ మనలఁజూడఁ♦జయ్యననిటకున్.

తే అంతియే కాని వేఱొక ♦ చింతలేదు
వానిమనమున ననితోఁచె ♦ మానసమునఁ
దల్లి నప్రియవాక్కులఁ ♦ దల్లడిల్లఁ
జేసి తండ్రిఁ బ్రసన్నునిఁ ♦ జేసి యిపుడు. ౧౨ 3262

క. తన కిచ్చిన రాజ్యము నా, కొనఁగూర్పఁగ నిటకు వచ్చు♦చున్నాఁడు సుమా
మనలం జూడఁగ భరతుఁడు, చనుదెంచుటయును జెలంగు ♦ సమయోచితమై.

క. మనసున నేయపకారం, బును మనకుం జేయఁ దాను ♦ బూనఁడు నీకున్
మును పెన్నఁడేని యపకృతి, నొనరిచినాఁడా? వచింపు ♦ మొకమాత్రైనన్

తే. భయము గల్గించుమాటను ♦ బల్కినాఁడొ
యేల భరతునియందు నీ ♦ విట్టి సంశ

యంబుఁ బూనెద విప్పుడో ♦ యనుజ! చెపుమ
భరతునిం జూచి యప్రియ♦వచనమేని. ౧౮ 3265

క. పరుషంబగు వచనం బే, తరుణమునందైనఁ బల్కఁ ♦ దగ దటుపల్కన్
భరతునిఁ గాదది నన్నే, పరుషము లాడినటులౌను ♦ బల్కు లిఁకేలా. ౧౯

*చ. జనకునిఁ జంప నౌ ననుచు ♦ సాధ్వసమింతయు లేక చెప్పెఁగా
మును పిపు డట్టులే సుగుణ♦ముఖ్యునిఁ గైకసుతున్ వధింపనౌ
ననుచు వచించె, నింక నిటు ♦ లావృతి నూరకయున్న హానియౌ
నని భయమంది రాఘవుఁ డ♦హంకృతి మాన్పఁగ నెంచి యిట్లనున్. ౧౯||

సీ. ఎద్దియే నాపద ♦ యే తేర దానికై తనయులు ప్రాణభూ♦తుని జనకునిఁ
జంపుదురే నహ♦జన్ముండు భ్రాతను వధియించునే తగఁ ♦ బల్కు మనుజ!
రాజ్యసంపదఁ గోరి♦రాఘవు నిటు పల్కుదేని యాతఁడు రాఁగ♦నేను భరతుఁ
గని లక్ష్మణునకుఁ బ్రీ♦తిని గల్గఁ జేయుమీ రాజ్యమిచ్చియటంచు♦రమణఁ బలుకు
తే. వాఁడ నిటు మాటమాత్రము ♦ పలికినంత
నతఁడు సత్యంబుగాఁగ రా♦జ్యమ్ము నిత్తు
నని వచించునుగాని వే♦ఱనఁడు సుమ్ము
వాని చిత్తమెఱుంగుదు ♦ నేనటంచు. ౧౮ 3268

సీ. పలికిన నన్నపై ♦ వాత్సల్యముం గల్గి ధర్మశీలుండయి ♦ తనరు లక్ష్మ
ణుఁడు రాముఁ డిట్టుల♦నుటకు సిగ్గొందుచు నవయవంబులలోన♦నపుడు తాను
జొచ్చెనో యన్నట్లు ♦ ఔచ్చవడుచుఁ దలవాంచి తా నన్నట్టి ♦ పల్కులకును
లజ్జించి యిట్లు ప♦ల్కఁగఁ జొచ్చె; మనతండ్రి దశరథభూజాని ♦ తానె నిన్నుఁ
తే. గనుఁగొనఁగ వచ్చినాఁడని ♦ మనమునందుఁ
నాకుఁ దోఁచుచున్నది ♦ నాఁగ, రాముఁ
డతఁడు వేఱొక ప్రస్తావ ♦ మట్లు చేయ
ననుజుఁ డెంతయు లజ్జించె ♦ నని యెఱింగి. ౨౦ 3269

క. అతని మనఃఖేదము వి,చ్యుతమై చనునట్లు చేయ ♦ నూహించి సమం
చితమగు నాప్రస్తావము, మతినూని వచించె నేర్పు♦మాటలతోడన్. ౨౦౧

క. మనలఁ గన మహాబాహుఁడు, జనకుం డిట వచ్చె నంచు ♦ స్వాంతంబున నే
నును దలఁచెద లే కాతఁడు, మనము సుఖార్హులమెయనుచు♦మన్ననతోఁపన్.

క. వనవాసము కష్టతరం, బని తలఁచుచు నిజముగా గృ♦హంబునకుం దో
డ్కొని పోవుననియుఁ దలఁచెద, జనకుఁడు సుఖసేవినియగు♦జానకి నెలమిన్.

* పూర్వం దశరథో వధ్యతా మిత్యుక్తం ఇదానీం భరతో వధ్యత ఇతి ఇత ఉపరితూష్ణీ మవస్థానే కార్యహాని ర్భవిష్యతీతి భయాత్తాం రౌద్రీం బుద్ధిం నియమ్య నివర్తయతి-అనువ్యాఖ్యకీపద్యము వ్రాయఁబడినదని యెఱుంగునది.

క. శ్రీరఘునందను కావున వన, సీమలనుండఁ దగదనుచుఁ ♦ జెచ్చెరఁ బురికిం
దా మరలం గొనిపోఁగలఁడో మహితవిచారసార! ♦ యుద్యమ మలరన్. ౨౩

తే. మంచికులమున జనియించి ♦ మదికి నింపుఁ
గలుగఁజేయుచు వాయువే♦గమునఁ బోలిచి
రాజయోగ్యములగు హయ♦రాజము లివె
వెలయుచున్నవి రెండు వే♦వేగ కనుమ. ౨౪ 3274

క. పెనుదేహము వార్ధక్య,మ్మును గల శత్రుంజయాఖ్యఁ ♦ బోలిచెడు కరినిం
గనుమా! యదిగో వచ్చెడుఁ, దనశీర్షముఁ ద్రిప్పుచున్ ని♦తాంతము సేనన్.

క. లోకోత్తరమును దివ్యము, నై కనఁగాఁ దగిన జనకు ♦ నమలచ్ఛత్రం
బేకరణిఁ గనిన గనఁగా, రాకున్న దదేమొ యిపుడు ♦ రఘువంశబాహూ!.

క. కనుకన్ జనకుని విషయం,బున సందియ మంకురించెఁ ♦ బో, సౌమిత్రీ!
చనుదెమ్మా వృక్షాగ్రం,బుననుండి మదుక్తి నెఱపఁ ♦ బోలును నీకున్. ౨౬

క. అని ధర్మబుద్ధి రాముం, డనుజునితోఁ బలికెఁ నంత ♦ నరికాలుండై
తనరెడి లక్ష్మణుఁ డప్పుడె, ఘనభూరుహశాఖనుండి ♦ కడువడి దిగియెన్. ౨౭

క. చనుదెంచి కేలుమోడిచి, యనివార్యభయంబు గలుగు ♦ నన్నకు నని నె
మ్మనమున సంశయ మడర న,తని పార్శ్వమునందు నిలిచెఁ ♦ దద్దయు భక్తిన్.

సీ. ఆశ్రమమునకెట్టి ♦ యార్తియుఁ గలుగరాదని భరతుండు ము♦న్నాజ్ఞ చేసెఁ
గాన నాతనికగు ♦ సేనయుఁ జిత్రకూటాచలమునకుఁ జు ♦ ట్టావరించె
గజహయస్యందన ♦ కలితమౌ తత్సేన యాపర్వతప్రాంత♦మందు యోజ
నార్ధభాగముఁ జుట్టి♦యంతట నిలిచె, నాశ్రమమున మూఁగిన♦సైన్యముఁ గని

ఆ. యన్న యాగ్రహించు♦నను నీతియెఱిఁగిన
భరతుఁ డడఁకువగను ♦ వలయుఁ బోన
నన్నచెంత కేగు ♦ నట్టి ధర్మముఁ గొని
దర్పము విడిచి తగ ♦ చేష్ట మెఱయ. ౩౦ 3280

క. తనతోఁ దోడ్కొని వచ్చిన, ఘనసైన్యము నెల్ల విడిసియఁ♦గాఁ బంచెను వా
హిని యపుడు శైలభాగం,బున నెంతయుఁ జెలఁగుచుండెఁ♦బొదలెడు వేడ్కన్.

తొంబదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౯౮ - వ సర్గము.

-భరతశత్రుఘ్నులు గుహాదులును రామాశ్రమమును వెదకుట.-

*చ. గురుతరరామదర్శనముఁ ♦ గోరి తదంతికసీమ కేగు భా
గ్యరతిని గన్న పాదములు ♦ గల్గినవాఁడగుటం దలంపఁగాఁ

---

* పాద్యవతాం వరః-అనిమూలము. దీనియర్థమే యిట విస్తృతమని తెలియవలయు.

జరణము లున్న మానవుల ♦ సంఘమునందు మహోత్తముండుగాఁ
బరఁగెడు కైకపుత్త్రకుఁడు ♦ వాహినినిన్ విడియించి యంతటన్. ౪ 3282

చ. జనకుని యాజ్ఞ సేయుటకు ♦ సంతసమ్ముం గను రాముచెంత కో
య్యనఁ దమిఁ బాదచారియయి ♦ యాతఁడు పోవఁగ నెంచి సేనలె
ల్ల నియతమైన చోటను జె♦లంగుటఁ గాంచి వినీతవేషుఁడై
యనుజునిఁ బిల్చి సౌమ్య! [1]మను♦జావళి వ్యాధులఁ గూడి నీవిఁకన్. ౫

చ. వనమున నిందు నల్లడల ♦ వైళమ యారయుమీ, గుహుండు వే
ధనువుల బాణజాలములఁ ♦ దాలిచి ఖడ్గము లూని బంధువుల్
తనుఁ గొలువంగఁ దానె చని ♦ తమ్మునిఁ గూడిన రామచంద్రునిం
గనఁదగు తావునున్ వెదకుఁ ♦ గాక, యమాత్యులుఁ బౌరులున్ ద్విజుల్.

చ. గురువులుఁ జుట్టునుండఁ జని ♦ కోరిక నేనె వనంబు నంతటం
దిరిగెద; రాముఁగాని గడు♦ధీరుని లక్ష్మణుఁగాని భాగ్యవి
స్ఫురణతఁ బొల్చి యాజనక♦పుత్త్రికయై తగు సీతఁగాని యా
దరమునఁ జూచుదాఁక మది ♦ దాగుణదుఃఖము శాంతినొందునే. ౬ 3285

చ. సరసిజపత్త్రనేత్రుఁడయి ♦ చంద్రునిఁ బోలి శుభస్కరంబుగాఁ
బరఁగెడు రాము నెమ్మొగము ♦ భద్రదమై తగుదానిఁ జూచుదాఁ
క రహితదుఃఖమై మనసు ♦ గ్రాలునె నాకు; ధ్వజారవిందసుం
దరకలశాదిచిహ్నములఁ ♦ దాల్చిన యా రఘురాముపాదముల్. ౭ 3286

చ శిరమునఁ దాల్చుదాఁక మదిఁ ♦ జెందినదుఃఖము శాంతినొందు నె
క్కరణిని? బైతృకంబగుచుఁ ♦ గ్రాలెడు రాజ్యము నొందఁజాలు సో
దరుఁ డభిషేకవారిని ని♦తాంతముఁ దోఁగినదాఁక దుఃఖ మె
వ్వరుసను శాంతిఁ బొందదు, ధ్రు♦వంబిది; లక్ష్మణుఁ డెంతపుణ్యుఁడో. ౮

ఉ. అచ్చఁపుఁ జందమామవలె ♦ నందముగాఁ దగి పద్మనేత్రముల్
ముచ్చటగాఁ జెలంగు ముఖ♦మున్ రుచిమించెడుదానిఁ గాంచు, నా
సచ్చరితుండు లక్ష్మణుఁడె ♦ చాలఁ గృతార్థుఁడుగాఁ జెలంగుఁ; బెక్
ముచ్చట లేల? జానకియుఁ ♦ బూజ్యమహత్తరభాగ్యయుక్తయౌ. ౧౦ 3288
వారిధిమధ్యభాగమున ♦ వర్ధిలి భూస్థలికెల్ల నాథుఁడౌ
శ్రీరఘురాము వెంటఁ జనెఁ ♦ జిత్రగతిన్ గనుకన్ గృతార్థయై
పేరును బొందె సీతయుఁ; గు♦బేరుఁడు నందననుందుఁబోలె నా
శ్రీరఘునాథుఁ డీగిరిని ♦ జేసినవాఁడు నివాస మాదృతిన్. ౧౧ 3289

[2]ఉ. కావుననే హిమాద్ర్యుపముఁ ♦ గాంచిన యీగిరి భాగ్యవంతమై

---

1 నరసంఘైస్సమంతతః-అని మూలము. 2 సుభగ శ్చిత్రకూటోయమ్-అనుమూలమునకు వ్యాఖ్యలోనున్న విశేషార్థసార మిట సంక్షిప్తమని తెలియఁదగు.

పావనమయ్యె; దివ్యరుచి ♦ భాసిలి శత్రుభృదగ్రగణ్యుఁడై
తా విలసిల్లు రాముఁడు ము♦దంబున నిందు వసించుచుండెడిం
గావునఁ గ్రూరసత్త్వములు ♦ గల్గి సుదుర్గమమౌ వనంబహో. ౧౩ 3290

ఉ. ఆరయఁగాఁ గృతార్థమని ♦ యాపురుషర్షభుఁ డామహాభుజుం
డారవితేజుఁ డివ్విధిని ♦ నయ్యనుజాతునితోడఁ బల్కి యా
శ్రీరఘురాముఁ జూడఁగల ♦ చిత్తముతోఁ దగి పాదచారియై
ఘోరవనంబుఁ జొచ్చెఁ దన ♦ కోర్కి ఫలించెడునన్న యాశతోన్. ౧౪ 3291

మ. గిరిసానుస్థలులందుఁ బెంపలరు శా♦ఖివ్రాతముల్ సొంపుగాఁ
గ రహిం బూచినయగ్రముల్ తగ వెలుం♦గన్ వానిమధ్యస్థలిన్
భరతుండేగెను మాటనేర్పు తనకున్ ♦ వర్ధిల్లు గానన్ సహో
దరుతోఁ బల్కుఁగ నెన్నుకొంచు మది ను♦త్సాహంబు సంధిల్లఁగన్. ౧౫

మ. అతఁ డారీతినిఁ బోయి యాగిరిని బు♦ష్పాళిం దగం గ్రాలుచు
న్నతరుశ్రేష్ఠముఁ జేరి యన్నదగు ప♦ర్ణస్థానమందున్న యా
హుతభుగ్ధూమము పైకి లేవఁగని యా♦త్మోత్సాహ మొప్పంగ సం
గతతేజంబునఁ బొల్చి రామువసతిం ♦ గా నెంచె నాచిహ్నముల్. ౧౬ 3293

మ. తనబంధూత్కర మల్లె దానును బ్రమో♦దస్ఫారవారాశిఁ దే
లెను రాముం డట నున్నవాఁడనుచు నీ♦లీలన్ సముద్రంబునం
దున నెట్లో పడి గట్టుఁజేరిన కృతా♦ర్థుంబోలి యొప్పారె; నం
త నతం డగ్గిరిఁ బుణ్యపూరుషజనో♦ద్దామాశ్రమంబుం దమిన్. ౧౭ 3294

క. కని రాముని వెదకంగాఁ, దనవెంటన్ వచ్చినట్టి ♦ తత్సైన్యము రాఁ
జనకని నిలుపుచు గుహునిం, దనసంగతి నుండఁ బనిచి ♦ తా నేగె వడిన్.

తొంబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౯౯-వ సర్గము.

— భరతుఁడు గుహాదులతోఁ బోయి శ్రీరాముని జేరుట. —

క. తనసేన యచట విడిచిన, దనుకం దానందునుండి ♦ తనయన్నఁ గనుం
గొను నభిలాషము పొంగఁగ, ననుజున కాశ్రమపుఁజిహ్న ♦ మదిగోయనుచున్.

క. కనఁబఱచుచు శ్రీరామునిఁ, గనఁబోయెను గురువునందు ♦ గాఢప్రభక్తిం
దనరిన యాభరతుండట, మునివర్యు వసిష్ఠుఁ గాంచి ♦ మ్రొక్కి మహాత్మా!.

క. జననులఁ గొని రాఁదగు మీ, రని వేఁడి జవంబు మెఱయ ♦ ననుజాదులతోఁ
జనియెను ముందుగ శత్రు, ఘ్నునిఁ గలిసె సుమంత్రుఁ డపుడు ♦ కోరికమీఱన్

క. రామునిఁ గనుఁగొను కోరిక, సౌమిత్రికి భరతునట్లె ♦ స్వాంతమ్మున ను

ద్దామముగనుండె నంతట, శ్రీమంతుఁడు భరతుఁ డెలమిఁ ♦ జెచ్చెఱఁ జనుచున్.

చ. మునిగృహమట్లు కట్టఁబడి ♦ మోఁద మొసంగఁగఁ జాలి యగ్నిహో
త్రునిఁ బ్రణయింపఁ గట్టినటు ♦ తోఁచుఁ గుటీరము, దానిముందు వ
చ్చిన మునిపంక్తితో సుఖము ♦ చెంది వసింపఁగఁ గట్టినట్టి ప
ర్ణనికరశోభితాలయము ♦ రాజకుమారుఁడు గాంచె నంతటన్. ౭ 3300

సీ. ఆపర్ణశాలకు ♦ దాపున రాతిరి వెలుతురు గలిగింప ♦ వలయుఁ గాన
నందుకై మంటవే ♦ యంగ ఛేదించి తెచ్చిన దారువులఁ బూజ ♦ సేయఁ బూని
సేకరించిన వన్య ♦ చిత్రపుష్పంబుల భరతుఁడు గనె; రఘు ♦ వరుఁడు రాము
ననుజుండు స్నానకృ ♦ త్యముఁ దీర్పఁగా జలాశయముల కరిగి స్వ ♦ స్థానమునకు
తే. వచ్చుతఱిఁ ద్రోవ తెలియంగ ♦ వారి రాక
పోకలెల్లను దెలియంగ ♦ భూజములకు
దర్భవల్కలములఁ బూన్కి ♦ తనరఁ గట్టి
నట్టి గుఱుతుల నందందు ♦ నరసె నతఁడు. ౮ 3301

క. వనమునఁ జలిబాధఁ దొలంగను జేయఁగఁ గోరి వన్య ♦ కాసరముల పేఁ
డను మృగముల పేఁడను నెండిన దానిం గూర్చి రాశి ♦ నిం జేసి యటన్. ౯

తే. దాఁచి యుంచిన స్థలము న ♦ తండు చూచె;
నట మహాబాహుఁ డతులకాం ♦ త్యన్వితుండు
నైన భరతుఁడు వాని నం ♦ దందుఁ గాంచి
యనుజునిన్ మంత్రులంగని ♦ యలరి పలికె. ౧౦ 3303

క. మనకు భరద్వాజుఁడు చెప్పినచోటికి వచ్చితి మిట ♦ విపినంబున నిం
కను గంగ యెంతో దూరం, బున నుండ దటంచు నాకు ♦ బుద్ధిం దోఁచెన్.

సీ. వల్కలశకలముల్ ♦ వరుసగా నెత్తుగాఁ బాదపములఁ గట్టఁ ♦ బడిన వవిగో
[1]సంధ్యాదులందు ల ♦ క్ష్మణుఁడు ఫలంబుల జలములఁ గొనుచు రా ♦ వలసినపుడు
దారి యిదే యని ♦ తనకుఁ జక్కఁగఁ దెలియంగ నేర్పఱచిన ♦ యట్టి గుఱుతు
లై యుండు; నీదారి ♦ నాశ్రయించియె పోవుదము; మఱి వేగవం ♦ తమ్ములైన
తే. కరులు తమ పెనుదంతాళి ♦ గదిసి యొకటి
నొకటిఁ గని బృంహితంబుల ♦ నొప్పి పొడుచు
కొనుచుఁ దిరిగినచోటుగాఁ ♦ గనఁబడియెడిఁ
[2]గానఁ జక్కఁగ లేదు మా ♦ ర్గమిది చూడ. ౧౧ 3305

---

1 అభిజ్ఞానకృతః పంథాః వికాలే గంతు మిచ్ఛతా-అనిమూలము. 'వికాలే అకాలే సాయంకాలాదౌ గంతుమిచ్ఛతా ఫలమూలజలాదిసంగ్రహణార్థం గంతుమిచ్ఛతా' అనివ్యాఖ్య ఈయభిప్రాయమే యిట స్పష్టముగాఁ జెప్పఁబడినదిగాని కల్పితముగాదని తెలియవలయు. 2 కానన్=ఇది ద్రుతాంతము. ఇపుడిపు డిది కళగా వాడఁబడుచున్నది. కాన్‌అ-కాన. కాఁబట్టియే యని కొంద ఱిభావము. ఇది ప్రాచీనమతవిరుద్ధము.

[1]క. వనమున రేపును మాపును, మునులెల్లను హోమకార్య♦ములు చేయంగా
ననిశముఁ గాపాడెడు న,గ్నినుండి ధూమంబు మిగుల ♦ నెగడుటఁ గననౌ.

క. గుణసంస్కారము లొనరుచు, వరమునివలె నొప్పు పురుష♦వర్యునిఁ బూజ్యం
బరమపదంబున శ్రీరఘు,వరునిం గనఁగల నటంచుఁ ♦ బలుకుచు నవలన్.

చ. భరతుఁడు చిత్రకూటగిరి♦పార్శ్వమునం దగఁ గొంతపోయి యం
బరనదిఁ జేరి చెంతఁదగు ♦ వారలతో నిటుపల్కెఁ; గంటిరే
పురుషలలాముఁడైన రఘు♦భూపవరుండు మనుష్యశూన్యమై
కరము భయంకరంబయిన ♦ కాననసీమను రిత్తనేలపై. ౧౬॥ 3308

ఆ. కూరుచున్నవాఁడు ♦ కోర్కె. [2]వీరాసన,మున నిఁ కేటి బ్రదుకు ♦ జనన మిద్ది
యిస్సిరో యిఁకేల ♦ యేనేమిచేయుదు, రాముఁ డఖిలలోక♦రాజరాజు. ౧౭

సీ. మిక్కిలి కాంతిచే ♦ మెఱయు మహాత్ముండు నాకొఱకుం బూని ♦ కైకచేసి
నట్టి కార్యంబును ♦ బట్టి రాజ్యముఁ బాసి వ్యసనంబు నొంది స♦ర్వాభిలాష
ముల విడనాడె కా♦నలనున్నవాఁ; డిట్లు జనులచే నపవాద♦మును గనియెడు
నేను రాముఁ బ్రసన్ను♦నిం జేయుటకుఁ బూని [3]యాతని దివ్యపా♦దాంబుజాత

తే. ముల పయింబడువాఁడ న♦య్యలసుతపద
ముల పయింబడువాఁడ వా♦రలు ప్రసన్ను
లగుట కొఱకుఁబడరే సుమి♦త్రాత్మజాతు
పాదముల పైననుం బడు♦వాఁడఁ జుండి. ౧౮ 3310

క. అని పలుకుచు దశరథనం,దనుఁ డిటు విలపించుచుం డ వ♦నంబున మిగులన్
ఘనమై పావనమై యుం,డును గూర్చుండు పర్ణశాలఁ ♦ బోలం గనియెన్. ౧౯

సీ. నాలాశ్వకర్ణముల్ ♦ తాలాదివృక్షముల్ వెలయఁగా వాని యాఁ♦కులను దెచ్చి
చక్కఁ గూర్పంబడి♦శాల యయ్యది వాసయోగ్యంబు గాఁ దనరి♦యుండె, పఱియు
నది విశాలంబయి ♦ యాగవేదికరీతి మృదుకుశాస్తీర్ణమై ♦ పొదలుచుండె
శక్రాయుధములను ♦ సాటియై శత్రుపాలభారంబు గలిగి సు♦వర్ణపృష్ఠ

తే. ములయి మిగులంగ సారంబు ♦ గలిగి శత్రు
బాధకములగు కార్ముక♦పటలములను
వెలయుచుండెను. సుఖములు ♦ చెలఁగ నరుణ
కరములం బోలు నతిఘోర♦శరములెల్ల. ౨౦ 3312

---

1 యమేవా ధాతు మిచ్ఛంతి తాపసా స్సతతం వనే, తస్యాసౌ దృశ్యతే ధూమ స్సంకులః కృష్ణవర్త్మనః-అనిమూలము దీనికి వ్యాఖ్యలో వ్రాసిన యర్థము శాఖాచంక్రమణరూపమైనది. ఊహానురూపమైనది గాన నది తెనిఁగింపఁబడలేదను విజ్ఞప్తిని బాఠకు లంగీకరింపుదురు గాక. 2 వీరాసనమునఁగా "దక్షిణజానూపరిస్థితవామపాదతయా(ఽ)వస్థానే" అనివ్యాఖ్య. 3 పాదేష్వద్య ప్రసాదయన్, రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్యచ-అనిమూలము. ఇటఁ దనకంటెఁ జిన్నవాఁడగు లక్ష్మణునిపాదములకు నమస్కరించుట రామభక్తిపరతంత్రత్వమును దెలుపుచున్నది.

క. వరతూణముల నెసంగఁగ, సరీసృపంబులను గూడి ♦ సరిలేక సునో
హరమైన భోగవతి నాఁగ రఘూత్తము పర్ణశాల ♦ గ్రాలెన్ మఱియున్.

సీ. ఒఱలు బంగరుతోడ ♦ నొప్పుఖడ్గంబులు విలసిల్లుచుండెను ♦ లలితకనక
బిందుచిత్రితములౌ ♦ పృథుఖేటకంబులు పసమీఱుచుండెను ♦ భర్మభూషి
తములయి చాలఁ జి♦త్రంబులై జ్యాఘాతముల నందకుండఁగఁ ♦ జెలఁగునుడుప
తోలికవచములు ♦ గ్రాలె నంగుళికవచములును వెలసె; మృ♦గముల కెల్ల

తే. సింహముండెడు గుహవలెఁ ♦ జేరరాక, శత్రువితతి కభేద్యమై ♦ సముధికముగ
దీప్తపావకమయిన వే♦దికయు నొప్పఁ, బర్ణశాలమనోహర♦భంగిఁ దనరె. ౨౩

క. క్రమముగ వేదిక యీశాన్యమునన్ దగ్గయి విశాల♦మై, పావనమై
యమరెన్ భరతుండా యాశ్రమమును గనుఁగొనిమొనంత♦సంబిగురోత్తన్.

క. ఉటజాస్థితుఁడగు రాముని, జటాగ[1]ణంబును ధరించి ♦ సరిగాఁ బోల్పం
దటుకున శక్యము గామిన్, [2]ఘటికామాత్రంబు చూచెఁ♦గైకసుతుఁడటన్.

సీ. ధర్మముఁ బాటించి ♦ తగినట్లు కృష్ణాజనము నుత్తరీయ ను♦ట్లమరఁ దాల్చి
నారచీరలు గట్టి ♦ కోరికమై నొక్క యాసనముంగొని ♦ యమరు వానిఁ
బావకసంకాశ ♦ భవ్యతేజస్కు, సింహస్కంధుఁ, బృథుబాహు, ♦ నచ్ఛపద్మ
సంకాశనయనుని ♦ సాగరాంతావనీపాలకు శ్రీరామ♦భద్రువరదు

తే. జానకీలక్ష్మణోపేతు ♦ శాశ్వతుఁడగు, బ్రహ్మవలె ధ్యాననిష్ఠతోఁ ♦ బరఁగువాని
దర్భలను గూడియున్నట్టి ♦ ధరణిఁ గూరుచున్నవాని మహాత్ముని♦నన్నఁగాంచె.

క. సిరిసిన్ ధర్మమునం దగు, భరతుం డట్లున్న రామ♦భద్రుం గని ని
ర్భరశోకపరిప్లుతుఁడై, పరుగెత్తెన్ రామచంద్రు ♦ పరిసరమునకున్. ౨౯ 3318

క. కనినంత నతని యార్తిని, మనమున భరియింపరామి ♦ మ్రాన్పడి యవలన్
ఘననాద మడర నేడ్చుచు, కని ధైర్యము గద్గదోక్తిఁ♦గా నిట్లనియెన్. ౩౦

తే. ఎవఁ డమాత్యులు మొదలగు♦నెల్ల సభ్యు
లలరికొలువంగఁ దగునొ, నా♦యన్న యిచట
వన్యమృగసేవితుండైన♦వాఁడు నేఁడు
[3]కటకటా! మామకంబగు ♦ కారణమున. ౩౧ 3320

తే. బహుళమూల్యపరిష్కృత ♦ వస్త్రములను
గట్టఁ దగియుండునో మును♦పట్టి యితఁడు

1 "ణ" యను అక్షరము గాయత్రి యేడవయక్షరము. 2 నిరీక్ష్య సముహూర్తంతు-అని మూలము. 3 కటకటా! మామకంబగు కారణమున - అనునది ప్రతిపద్యమునందుఁ జేర్పఁబడినది. మన్నిమిత్తమిదందుఃఖం-అనువక్ష్యమాణమూలానుసారమే. పలుమాఱు చెప్పుట భరతుని మనస్థితిని వెల్లడించుట కనియే కాని వేఱుగాదు.

ధర్మమున కజినంబును ♦ దాల్చినాఁడు
కటకటా! మామకంబగు ♦ కారణమున. ౩౨ 3321

తే. వివిధచిత్రసుమంబుల ♦ నెవఁడు తలను
దాల్చునో యట్టి రఘువీర♦తల్లజుఁడిట
జటలగుంపును దాల్చె నే♦చందముననొ
కటకటా! మామకంబగు ♦ కారణమున ౩౩ 3322

తే. వివిధయజ్ఞములన్ యథా♦విధి నొనర్చి
ధర్మమును గూర్పఁదగు నితం ♦ డర్మిలిఁ దను
కష్టములఁ గూర్చ ధర్మంబు ♦ నిష్టపడియెఁ
గటకటా! మామకంబగు ♦ కారణమున. ౩౪ 3323

తే. పరమచందనచర్చలఁ ♦ బరఁగు నెవని
తనువు మును, పూజ్యమైన త♦త్తనువు నేఁడు
దుమ్ముచే నెట్టులున్నదో ♦ దోఁగి పనిని
గటకటా! మామకంబగు ♦ కారణమున. ౩౫ 3324

ఆ. శర్మమునకె రామ♦చంద్రుండు తగినవాఁ
డతఁడు మన్నిమిత్త♦మై యిటు పెను
కష్టములను బొందెఁ ♦ గడుఁ గ్రూరుఁడను, లోక
నిందలను సతంబు ♦ పొందినాఁడ. ౩౬ 3325

తే కటకటా! జీవితం బిది ♦ కాల్పనే యిఁ
కంచు విలపించుచున్ దీనుఁ♦డై ముఖాంబు
జంబు చెమ్మటఁ దోఁగంగఁ ♦ జని ర ఘువరు
పదములం బడ కిలఁ బడెఁ ♦ బటుతరార్తి. ౩౭ 3326

క. కనుయుగ మశ్రుజలంబులఁ, గనఁబడమిన్ భూమిని బడి ♦ గాఢతరార్తిన్
గనుచు మహాబలుఁడాతఁడు, తననోటం [1]బూజ్యయనుచుఁ♦దవ్వరతోఁబలికెన్.

ఆ. ఆమాటెకాని వేఱొక, యేమాటం బలుకఁజాల♦కే యుండి మహో
ద్దామయశస్కుండగు నతఁ, డామాన్యుని రాముఁ గాంచి♦యార్యా' యనుచున్.

క. ఘనరవమున నఱచి కనుం,గొనలన్ బాష్పములు గ్రమ్మఁ♦గొంతు పలుకమిన్
గనుచుండెఁ బలుకనేరక, ఘనయశమున నలరుచున్న ♦ కాకుత్స్థుఁ దమిన్.

క. ఆరీతిన్ శత్రుఘ్నుఁడు, శ్రీరాము పదాబ్జములకుఁ ♦ జేసెఁ దమి నమ
స్కారము విలపించుచు నా,శ్రీరాముఁడు సోదరులను ♦ జెచ్చెఱ నంతన్. ౩౯

ఆ. కౌఁగిలించికొనుచుఁ ♦ గన్నీళ్లు విడిచె న,య్యవసరమున రాముఁ ♦ డతనితమ్ముఁ

1 ఉక్త్వార్యేతి-అనిమూలము.

డైన లక్ష్మణుండు ♦ నర్క శశుల్ గురు, కవులఁ గూడి దివిని ♦ గ్రాలునట్లు.

క. వెలసిరి గుహుని సుమంత్రుని, గలిసి సుఖాస్పదులు నగుచుఁ♦ గ్రాలిన రాట్పు
త్రులు కరియూధప సంకా,శులుగాఁ దగియుండ వారి ♦ శుభయోగంబున్.

క. వనమునఁ గని యాకానన,మున నుండు మునీశులంత ♦ [1] మోదంబును వీ
డిన మానసములఁ దూలుచుఁ, గనుదమ్ములనుండి జలముఁ ♦ గార్చిరి వగలన్.

తొంబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౦ - వ సర్గము.

రాముఁడు భరతునిఁ గుశలప్రశ్నము చేయుచు రాజనీతి బోధించుట.

తే. జటలు దాలిచి నారవ♦స్త్రములఁ గట్టి
కరయుగము మోడ్చి దీనత ♦ ధరణిని బడి
[2] ప్రళయకాలార్కుగతిఁ జూడ ♦ రాకయున్న
భరతునిం గాంచె రఘువంశ♦వల్లభుండు. ౧ 3334

క. ఆననవర్ణము మాఱుట,చే నతఁడు కృశించియుంటఁ ♦ జెచ్చెఱ భరతుం
డౌ నని తెలియక యెట్లో, తానాతని గుఱుతుపట్టి ♦ తమి యలరంగన్. ౨

చ. కరములు సాచి యంతఁ దన♦గాదిలి తమ్ముని గ్రుచ్చి యెత్తి త
చ్ఛిరమును మూరుకొంచుఁ దన♦చెంతకుఁ జేరిచి కౌఁగిలించి యా
దరమున నంకపీఠిపయిఁ ♦ దత్పరతం గదియించి యింపుగా
భరతుని జూచి యిట్లనుచుఁ ♦ బల్కెను నాయన సాధుమానసా!. 3 3336

చ. వనమునకీవు వచ్చితివె ♦ వర్ణ్యగుణుం డగు తండ్రి యేస్థలం
బున కిపుడేగినాఁడు? రఘు♦భూమణుఁ డాతఁడు జీవితుండుగాఁ
దనరిన యంతకాలమును ♦ దండ్రిని బాసి వనంబుఁ జేరఁగాఁ
జనదుగదా; భయంకర వి♦శాలవనంబున నిందు నేఁటికిన్. ౪ 3337

క. చిరకాలమునకుఁ గేకయ, పురినుండియె వచ్చినట్టి ♦ బుధనుతగుణుఁ నిన్
భరతుని జూడం గంటిని, బరమామోదమును గంటి ♦ వత్సా! యనుజా!. ౫

క. తనువిట్లు వివర్ణంబై, కనఁబడుటన్ గుఱుతుపట్టఁ ♦ గాకున్నది యీ
వనికిన్ వచ్చితివే నా,యన బ్రతికియె యుండునేని ♦ యతఁ డోర్చునొకో?. ౬

సీ. తండ్రి ప్రాణంబులఁ ♦ దాల్చి యున్నాఁడు గదా,యివ్విధమున నీ♦వీయడవున
వనికేల వచ్చితి? ♦ జననాయకుఁడు దుఃఖమునను లోకాంతరం♦బునకుఁ బోవ
కున్నాఁడుగద! సౌమ్య! ♦ యూహింప బాలుఁడ వీవు గావున గొప్ప♦చేవలేమి
శాశ్వతంబయిన రా♦జ్యంబును బోఁగొట్టుకొన లేదుగద; ప్రియ♦జనకునకును

---

1 ప్రవిహాయ హర్షమ్-అనిమూలము 2 యుగాంతే భాస్కరం యథా-అనిమూలము.

ఆ. సత్యశౌర్యునకును ♦ జక్కని శుశ్రూష,నలుపువాఁడవుగద ♦ సత్యశపథుఁ
డద్ధరామహేంద్రుఁ ♦ డాడితప్పనివాఁడు, ధర్మనిశ్చయమునఁ ♦ దనరువాఁడు.

క. విను రాజసూయయాగం,బును హయమేధంబుఁ జేసి ♦ పూజ్యుండగు నా
జనపతి కుశలియె! వత్సా!, యనఘుండవయి [1] బ్రహ్మవేత్త♦వై పండితుఁడై. ౮౪

క. నిరతము ధర్మాత్ముండై, యరుదగు తేజము చెలంగ ♦ నర్కాన్వయ స
ద్గురువై తగిన వసిష్ఠుని, భరతా! మునుపట్లు పూజ♦భక్తి నలుపుదే. ౯ 3342

క. వనటంగను కౌసల్యయుఁ, దనయుని సజ్జనునిఁ గాంచి ♦ ధన్యమతి విభూ
తిని దగు సుమిత్రయుం గుశ,లినులే కైకయును శర్మ ♦ లీలం గనుచున్. ౯౪

తే. పూజ్యురాలయి యున్నదే ♦ బుధనుతుండు
వినయయుక్తుండు సత్కుల♦జనితుఁ డీర్ష్య
విడిచియె బహుశ్రుతుండయి ♦ వెలసి గురుని
భావముల లెస్సఁ దెలుపుచుఁ ♦ బరఁగు నతని. ౧౦౪ 3344

తే. నీపురోహితుసత్కృతి ♦ నిరత మెలమిఁ
గనఁగఁ జేయుదువే కదా; ♦ కపటి గాక
శాస్త్రముల నేర్చి సుమతియై ♦ జ్వలనకార్య
తతి నియుక్తుండయిన పురో♦హితుఁడు భరత!. ౧౧౪ 3345

క. కావించిన హోమంబులఁ, గావింపవలసిన హోమ♦కార్యంబుల న
య్యైవేళలఁ దెలుపుం గద, నీవును భక్తిగనె దేవ♦నికరము గుఱులన్. ౧౨

క. జననుల బితరుల వృద్ధుల, జనకునితో సాటియైన ♦ జ్ఞాతుల విద్వ
ఘ్నులన్ విప్రులఁ బూజలఁ, దనుపుచు నున్నావుగద స♦తంబును వత్సా!. ౧౩

సీ. ప్రకృతిబాణంబులు ♦ భవ్యమంత్రాళితోఁ
జనునస్త్రములు గల్గి ♦ ఘనతరార్థ
శాస్త్రంబునందు వి♦శారదుండయి పొల్చు
న్నాసుధన్వుని, మన ♦ కఖిల శస్త్ర
విద్య నేర్పినవాని ♦ వినుతించి బహుమాన
మొప్పఁ జేయుదువె శూ♦రోత్తములయి
తృప్తసమానులును వి♦ద్వాంసులు విజితేంద్రి
యులుఁ గులీనులు నయి ♦ యొక్కమాఱు

తే. మోము చూచిననే భావ♦మును గనంగఁ
జాలినంతటి శక్తిచేఁ ♦ బ్రాలియుండు
నట్టివారిని మంత్రుల ♦ నరసి చేసి
కొంటివా! యేమి పలుకుమా ♦ యొక్కమాఱు. ౧౫ 3348

---

1 బ్రాహ్మణో విద్వాన్-అనిమూలము.

సీ. నీతిశాస్త్రంబున ♦ నిపుణులై యాలోచనల దాపఁగలశక్తి ♦ నలరినట్టి
మంత్రులతోడను ♦ మంతనంబుండి చేయంబడు యోజన ♦ యవనిపులకు
విజయమూలము సుమా♦విను భరతా! సుషుప్తికి లోఁబడవుగద♦తెలిసియుక్త
కాలంబునన్ నీవు ♦ మేలుకొందువుకదా యర్ధరాత్రంబున♦యందు నర్థ
తే. మును సమార్జించు నుపమను ♦ మనమునందు
నూహ చేయుదువా యేమి? ♦ యొక్కఁడవయి
యెట్టి మంత్రోద్యమంబు నీ ♦ వెట్టిభంగిఁ
జేయవుగదా రఘూత్తమా! ♦ యేయెడలను. ౧౭ 3349

క. పలువురతో నాలోచన, సలుపవుగద భరత నీవు ♦ సలిపిన మంత్రా
వళి రాజ్యమునందు నెల్లెడఁ, గలయఁ దిరిగి తెలియరాదు♦గా యెల్లరకున్. ౧౮

ఆ. అల్పసాధనమున ♦ ననువుగ సిద్ధించి
చాలఫలము నీయఁ ♦ జాలు కార్య
మును నొనర్పఁ బూని ♦ మునుముందు దానిఁ జే
యుదువు గాదె తడవు ♦ నొనరుపకయె ౧౯ 3351

ఆ. ఎల్లకార్యములను ♦ హితబుద్ధి యోజింపఁ, బక్వమైనఁ గాని ♦ ఫలము నీయ
నున్న యప్పుగాని ♦ యుర్వీశులకుఁ దెలి,యంగఁ బడదుగాదె? ♦ యద్ది యార్య!.
తే. చేయవలసినదనుచు ని♦శ్చితము చేసి
నట్టి కార్యములెల్లఁ జే♦యంగఁ బడక
మునుపె యేమాత్ర మితరుల♦కును దెలియవు
గాదె యేవేళలందైనఁ♦గాని యనుజ!. ౨౦ 3353

సీ. వత్స! నీవే గాని ♦ త్వన్మంత్రులే గాని యాలోచన యొనర్చి♦నట్టి మంత్ర
ము నితరు లూహల ♦ ననుకూలయుక్తుల నింగితాదుల నిందు ♦ నెట్లు గాని
తెలియరు గద; నీవు ♦ తెలివిమాలినవారి వేవురనైనను ♦ విడిచి యొకనిఁ
బండితునే మది ♦ వాంఛింతువే గదా; యర్థసంకటముల♦యందుఁ బండి
తే. తోత్తముండెంతయు విభూతి ♦ నొదవునట్టు
లురుముదంబున నుపదేశ ♦ మొసఁగుచుండు
వేవురను మూర్ఖులన్ బది♦వేలనైన
నాశ్రయించిన ఫలము లే ♦ దవనిపతికి. ౨౩ 3354

చ. మతివిభవంబు గల్గి బహు♦మానముఁ గాంచెడు బుద్ధియొప్ప శూ
రత చెలువార దక్షతయు ♦ రాజిలఁగా బహునీతిశాస్త్రసం
గతి యలరంగ నొప్పు గుణ♦గణ్యుఁడు మంత్రి యొకండెయైన భూ
పతి [1]మతి యట్టివాని సిరి ♦ భాసిలఁ జేయును నేర్పు పెంపునన్. ౨౪ 3355

---

1 రాజానం రాజమాత్రంవా ప్రాపయేన్మహతీం శ్రియమ్-అనిమూలము.

సీ. ఉత్తమభృత్యుల ♦ నొగిఁ బచనాదులౌ మంచికార్యములందు ♦ మధ్యములగు
భృత్యుల శయ్యాది ♦ విధులందు జాత్యాదికముచేత నధములై ♦ కానఁబడెడు
భృత్యులను జఘన్య♦కృత్యంబులగు చరణక్షాళనాదుల ♦ నైజవృత్తి
కనుకూలమగు విధం♦బున నియోగింతువే కద; నీవు భరత! చ♦క్కఁగఁ బరీక్షి

తే. తులయి పరిశుద్ధులును నుత్త♦ములయి వరుసఁ
దండ్రితాతలనుండి స♦తంబుఁ గొలువు
చేయుచును వచ్చుచున్నట్టి ♦ శ్రేష్ఠమతుల
మంత్రులనె యాజ్ఞ చేయుదే ♦ మంచిపనుల. ౨౬ 3356

క. నరులకుఁ గఠినపుశిక్షలు, త్వరపడి యొనరించి నీవు ♦ ధరఁ బీడింపన్
సరిగాదని నీమంత్రులు, కరము నివారించు చుంద్రు ♦ గద తగు రీతిన్. ౨౭

[1]చ. ధనమును దుష్టదానములఁ ♦ దా నొగిఁ గైకొని యధ్వరంబుచే
యను దలపోయు నప్పతితు ♦ నాసి ఋత్విజులెల్ల దూఱురీ
తిని బలవంతమై తగువి♦ధిన్ గ్రహియించెడు కాముకున్ వరాం
గనలవలెన్ గఠోరముగఁ ♦ గన్పడు పన్నుల నర్థమొందు నీ
జను లవమానముం గలుగు ♦ చందముఁ జూపరుగా సహోదరా!. ౨౮ 3358

సీ. సామాద్యుపాయ వి♦శారదుండు, కుటిల నీతిశాస్త్రంబున ♦ నేర్పు గలిగి
యంతరంగులు గాఁగ♦నలరు భృత్యుల భయిదోషముల్ కల్పించి♦తొలఁగఁదీయఁ
జాలి భూపాలహిం♦సకు నూత జంకక ప్రభుత నే యపహరిం♦పంగఁ గోరి
వర్తించుపురుషుని ♦ వధియింప కుండిన వాఁడె తెప్పక చంపు ♦ వసుమతీశు;

తే. శూరుఁడై హృష్టుఁడై మీఱి ♦ సుమతి యించ
నలరి ధృతిమంతుఁడై శుచి ♦ యయి, కులీనుఁ
డగుచు ననురక్తుఁ డయి దక్షుఁ ♦ డైనవాని
వాహినీపతిఁ జేసితే, ♦ భరత! నీవు. ౩౦ 3359

క. సేనానాయకు నిర్విధిఁగా నలరెడు వానివిడిచి ♦ కడుమోహమునన్
బూనవుగద వేఱొక్కని, సేనాపతిఁ జేయుకొఱకుఁ ♦ జిత్తములోనన్. ౩౦

క. బలవంతు లగుచు యుద్ధం, బుల నేర్పుంగలిగి యుద్ధ♦ములఁ బౌరుషముల్
వెలయించియున్నగణముఖ్యులసత్కృతిఁ జేయుదు వెస♦హోత్సాహులఁగాన్

క. బలములకు నన్నవేతన, ములఁ గాలము తప్పకుండ ♦ మునుకొని తగిన
ట్టులుగా నిత్తువుగాదే, సలుపవు గద జాగు నీవు ♦ సరసమునీపా!. ౩౨ 3362

తే. బత్తెముల జీవనము చేయు♦వారు గాన
దాని కాలస్యమైనచో ♦ ధరణివిభుని

---

1 కచ్చిత్త్వాం నావజానంతి యాజకాః పతితం యథా, ఉగ్రప్రతిగ్రహీతారం కామయానమివ స్త్రియః-అనిమూలము. దీనివ్యాఖ్యలోనిభావమే యిటఁ జేర్పఁబడినది.

పైని గోపించి వారలు ♦ హానిచేయఁ
దలఁతు, రది గొప్ప దగు నన♦ర్థ మని యం(డ్రు). ౩౩ 3363

తే. క్షితిపకులమున జనియించి ♦ వితతకీర్తిఁ
గాంచుచుఁ బ్రధానులయి ప్రేమ ♦ గలితు లగుచు
నిన్ను మన్నింతురే కదా! ♦ నీకయి యసు
వులను విడనాడుదురె వార♦లెలమి మిగుల. ౩౪ 3364

సీసమాలిక:—

*త్వద్దేశమునఁ బుట్టి ♦ పరులభావంబులఁ దెలియఁగఁ జాలి నే♦ర్పులఁ జెలంగి
ప్రతిపదంబును గ్రొత్త ♦ పద్ధతుల నెఱుంగు బుద్ధివిభూతిచేఁ ♦ బొల్పుమీఱి
చెప్పినదంతయుఁ ♦ జేయఁగఁ జాలుచుఁ బండితుండయి యతి♦ప్రతిభఁ గాంచి
తగిన పూరుషుని దూ♦తనుగా గ్రహించితే యరిపక్షమునఁ గల ♦ యట్టివారి
సచివపురోహిత ♦ సైన్యపయువరాజులను, ద్వారరక్షకు♦లకుఁ బతియగు
దౌవారికునిని, నం♦తఃపురకార్యముల్ స్థిరబుద్ధి నిర్వహిం♦చెడు కృపాళు
ఘనుని నంతర్వంశి♦కునిని, గారాగారపతిని, ధనాధ్యక్షుఁ ♦ బ్రభువు నాజ్ఞ
బహిరంగముగఁ జెప్పు♦వాఁడగు కార్యనియోజకుఁ, బనులకు♦నొగిఁ బ్రచార
మును జేయు ప్రాడ్వివా♦కుని, సైన్యనాయకు, నగరపాలకుని సై♦న్యములు గాక
పనిచేసి పిదప సం♦బళమును గ్రహియించునట్టి భృత్యులకెల్ల ♦ నర్థమిచ్చు
కర్మాంతికుని, సభ్యు,♦ ధర్మాధిపతి, దండపాలకు, దుర్గాధి♦పతిని మఱియు
రాష్ట్రాంతపాలకు ♦ రహిఁ బదునెనమంత్ర వీరిని నీవు నీ♦చారులను త
గంగ ముప్వుర నొక్కొ♦క్కనికి నొండొరులకుఁ దెలియరానట్టివా♦రలనెయునిచి
వారిరహస్యంపు ♦ వార్తల నెఱుఁగుచు నున్నావుగద, యట్లె ♦ సన్నుతమగు
నీపక్షమందును ♦ నీసమక్షముననే యున్నట్టి యాయమా♦త్యునిఁ, బురోహి
తుని యువరాజుఁ ద♦ప్ప నితరములయిన పదునైదు తీర్థంబు♦లఁ దగినట్లు
చారుల ముప్వుర ♦ వారిలొండొరుల భావంబులు తెలియని ♦ వారినునిచి
యవ్వారి వగు రహ♦స్యంబులఁ దెలియుచు నున్నాఁడవేకద, ♦ యోకుమార!
నీచేఁ బ్రతారితు♦లై చన్న శత్రువు లొకకొంతకాల మెం♦దొ వసియించి
మరలి వచ్చినయెడ ♦ నరులు దుర్బలులని యెన్నక వారల ♦ నెచ్చరికలఁ

తే. గనుచు నుందువెకద, వత్స! ♦ కడఁగి నాస్తి
కులగు భూసురులను నీవు ♦ గొలువవుకద

---

* కచ్చి జ్జానపదో విద్వాన్ దక్షిణః ప్రతిభానవాన్, యథోక్తవాదీ దూత స్తే కృతో భవతిపండితః. కచ్చి దష్టాదశా న్యేషు స్వపక్షే దశపంచచ, త్రిభిస్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని చారకైః. కచ్చి ద్వ్యపా స్తా నహితాన్ ప్రతియాతాం శ్చ సర్వదా, దుర్బలా ననవజ్ఞాయ వర్తసే రిపుసూదన-అనిమూలము. ఈశ్లోకత్రయమునకు వ్యాఖ్యలో నున్న భావమును స్పష్టముగ నీ సీసమాలిక వ్రాయఁబడినదని తెలియఁదగు.

వారు మూర్ఖులు మఱియును ♦ బండితులుగఁ
జెప్పుకొనుచుందు రేమియు ♦ సిగ్గులేక. ౩౭౪ 3365

క. కనుక ననర్థావహులయి, కనఁబడుచురుగాన వారి♦కడఁ జేరవుగా
యనుజా! దుర్మతులగు వా, రనయము దూషింత్రు మంచి♦వౌ పద్ధతులన్.

చ. మునులొనరింప సజ్జనస♦మూహము చక్కఁగ నాదరింప నొ
ప్పిన యల ధర్మశాస్త్రములు ♦ వృద్ధిని బొందుచు నుండ వానినిం
*గనకయె శుష్కతర్కమునఁ ♦ గ్రాలిన బుద్ధినిరర్థకోక్తులన్
వినఁదగినట్టివానిఁ గడు♦వింతగఁ బల్కుదు రానరాధముల్. ౩౭౬ 3367

సీ. మనపూర్వులై శౌర్య♦మున నొప్పు రాజులు నసియింపసార్థకా♦హ్వయమునగుచు
నరిజనాభేద్యమై ♦ యలరుఁగాదె పురంబు; తద్ద్వారములు దృఢ♦తం జెలంగుఁ
గరిహయరథములు ♦ క్రాలుచుండును స్వస్వకర్మనిరతులగు ♦ బ్రాహ్మణులును
క్షత్త్రియవైశ్యులు ♦ సతతజితేంద్రియు లగుచు నుత్సాహంబు ♦ తగఁ జెలంగి

తే. పూజ్యులయి యందు నుందురు ♦ పౌరులు వివిధ
ములగు ప్రాసాదములు పండి♦తులును వెలయు
వారు, సంపత్సుఖంబులు ♦ వఱలునట్టి
దగు నయోధ్య రక్షింతువె? ♦ తగినయట్లు. ౩౭౭ 3368

సీ. మనదేశమిది వాజి♦మఖముఖక్రతువులఁ జేసిన స్థలముల♦చేత నొప్పి
సుప్రతిష్ఠితజన ♦ శోభితంబయి, దేవతాలయ పానీయ♦శాలలు చెఱు
వులు పొదలఁగ హర్ష♦ములఁ దగు పురుషులుఁ జానలునొప్ప ను♦త్సవములాది
యైనవానిఁ జెలంగ ♦ ననువుపఱచినట్టి ధరణి యొప్పఁగఁ బశు♦తతి వెలయఁగ
హింసాదులును లేక ♦ యేటి జలంబులఁ బండెడు భూములు ♦ పరఁగ, నుపవ

తే. నములు తగఁ, గ్రూరజంతుసం♦తతివిహీన
మగుచు, సర్వభయంబుల ♦ నంటకుండ
గనులచే నొప్పి పాపులౌ ♦ జనులు లేక
యస్మదీయసురక్షిత ♦ మయి చెలంగు. ౩౭౮ 3369

క. జనపద మది సంపద్వృద్ధిని గాంచి సుఖంబు గలిగి ♦ దివ్యంబై యొ
ప్పిన యదియే; కృషిగోపాలనమున మను వైశ్యజనము♦లలి ధనయుక్తిన్.

క. అనుకూల వర్తనంబున, నినుఁ గొలుతురె, వారివృత్తి ♦ నిలువక జర్గన్
నినుఁ గొల్చువారికెల్లను, దనరుఁ జుమీ సుఖము భూమి♦తలమున ననుజా!.

క. వారల కభీష్టములఁ జే, కూర్చి కష్టములఁ బాపి ♦ కొదువ యనంగా
వారికిఁ దోఁపకయుండఁగ, నో రాఘవ కాతువుగద ♦ యుద్యమ మలరన్.

---

* బుద్ధిమాన్వీక్షికీం ప్రాప్య-అనిమాలము. 'శుష్కతర్కవిషయాం బుద్ధి మాస్థాయ.' అని వ్యాఖ్య.

క. తనదేశజనుల నెల్లన్, జనపతి తఱిఁ దప్పకుండఁ ♦ జనుగద సత్పా
లనమునఁ దన్పఁగ, నీవ, ట్లనువుగఁ జేయుదువుగాదె ♦ యనిశము భరతా !.

క. నీయంతఃపురకాంతల, న్యాయవిధిన్ సాంత్వనోక్తి ♦ ననుకూలముగా
నేయెడలను వర్తింతు గ,దా యన్యులతోడ మాట♦లాడక యుండన్. ౪౮½

క. అరయుచుఁ గాపాడుదువే, తగుణులమాటలను నమ్మఁ♦దలఁపవుగద స
త్యరతిం బొందు నటంచున్, బరికింపక గుహ్యములను ♦ బలుకవుగాదే. ౪౯

సీ. దంతావళముల యు♦త్పత్తికి స్థానమౌ వనము రక్షింతువే, ♦ వనగజముల
వశము చేసికొనుచుఁ ♦ బట్టి తెచ్చెడు నాఁడు గజములు నీయొద్దఁ ♦ గలవుగాదె
యాఁడు గజంబుల ♦ హస్త్యశ్వముల సంగ్రహించుటయందు సం♦తృప్తి నీకుఁ
గలుగదుగద, నీవు ♦ కడఁగి నిత్యమ్ము ప్రాతఃకాలమున లేచి ♦ తగినయట్లు

తే. భూషణావళి ధరియించి ♦ పొలిచి సభను
దర్శనం బిత్తువే జన♦తతికిఁ దమిని,
నీచసేవకులందఱు ♦ నిర్భయముగ
రారు గద, నీయెదుటికిని ♦ రాజపుత్ర !. ౫౧½ 3376

క. అనుజా! యీసేవకులకుఁ, గనుఁగొనఁగనె రాక తఱుచు♦గాఁ గన్పడ కే
పనియందునైన నరుదుగఁ, గనఁబడుచున్ మధ్యమమ్ము♦గా వర్తిలుదే. ౫౨

తే. కార్యసిద్ధికి మూల మి♦క్కారణినుంట;
సర్వదుర్గమ్ములును ధన♦సమితిచేత
ధాన్యజలముల దివ్యాయు♦ధముల యంత్ర
ములను సంపూర్ణములగుచుఁ ♦ జెలఁగు నవియె ౫౩ 3378

సీ. శిల్పులు విలుకాండ్రుఁ ♦ జెలఁగుచుందురె, దుర్గ
ములయందు, నాదాయ♦ము సమధికము
గా వచ్చుచున్నదే♦గద వ్యయ మత్యల్ప
ముగ నున్నదేకదా ♦ మొనసి కూర్చి
నట్టి విత్తమునెల్ల ♦ నరయుఁ పాత్రులౌ
వారికిగా వ్యయిం♦పవుగద, రఘు
వంశవిభూషణా ♦ వ్యయమెల్ల దేవతా
పిత్రతిథులకును ♦ ద్విజుల కెల్ల
సఖులకు మఱి యోధ♦జనులకు, ననుకూల
ముగ నగుచున్నది♦యెగద, శుద్ధ

తే. మతియుఁ ద్రికరణశుద్ధుండు ♦ మహితుఁడు నగు
జనుఁడు దైవికముగ దొంగ♦తనముచేత
నిందితుండయి నీమ్రోల ♦ నిలుపఁబడిన
శాస్త్రకుశలుల నడుగక ♦ సత్వరముగ. ౫౫½ 3379

క. పరిశీలింపక లోభ,స్ఫురణంబున సతని( జంప( ♦ బూనవుగద, యో
పురుషవ్యాఘ్ర! చోరు(డు, తరుణంబున ధనముతో( ♦ దా బద్ధుండై.

తే. పండితులచేత నిశ్చయిం ♦ ప(బడినట్టి,వాని ధనలోభమున విడు ♦ వవుగద, మఱి
ధనికనిస్స్వులకుఁ వివా ♦ దంబు గలుగ, జ్ఞానసంపన్నులయిన నీ ♦ సచివులెల్ల.

క. ధనలోభము నిసుమంతయు(, గనక పరీక్షించుచుంద్రు ♦ గద, యూరక నిం
దను గల్పించి యదోషులె,యని తెలిసియు వారియందు ♦ నారోపింపక. ౫౯

సీ న్యాయమియ్యదియిద ♦ న్యాయమంచునువిచారముచేయకయొస్వసు ♦ ఖమునుగో
రాజ్యము చేసెడు ♦ రాజకుమారుల( బశువుల నెల్ల న ♦ వ్వారికంటి [రి
జలము నాశముచేయ( ♦ జాలు; వృద్ధులబాలురను[1] బండితమహీపు ♦ లనుధనంబు
నిచ్చియు మైత్రిని ♦ నెసగించియును సాంత్వనోక్తుల నలరించి ♦ యును వగంగ

తే. నిట్టి మూ(డింటిచే వారి ♦ నెల్ల వశము, చేసికొన నెంతువేగద, ♦ చెల(గి వృద్ధ
దేవతాగురుతాపనా ♦ తిథుల కఖల, సిద్ధపంది చెలంగెదు ♦ క్షితిసురులకు. ౬౦

తే. చైత్యముల దేవతానివా ♦ సములయి తగు
భూరుహంబుల కెల్లను ♦ బొదలు భక్తి
వందనము లాచరింతువే ♦ వదలవు గద
ధర్మమును విత్తసంగ్రహ ♦ తత్పరతను. ౬౧ 3384

చ నిరతము ధర్మసంగ్రహము ♦ నేర్పున( జేయుచు నర్థసంగ్రహా
దరము( గ్యజింపలేదుగద, ♦ ధర్మము నర్థము శర్మకాసుత
త్పరతను మాన లేదుగద, ♦ పార్థివపుత్ర! జయస్వభావ! నీ
వరియ(గ( గాలవేత్తవయి ♦ యర్థిమనంబుల కింపుగూర్చుటక. ౬౨ 3385

క. ధనకామంబుల ధర్మం,బును దగ విభజించి కాల ♦ ములఁ దప్పక వా
నిని సేవింతువుకద శా,స్త్రనికరవేత్తలయి యొప్పు ♦ ద్విజసురివర్యుల్. ౬౩

క. పురజనులు జానపదులును, భరతా! నీసుఖముగోరు ♦ వారలె సతముక
ధరణీ మహాప్రాజ్ఞు(డవై, పర(గెదు నీవెన్న(డే న ♦ బద్ధము( గ్రుధయుక. ౬౪

సీ ఆలస్యముగ( బను ♦ లాచరించుట, ప్రమాదము మఱి నాస్తిక ♦ త్వము, మహాత్ము
లను జూడకుండుట ♦ యును, మత్తతయు, నింద్రియవశత్వము, ♦ నాప్తవరుల
విడనాడి తానె యొ ♦ క్క(డె కార్యరీతుల నరయుటయు, విపరీ ♦ తార్థదర్శ
నులతోడ యోజన ♦ సలుపుట, నిశ్చితార్థంబుల( జేయ నా ♦ రంభ మొనర(
జేయకుండుటయు, ని ♦ శ్చితమగు నర్థంబు బయలుపుచ్చుట, యశు ♦ భంబులైన

---

1 వైద్యముఖ్యాంశ్చ రాఘవ-అనిమూలము. ఇటవైద్యశబ్దము పండితపరమని గ్రాహ్యము. పండితమహీపులన(గా పండితరాజులని యర్థము. ఇట మహీపశబ్దము శ్రేష్ఠార్థపరమని గ్రహింప( దగు.

తే. కార్యములఁ జేయుచుండుట ♦ కడఁగి సకల
శత్రువులతోడ యుద్ధంబు ♦ సలుపుటయును
నీచతుర్దశవిధములౌ ♦ నృపుని దోష
ములను విడుతువె కద? నీవు ♦ లలితధిషణ!. ౬౭ 3338

*సీసమాలిక:—

దశవర్గమనుచుఁ బె♦ద్దలు చెప్పు వేఁట, జూదము దివాస్వాప, మి♦తరులనింద
చేయుటయు,మదంబు♦స్త్రీలు,నృత్తముగీతవాద్యముల్మఱియుని♦ష్ఫలముగాఁగ
వర్తించుటయుఁ, బంచ♦వర్గమ్మునాఁ జెప్పఁబడు జలగిరివిట♦పమయములును
బాడవులచేతఁ♦బరఁగెడు నదియును విలుకాండ్రమయముగా♦ వెలయునదియు
నివి యైదు దుర్గంబు♦లవు; గాన వీనిని, దగ సామదానభే♦దములు దండ
మను చతుర్వర్గంబు♦యనుజేశుఁడును మంత్రి రాజ్యంబు కోశ దు♦ర్గములు సేన
సఖులునా నొప్పెడు ♦ సప్తవర్గంబును, వాణిజ్యమును సేతు♦బంధనమ్ము
కరిబంధనము, కృషి ♦ గనుల సంగ్రహణంబు పన్ను చేకొనుటయు, ♦ వట్టినేల
లను నివాసార్థస్థ♦లములఁ నేర్పఱచుటయును, దుర్గములు నన ♦ నొప్పు నివ్వి
యష్టవర్గంబని ♦ యార్యోక్తమిద్ది యుత్సాహశక్తియుఁ బ్రభు♦శక్తి, మంత్ర
శక్తియునని సూరి ♦ సన్నుతంబగు త్రివర్గంబును, గృషి ధేను♦రక్షణమ్ము
శ్రుతి, దండనీతులు ♦ సూరిస్తుతంబగు నివి త్రివిద్యలు, వీని, ♦ నింద్రియముల
వశము చేసికొనును♦పాయంబు, మఱియును సంధి, విగ్రహములు♦శత్రువిజయ
యాత్రయు, మఱిదండ♦యాత్రయుసమయంబుగననూరకుండుట♦యునుబలోద్ధ
తులగు నిద్దఱు శత్రు♦వులు పోరుచుండంగ బలహీనుఁడందుఁదాఁ♦గలియఁబూని
ననుగ్రహింపుఁ డటంచు♦ననువుగఁ బల్కుచుఁగలియకుండుట,యరి♦వలన బాధ
గని బలవంతు నొ♦క్కని నాశ్రయించుట,యను సప్తవర్గంబు, ♦ నగ్ని జలము
వ్యాధి దుర్భిక్షంబు ♦ నంత్యంబు నఁబడు దైవదుఃఖంబుల ♦ ధరణిపతుల
దగు లోభగుణమున ♦ నధికారుల వలన దొంగలవలన శ♦త్రువులవలన
నధిపతిప్రియులగు ♦ నట్టి వారివలనఁ, గలిగెడు వ్యసనముల్ ♦ వెలయు మాను
షములంచు వీనిని, ♦ సరిగ జీతమురాక యున్నట్టి లుబ్ధుని ♦ నురుతరావ
మానంబు నొందిన ♦ మానవంతునిఁ, గోపమొందిన కోపిని ♦ నురుభయంబు
కలుగఁ జేయంబడి ♦ కలఁగెడు పిఱికిని వీరి నల్వురకును ♦ గోరినట్టి
వానినెల్ల నొసంగి ♦ వారక భేదింప వలయు నియ్యది నాథు♦వములవలనఁ

1 దశపంచచతుర్వర్గాన్-అను మొదలగు నాలుగుశ్లోకముల కనువదిపాదములుగల యీసీస మాలిక వ్రాయుట అందలిపదములకు వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థమునంతియుఁ జేర్చుటకని యని తెలియవలయు.

గీ. ర్తితంబయ్యెను ♦ గృత్యంబటంచు సిద్ధానిని, మఱియు వా♦ర్ధకము నొందు
వాఁడును, బాలుండు ♦ బహుకాలరోగియు, జ్ఞాతులచే బహి♦ష్కారముగను
వాఁడును, భీరువుఁ ♦ భయచిత్తులగు సేవకులు గలవాఁడును, ♦ దలఁప లుబ్ధుఁ
డును, లుబ్ధసేవకుం♦డును విరక్తప్రకృతియు విషయాభిలా♦షియును, నేక
మనసుతోడనె యోజ♦నను జేయకుండెడు నట్టివాఁడును మఱి ♦ యమరవిప్ర
నిందకుండును, విధి ♦ నిహతుండు దైవమునే నమ్ముకొనుచుఁ దా♦నేమియేఁ బ్ర
యత్నము చేయకు♦న్నట్టివాఁడును, క్షామబాధితుండును, దన♦బలము విలయ
మందుటచే వ్యథ ♦ నందినవాఁడును, నన్యదేశంబున♦యందు నున్న

వాఁడును, బలువురు♦పగవారు గలవాఁడు, గ్రహదుష్టచారంబు♦గలుగువాఁడు
సత్యధర్మంబుల ♦ సంత్యజించినవాఁడు, నను విరలిఋవండ్రు ♦ జనులు గలరు
వీరితో సంధియే ♦ కోరరా దని సేయవలయు; దుర్బలశత్రు♦వులగు వీరి
వింశతివర్గాఖ్య ♦ వెలయించి రార్యులు, కావున వీరి; దు♦ర్గంబు రాష్ట్ర

సచివసైన్యములు కో♦శమునను నీయైదు ప్రకృతు లనందగి ♦ పరఁగు వీని
విజిగీషు వగునట్టి ♦ పృథ్వీశునకు ముందువెనుకప్రక్కలనున్న ♦ జనవిభు లొగిఁ
బండ్రెండుగురు సుమ్ము ♦ వారల నడుమను విజిగీషువగు రాజు♦వెలయుచుండు
నతని మ్రోల వసించు ♦ వాఁడండు శత్రువు, వానికి ముందున్న♦వాఁడు మిత్రుఁ

డతనిముందఱ నుండు ♦ నతఁ డరిమిత్రుఁడా వతని కగ్రంబున ♦ నలరువాఁడు
మిత్రమిత్రుఁడు, శత్రు♦మిత్రమిత్రుఁడు వాని కవ్వల నుండువాఁ♦డరయ నిట్లు,
లైదుగుర్ధరణీశు ♦ లగ్రభాగంబున ముందుగ వెనుకల ♦ నున్నయట్టి
యరియె పార్ష్ణిగ్రాహుఁ♦డనఁబడు నవ్వలఁ గ్రాలుమిత్రుండె యా♦క్రందుఁ డనఁగఁ

బరఁగు నవ్వలఁదగు ♦ వారలీవేరుల పైన నానారశ♦బ్దంబుఁ జేర్పఁ
బడి పిలువంబడు ♦ వారలీవల వ్వీరు విజిగీషువునకును ♦ వెనుక వార;
లతని పార్శ్వంబునం ♦ దలరువాఁడే మధ్యమాహ్వయంబునఁ దగు♦నట్లె వీరి
కంటెఱికిని దూర♦మందుండు రా జుదాసీనుఁ డనంబడుఁ♦గాన వీరి;

యాత్ర యనఁ స్వకీ♦యారి జయింపంగ దండెత్తిపోవుట ♦ తనరునద్ది
యైదువిధంబుల ♦ నందుఁ బార్ష్ణిగ్రాహముఖుల లెక్కింపక♦మొనసి శత్రుదుఁ
విభులపైఁ బోవుట♦వెలయువిగృహ్యయానాహ్వయంబునఁ, బృష్ఠ♦మందుముం
దగు నృపాలకులతోఁ ♦ దగ సంధి గావించి తనశత్రువునిపైకిఁ♦జనుటయగును

సంధాయయానము; ♦ సామంతనృపులతో నరుగుట సంభూయ♦యానమగును
వేఱొకనృపునిపై ♦ వెడలునట్లుగఁ దెల్పి వేఱొకనృపతిపై ♦ వెడలుటయును
నద్దియాను ప్రసంగ♦యాన మొక్కనిపైకిఁ జనుట కూహించియా♦తనిబలాధి
కునిగఁ దలంచి య♦ప్పనిమాని తన్మిత్రుపైకి దండెత్తుట ♦ పరఁగుఁ జుమ్ము

ప్రత్యుయానము, మఱి ♦ వీని నైదింటిని; సైన్యవిధానమ్ము ♦ సంధివిగ్ర
హములందు యానంబు♦నాసనమ్మును నను నివిరెండు తగియుండు♦నెపుడుకాన
వానినీచెప్పిన ♦ వాని నెల్లను శాస్త్రపద్ధతినో మహా♦ప్రాజ్ఞ! నీవు
విడువంగఁ దగువాని ♦ విడిచి కైకొనఁదగు వాని నెల్ల గ్రహించి♦వఱలుచున్న

తే. వాఁడవుగదా! సులక్షణ♦వంతులైన
సచివులను మూవురను గాని ♦ సరసచిత్త!
నలువురంగాని చేర్చియో ♦ దెలిసికొనుదె?
యాశయంబులఁ బ్రత్యేక ♦ మైన సరసి. ౭౧ 3389

క. అనుజా! చదివిన వేదము, లనుదిన మగ్న్యర్చనాది ♦ కామల కార్యా
ళిని సఫలము లేకద? యా,ధనములు సఫలములు గాదె ♦ దానాదులచేన్. ౭౦౪

క. రతిసంతానంబుల నీ, సతులెల్లన్ సఫలలె గద? ♦ చక్కఁగ శ్రద్ధన్
శ్రుతులలర వినిన శాస్త్రం, బతిశయశీలమున సఫల♦మాఁగద? భరతా!. ౭౨

తే. యశము దీర్ఘాయువట్లు ధ♦ర్మార్థకామ,ము లనువీని నొసంగెడు ♦ బుద్ధి నిపుడు
తెలిపినాఁడను నాకది ♦ వెలయు నట్లు, నీకు నున్నదియే కదా ♦ నిరత మనుజ!.

క. మనజనకుఁ డతనితండ్రి య,తని తాతయు నెట్టివృత్తిఁ ♦ దమిఁ జేకొనిరో
జననింద లేక సత్పథ,మునఁదగు నావృత్తి నెలమిఁ ♦ బూనితివిగదా?. ౭౮ 3393

క. సుగుచిరమగు నన్నము నొ,క్కరుఁడవె యై తినవుగాదె? ♦ కడుఁ బ్రార్థింపన్
బరమాభిలాషల సుహృ,ద్వరులకు నిత్తువె? వచింపు ♦ భరతా! సతమున్. ౭౫

చ. నిరతము ధర్మతత్పరవి♦నిర్మలబుద్ధిఁ జెలంగి దండమున్
గరము ధరించి నీతిదగఁ♦గాఁ బ్రజలం దమిఁ గాచునేని భూ
వరుఁ డిలయెల్ల నీజగతిఁ ♦ బాలన మొప్పఁగఁ జేయఁజాలు చున్
బరమగు జ్ఞానమూని సుర♦పత్తన మొందును బూర్వులైన భూ
వరులటు దేహమున్ విడిచి ♦ ప్రాక్కృతపుణ్యవిశేషయుక్తిచేన్. ౭౬ 3395

నూఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౧ - వ సర్గము.

రామునకు భరతుఁడు తండ్రి మృతి నెఱింగించుట.

చ. అని రఘురాముఁ డీవిధి స♦మంచితధర్మములెల్లఁ జెప్పఁగా
విని భరతుండు రాముఁ గని ♦ విన్నఁదనంబున నిట్లు పల్కె ని
న్ననువుగ సేవచేసెదు మ♦హాత్తరధర్మము వీడినట్టి నన్
గని యిఁక రాజధర్మములు ♦ గల్గునె చేయఁగ నేమియేనియున్. ౧ 3396

చ. నునుజవతంసమా! వినుము ♦ మానవనాయక! జ్యేష్ఠపుత్త్రుఁడుం
డినతఱి నెప్పుడేనియుఁ గ♦నిష్ఠకుమారుఁడు ధారణీశుఁడై
తనరుట లే, దనాదియగు ♦ ధర్మమిదే మనపూర్వులందు నె
క్కొనియె చెలంగుచుండెడుః ర♦ఘుప్రియభూషణ! చిత్తగింపుమా!. ౨ 3397

క. ననుఁ గూడి సంపదున్నతిఁ, గనిన యయోధ్యకును వచ్చి ♦ త్ప్మాతల మేలం
గను నభిషిక్తుఁడవగుమా!, [1]మనవంశము వృద్ధినొందు ♦ మాడ్కిఁన్ రామా!.

సీ. తపమున దేవతా♦త్వము గల్గు నద్దాని విడిచియె యభిషేక♦విధి యిఁకేల
యనుదువు కాంబోలు♦జనులు రాజును మనుష్యునిగాఁదలంతురు♦మనమునందు
నృపుఁడు దేవుండని♦యే నమ్ముదును నేను నతనిపృత్తంబు ధ♦ర్మార్థయుక్త
మాట నమానుషం♦బై యుండుఁ గావున నరపతి దేవుఁడ♦నంగ నొప్పుఁ

[2]తే. దపముచేఁ గ్లేశముల దేవ♦తాత్వమలరు
భూమిపాలనమ్మున భోగ♦మూలకముగ
దేవతాత్వము సరిగ సి♦ద్ధించుఁగాన
భూపతియె దేవుఁడయి యిలఁ ♦ బొల్చు సుమ్ము. ౪ 3399

క. వినుమింకఁ దండ్రివిషయం, బును నేఁ గేకయనృపాలు ♦ పురినుండఁగ నీ
వును గాన కేగ యజ్వను, జనసమ్మతుఁడైన నృపతి ♦ చనియెన్ దివికిన్. ౫.

క. అనుజునితో భూసుతతో, వనికి వప్పురిని విడిచి ♦ పయనమయినతో
డనె దుఃఖశోకబాధలఁ, గని నరపతి చనియెఁ జుమ్ము ♦ గన్రుపదవికిన్. ౬

క. పురుషవరా! యిఁకనెమ్మా!, సరగున జలతర్పణాది ♦ సకలక్రియలన్
ధరణీశున కొనరింపుము, పురిఁ జేసితి మితఁడు నేనుఁ ♦ బూనిక మున్నే. ౭

[3]ఉ. నేనిఁకఁ జేయనేల ముసు ♦ నీవు నితండును జేసియుండఁగా
మానితకృత్యమం చనెదొ ♦ మంజులమోదము నిచ్చుఁ దండ్రి కే
సూనుఁ డతం డొనర్చినది ♦ సూరిజనస్తుతిఁగాంచి యక్షయం
బై నెఱి నూర్ధ్వలోకమున ♦ నందును దండ్రి కటంచ్రుగా బుధుల్. ౮

క. నీవే తండ్రికిఁ బ్రియుఁడవు, గావున జలతర్పణాది♦కంబులఁ జేయం
గా వలయు నిన్నుఁ బాసిన, యావిభుఁ డా దుఃఖమున నె♦యార్తిం గనుచున్.

చ. నినుఁ గనఁ గోరుచున్ మఱియు ♦ నిన్నెగుఱించి మహార్తినొందుచున్
మనము త్వదాత్తమై తనర ♦ మానవనేత మరల్పలేక ని

[1] కులస్యాస్యభవాయనః-అనిమూలము 2 దేవత్వే సమ్మతో మను-అనిమూలము. 'తపశ్చరణేన క్లేశద్వారాదేవత్వమ్, రాజ్యపరిపాలనేన భోగద్వారాదేవత్వ మితిభావః.' అనువ్యాఖ్య ననుసరించి యిది వ్రాయఁబడినది 3 ఈపద్యప్రథమపాదము వ్యాఖ్యలోని యవతారికకని యెఱుంగునది.

న్నవిశము లోఁ దలంచుచు మ♦హాత్తరశోకభరంబు నొంది చ
య్యన నతఁ డస్తమించెను [1]బ్రి♦యాత్మజు వీడుట యెట్లు సాధ్యమౌ. ౯

నూటయొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౨ - వ సర్గము.

రాముఁడు తండ్రికై శోకించి తర్పణ మొనర్చుట

క. భరతునిచే నెంతయు దు,ర్భరమగు పితృమరణవార్త ♦ రయమున విని యా
తురుఁడై సహింపఁజాలక, ధరపైఁ బడియెన్ మహీసు♦తాధవుఁ డార్తిన్. ౧

చ. అరిగణకాలుఁ డారఘువ♦రాన్వయవీరుఁడు శక్రుఁ డట్టి సం
గరమున వైచినట్టి పవి♦కాండము బోలె సుదుస్సహంబుగా
భరతుఁడు చెప్ప నక్కఠిన♦వాక్యము వే విని తాళలేకయే
[2]కరయుగపీడనంబున ని♦కామము నార్తిని వెల్వరించుచున్. ౨ 3407

క. కరములఁ బై కెత్తుచు భీ,కరపరశు నికృత్తమగుచు ♦ క్షమఁ ద్రెళ్లెడు సుం
దర[3]పుష్పనికరవృక్షము, కరణిన్ బరవశము నొంది ♦ క్ష్మాస్థలిఁ బడియెన్. 3

సీ. ఆరీతిగా నదీ♦తీరంబు నెగఁజిమ్మి యలసి నిద్రించెడు ♦ హస్తిరీతిఁ
బరవశుండయి నేలఁ♦బడియున్న యమ్మహేష్వాసుని శోకాభి♦భవుని భూమి
పాలుని రాముని ♦ బరికించి భరతుండు సౌమిత్రులాభూమి♦జాతయును మ
హార్తి శోకించుచు ♦ నతని మూర్ఛం దేర్ప సలిలంబు లంతటఁ ♦ జల్లి; రవల
ఆ. మరల స్మృతిని బొంది ♦ కరుణ నశ్రులనుండి
బాష్పధారలురలఁ ♦ బరమదీన
వాక్యములను దుఃఖ♦పరవశుండయి పల్క
మొదలుపెట్టె రామ♦భూవిభుండు. ౬ 3409

క. అంతట రాముఁడు ధర్మ, స్వాంతుఁడు రాజేంద్రుఁడైన ♦ జనకుండటు లో
కాంతరగతుఁడౌటన్ విని, చింతన్ ధర్మంబు మీఱఁ ♦ జెప్పె భరతుతోన్. ౭

క. జనకుఁడు కాలగతిం గనె, ననుజా! చేయంగనేమి ♦ యైనం గలదే
వినుమప్పురి నాకేటికి, జనపతిఁ దాదృశునిఁ బాసి ♦ చతురత తోలఁగన్. ౮

క. కనుఁగొనరాని యయోధ్య నిఁ,క నెవ్వఁడారీతి మెఱయఁ♦గాఁ బాలింపం
గను నేర్చు? నమ్మహాత్ముఁడు, కనె మృత్యువు నన్నుఁ గూర్చి ♦ కొడు నార్తుం డై.

క. జనకునకున్ సంస్కారం, బును జేయఁగనైతిఁ బాడఁ♦పుట్టుక గల నే
నును జేయఁదగిన దెయ్యది, జనకుని కిఁకమీఁదఁ జెప్పు ♦ సాధుమనీషా!. ౯

చ. అనఘుఁడ వీవె తండ్రికి మ♦హామతికిం దఱితప్పకుండఁ గృ

---

1 ఈపద్యసారమే మరల నిటఁ జేర్పఁబడినది 2 కరయుగపీడనంబు=చేతులు పిసికికొనుట.
3 పుష్పితాగ్రో యథాద్రుమః-అనిమూలము.

త్యనికర మట్లు చేసితి వ♦హో భరతా సనుయంబునందు నీ
వనుజుని సీతనిం గలిసి ♦ యన్నియుఁ జేసితి విందుచేతనే
జని కృతకృత్యు మయ్యె నిఁక ♦ జన్మము నాయది వ్యర్థమే సుమీ!. ౧౦

క. నరపతిలేమిని మంత్రిని, కరహీనంబగుచు మిగులఁ ♦ గలఁతం గను న
ప్పురమున కిఁకఁ బో నొల్లను, నరణ్యవాసంబు తీరి♦నప్పటి కనుజా!. ౧౧

క. జనకుఁడు మృతుఁడయ్యెం గద, వనవాసము గడువ మరలి ♦ పత్తనమునకుం
జనుదెంచిన నా కెవ్వఁడు, పనులను నేర్పంగఁ జాలు♦వాఁడు గలఁడిఁకన్.

సీ. జనకుండు మును నేన♦తని యాజ్ఞ చొప్పున నడుచుకొనంజూచి♦కడుముదంబు
నంది నన్ లాలింప ♦ నాడుచుండును గదా యటువంటి శ్రోత్రసు♦ఖావహమ్ము
లగుపల్కుల నిఁకెవ్వ♦రటఁ బల్కఁగాఁగల; రని భరతునితోడ ♦ నపుడు పల్కి
సంపూర్ణశశినిభా♦స్యంబుతోఁ దగు సీతఁ గని పురపురఁ బొక్కు♦చును వచించె

తే. మామ మృతుఁడయ్యె సీత! ల♦క్ష్మణ! కుమార!
తండ్రి లేనట్టి బిడ్డవై ♦ ధరణిఁ దిరుగు
వాఁడవైతివి పితృమృతి♦వార్తఁ జెప్పె
భరతుఁ డిచ్చట నింకేమి ♦ పలుకువాఁడ. ౧౫ 3417

తే. అనుచు రాముఁడు పల్కంగ ♦ నమలయశముఁ
గన్న యాసహజుల కెల్లఁ ♦ గనులనుండి
బాష్పధారలు మిగులంగఁ ♦ బడియె నవని
పైన; నవ్వేల వారెల్ల ♦ బహువిధముల. ౧౬ 3418

క. శ్రీరాముని న్వాదూక్తుల, గారవమున నూఱడించి ♦ క్ష్మాకాంతుసకున్
గోరి జలతర్పణముల వి.చారము విడనాడి చేయఁ♦జను నని రంతన్. ౧౭

చ. జనకజ, మామయైన నృప♦చంద్రుఁడు స్వర్గము నొందెనన్నవా
ర్తను విని కన్నుదమ్ముల ని♦తాంతము బాష్పము గ్రమ్మియుంటచేఁ
దనపతిఁ జూడఁజాలక వె♦తంబడుచుండెను; రాముఁ డంతఁ జ
క్కనివ్యథ నేడ్చుచున్న తన♦కాంతను నూఱడిలంగఁ బల్కుచున్. ౧౮

తే. తన సహోదరు లక్ష్మణుఁ ♦ గని వ్యథగల
వానిఁ దా దుఃఖమొందుచుఁ ♦ బలికె వేగ
యనుజ! యింగుదిపిణ్యాక♦మును గ్రహించి
యిమ్ము యుత్తరీయంబును ♦ దెమ్ము! నీవు. ౧౯ -3421

క. జలతర్పణమ్ము నిప్పుడె, యిలేశునకు సాధుచిత్త♦మే గల్గిన యు
జ్జ్వలకీర్తి కాచరింపఁగ, వలయుఁ గదా పోవుచున్న♦వాఁడన్ నదికిన్. ౨౦

క. చనుఁగాక సీత ముందుగ, వెనుకనె నీవరుగు మేను ♦ వెనుకొని వత్తున్
జెనువగలఁ బొగిలి చనుతఱి, వనితలు బొలుదును జనఁగ♦వలయుం దొలుతన్.

సీ. అంతవారలను గు♦లాచారరీతిగా ననుసరించుచు విది♦తాత్ముఁ డగుచు
మతివిభవాఢ్యుఁడై ♦ నుంచిస్వభావంబు గలిగి శాంతియు దాంతి♦గలిగి రాము
నందు నిశ్చలభక్తి ♦ యలరనున్న సుమంత్రుఁ డారాఘవునిని ద♦ననుజులైన
భరతాదులను మృదు♦వాక్కుల నోదార్చి వారలఁ జేకొని ♦ పరమపావ
తే. నియగు జాహ్నవి లోనికి ♦ నిపుణముగను
దీసికొనిపోయె: విమలకీ♦ర్తిప్రకాశు
లైన యాజానకీరాము ♦ లక్ష్మణు లక్ష్మ
ణుఁడును గంగను దర్శించి ♦ రడలుచుఁ గడు. ౨౩ 3424

చ నిరతము పుష్పితాటవుల ♦ నెమ్మి నొసంగుచు నొప్పుచున్ మనో
హరమయి వేగపోవు సలి♦లార్భటి గల్గి చెలంగు జాహ్నవిన్
గరము తపించుచుం గుచుఁ ♦ గష్టమునన్ దరి డిగ్గి స్నాతులై
విరహితకర్దమం బగుచు ♦ విశ్వశుభప్రదమైన తావునన్. ౨౪ 3425

క. జనకా! నీకగుఁగాక్షి, ననములు పావనము లనుచుఁ ♦ బలుకుచు భూనా
థున కిచ్చి రుదకములఁ జ,య్యన రాముఁడు జలముఁ గొనుచు♦నంజలినిండన్.

క. పితృపతి దిక్కు మొగంబై, మతిదూలఁగ నేడ్చుచునె న♦గు స్తనృపవరా
పితృలోక మొందు నీకయి, సుతుఁ డిచ్చెడి యామనోజ్ఞ♦శుభసలిలంబున్.

తే. అక్షయంబులె యగుఁగాక ♦ యనుచుఁ బలికి
విడిచె జలముల నంతట ♦ విమల తేజ
మలరు రాముఁడు కాంతయు♦వ్వలికిఁ బోయి
తండ్రికిం జేసెఁ బిండప్ర♦దాన మచట. ౨౮ 3428

సీ. అనుజులతోఁగూడి ♦ యార్తుఁడై యింగుదీపిణ్యాకమును గొని ♦ విమలభక్తి
బదరీఫలంబులఁ ♦ బరిపక్వములనందుఁ జేర్చి ముద్దలు చేసి ♦ క్షితితలమున
దర్భలఁ బఱచి ము♦ద్దల వానిపై నుంచి పలువిధముల నేడ్చి ♦ పలికె నిట్లు
లీపిష్టమే మాకు ♦ నిందు నాహారంబు కాన నిచ్చితిమి యి♦ద్దాని నీకు
తే. నోమహారాజ! ప్రీతితో ♦ నొగిని దీని
నారగింపుము [1]దేని నా♦హారముగను
గొనునొ పురుషుండు దానినే ♦ తనదు దేవ
తలకు భక్తిని నర్పింప♦వలయుఁ గాదె. ౩౦ 3429

క. అని పలికి పురుషసింహుం, డనఘుం డాదారిఁ బట్టి ♦ యానదితీరం
బుననుండి పోయి భూధర, మును సుందరసానుపుంజ♦మును నెక్కెఁ దమిన్.

ఆ. పర్ణశాలదైన ♦ ద్వారమ్ము చేరిన, యంత రామచంద్రుఁ ♦ డాదరమున
బారిసాచి యట్టె ♦ [2]భరతలక్ష్మణులను, గౌఁగిలించుకొని యెఁ♦గడురయమున.

1 యదన్నః పురుషో భవతి తదన్నాస్తస్య దేవతాః-అనిమూలము. 2 పరిజగ్రాహ బాహుభ్యా ముభౌ భరతలక్ష్మణౌ-అనిమూలము.

సీ. ఆసహోదరులు న♦య్యవనీకుమారియుఁ జేరి యేడ్వఁగఁ దదీ♦యారవమునఁ
బంచాస్యనాదంబు♦వలనఁ గల్గెడురీతి నగ్గిరిఁ బ్రతిశబ్ద ♦ మపుడు కల్గె;
బలవంతులైన యా♦భ్రాతలు తండ్రికి నుదకక్రియలు చేయు♦చుండి యేడ్వ
నమ్మహాధ్వని విని ♦ యాభరతునిసేన భయము నొందెను;వారు♦భరతుఁ డన్నఁ

ఆ. గలిసికొనియె నిజము♦గా వారలందఱు
మృతుని జనకుఁ గూర్చి ♦ మిగుల వగలఁ
బొగులుచున్నవారు ♦ పుట్టెఁ గావున ధ్వని
యట్టులనుచు నంత ♦ నెంచి రచట. 3౬ 3432

క. బలములు తమతమ వాస, స్థలములనున్ వదలి యొకవి♦ధంబగు మనసుల్
చెలఁగన్ ధ్వని పుట్టిన దెస, కలరుచు వే పఱుగువాఱి♦రదె యిదె యనుచున్.

ఆ. చరణగతుల వారు ♦ చనఁదగి యుండియు
సౌకుమార్యమునను ♦ శ్రమము నోర్వఁ
జాలకుంట హయగ♦జముల నలంకృత
స్యందనముల నెక్కి ♦ కొంద ఱరుగ. 3౭ 3434

తే. కాలినడకనె కొందఱు ♦ లీలఁ జనిరి
వనికిఁ బోయిన శ్రీరామ♦భద్రుఁ జూచి
స్వల్పకాలమె యైన న♦త్యధికకాల
మగను దమ్మెడఁబాసిన♦ట్టి గతిఁ దలఁచి. 3౮ 3435

క. కనుఁగొను నాతురమున వే, చని రాశ్రమసీమ. కంత ♦ సహజులు మోదం
బున నొకటఁ గూడి యుండుట, గనుకాంక్షుల వాహనఖుర♦గాఢధ్వనులన్.

క. ప్రతినాదంబుల నీయఁగ, నతివేగము వోవువారి ♦ హయగజఖురసం
తత ఘర్షణనాదం బు,న్నతరథనేమివిపులస్వ♦నము లటఁ జెలఁగన్. 3౯

తే. ధరణి వర్షర్తువున మేఘ♦తతులచేత
నాకసము శబ్దమును జేయు♦నట్లు తుముల
నినదమును జేసె దానఁ ద♦ద్వనగజమ్ము
లాఁడుగజములు వెంటరా ♦ నతిభయమున. ౪౦ 3438

క. అనయముఁ దారుండిన య,ద్వనమును విడనాడి యొండు ♦ వనమున కరిగెన్
దనరారు తన్మదాంభో, ఘనగంధ మ్మావరించెఁ ♦ గానన మెల్లన్. ౪౧ 3439

సీ. కారుదున్నలును వృ♦కంబులు పందులు శాఖామృగంబులు ♦ సర్పమహిష -
ములు వ్యాఘ్రములును దు♦ప్పులు జంకలాధ్వనికడరిపాఱెనవి,ర♦థాంగములును
జలకుక్కుటములు హం♦సలును గారండవములు గొప్పవైనకొం♦గలునుబురుప
కోకిలంబులు మఱి ♦ కొంగలు మొదలగు పక్షులు భయపడి ♦ పాఱె దెసల

తే. కాధ్వనికి భీతినందిన♦యట్టి పక్షి
గణముచే వ్యాప్తమయ్యె నా♦కసము సైన్య
జనులచే వ్యాప్తమయ్యె న♦వనితలంబు
గనుక నీరెండు వెలసె నొ♦క్కవిధముగనె. ౪౪ 3440

క. ఈరీతి నాతురంబున, వారటువలెఁ బాఱి యందుఁ ♦ బర్ణంబులచేఁ
గోరిక నిర్మింపంబడి, చారుతరంబైన యముల ♦ సద్మమునందున్. ౪౫ 3441

క. పురుషవరేణ్యుని రాముని, నరిందముని గీర్తిశాలి ♦ నవనిపయిన్ సు
స్థిరమునఁ గూర్చుండి సహో,దరయుతుఁడై యున్నవానిఁ ♦ దగఁగాంచిరటన్.

క. అంతఁట గుమిగాఁ జేరియె, మంతనుతిన్ గైకనద్లై ♦ సుంధరఁ బాన్కిన్
నిందించుచు శ్రీరాఘవు,నిం దమిఁ గని బాష్పపూర్ణ ♦ నేత్రంబులతోన్.

క. నిలువంబడిరంతట మి,క్కిలి దుఃఖము నొంది బాష్ప♦క్లిన్నాక్షులునై
వెలవెలఁబోయెడు సైన్యం, బులఁగని ధర్మజ్ఞుఁడగుచుఁ ♦ బొలుచు నతండున్.

*క. పురుషులఁ దండ్రులభంగిని, దరుణులఁ దల్లులను బోలెఁ♦దలఁచి మది సమా
దర మలరఁ గౌఁగిలించెను, మరియాదను జూపి రాజ♦మండనుఁ డవలన్. ౪౭

క. కొందఱిఁ గౌఁగిటఁ జేర్చెను, గొందఱు మ్రొక్కిరల శ్రీర♦ఘువరునకెలమిన్
డెంద మ్మలరఁగ బాంధవ, సందోహము మిత్రవర్య♦సముదాయంబున్. ౪౮

తే. వారివారికిఁ దగినట్లు ♦ గౌరవముల
రఘువరుండు సన్మానించె ♦ రమణ; నంత
నందు మహాత్ములైన రా♦మాదులేడ్వ
భూరి రవమట్టి దివమున ♦ భూతలమున. ౪౯ 3447

తే. కొండగుహలందు నన్నిది♦క్కులను బ్రతిర
వములఁ బుట్టఁగఁ జేయుచు ♦ వరమృదంగ
రవము పోలికగా గభీ♦రంబు నగుచు
వినఁబడుచు నుండె; నంతట ♦ మునివరుండు. ౫౦ 3448

నూటరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౩ - వ సర్గము.

కౌసల్యాదులు రాముని దగ్గఱకు వచ్చుట.

క. నరపతిపత్నులఁ దోడ్కొని, కరము ప్రమోదంబు రాముఁ♦గాంచఁ దనరఁగా
గిరినున్న పర్ణశాలను, నరయుచుఁ జనుచుండె; దశర♦థాంగన లెల్లన్. ౧

క. మందగమనంబు మీఱఁగ, మందాకిని కరుగుచుండి ♦ మార్గంబునఁ బ్రి

---

* పరిష్వజత ధర్మజ్ఞః పితృవ న్మాతృవచ్చ సః-అనిమూలము.

తిం దగ రామాదులు గో,ల్వం దనరిన తీర్థభూత♦లంబుఁ గనంగన్. ౭ 3450

సీ. కౌసల్య యంతమో♦గంబు నిండన్ బాష్పములు గ్రమ్మ నోరెండఁ♦గలఁగి శోక
మునను సుమిత్రఁ ద♦క్కిన రాజపత్నులఁ గని పల్కె నెవ్వరి♦కిని శ్రమములఁ
గలిగించు బెడిదంపుఁ♦గార్యమ్ములం జేయ నట్టి వారయ్యు ము♦న్నాత్మదేశ
మున నుండి యెవ్వరు♦పనుపంగఁబడినారొ యాయనాథులు రాఘ♦వాదులెలమి

ఆ. స్నాన మాచరించు ♦ స్థల మిది నిశ్చయ
మగు సుమిత్ర! నీదు ♦ నాత్మజుండు
[1]నాకుమారుకొఱకు ♦ నైజమోదంబున
నిచట నుండి తానె ♦ యెపుడు జలము ౮॥ 3451

క. కొనిపోవుఁ జుమ్ము; నీప్రియ, తనయుఁడు నీచంపుఁ బనులఁ ♦ దగునని యిటుచే
సినను దూష్యుఁడుకాఁడో, వనితా! జ్యేష్ఠుండు తండ్రి ♦వలె నగుఁ గానన్.

క. అనుజుం డాతనికొఱకే, పనిచేసిన నద్ది సుగుణ♦వంతమె యగుఁ జూ;
వినుమిఁక భరతునిదగు ప్రా,ర్థనమున కీకొనుచు నాదు♦తనయుఁడు మరలన్.

తే. శమను బడసిన తర్వాతఁ ♦ గష్టములకు
నిట్టి వానికిఁ దగని నీ♦పట్టి దుఃఖ
కృత్యములు మున్ను చేసిన♦వెల్లఁ గడువ
ముందుచేయుట లేకయే ♦ పొందు సుఖము. ౯ 3454

సీ. అంతఁ గౌసల్యయా♦మ్యాగ్రమ్ములౌదర్భలందునందొకచోట♦ననుఁగుఁదండ్రి
సంతృప్తికయి రామ♦చంద్రుఁడుంచిన యాల యింగుదీపిణ్యాక♦మెసఁగుచుండఁ
గాంచె;నత్యాయతా♦క్షుంబులఁబొల్చెడునాయింతితనయుఁడ♦త్యార్తుఁడగుచు
దండ్రికిఁ బ్రియముగా ♦ ధరణిపై నుంచిన యాపిండములఁజూచి♦యవనినాథు

తే. సతుల నందఱఁ బిల్చి యా♦సరణిఁ బల్కె;
నిదిగొ యిక్ష్వాకువిభుఁడయి ♦ యెసఁగి మహిత
చిత్తుఁడగు తనతండ్రికిఁ ♦ జింతరాముఁ
డిడియెఁ బిండమ్ములను, శాస్త్ర♦హితము మీఱ. ౧౦ 3455

క. కనుఁడీ శతముఖుసామ్యం, బును గని మహితాత్ముఁడగుచుఁ ♦ బొలిచి మహాభో
గనిచయము ననుభవించిన, జనపతి కీపిండి తృప్తిఁ♦జాలదు చేయన్. ౧౧

క. చతురంభోధిపరీత, క్షితినేలి సమస్తభోగ♦సిద్ధులఁ గని యా
శతముఖు సాటిందగు భూ,పతి యెట్లీ గారపిండి ♦ భక్షించెడినో. ౧౨ 3457

క. అతులైశ్వర్యముగల నా, సుతుఁ డిట శ్రాద్ధమున యందు ♦ క్షోణీశుండు
న్నతుఁడగు తండ్రికి నతిన,మ్మతిచే నీ గారపిండి ♦ మహితం బనుచున్. ౧౩

---

1 మమపుత్రస్య కారణాత్-అనిమూలము. ఇటఁ గౌసల్య సుమిత్రకొడుకు నగ్గించుచున్న దని తెలియవలయు.

తే. ఇయ్యవలసినకాల మి ♦ ట్లగు దెంచి
నదికదా ? యింతకన్నను ♦ నాకు జగతి
మించు దుఃఖము మఱి గాని♦పించ దరయఁ
దనయుఁ డీ గారపిండిని ♦ జనకుఁ గూర్చి. ౧౩ 3459

క. ఇచ్చటఁ జూచియు నామది, హెచ్చిన దుఃఖమునఁ బగుల♦దేలొకొ చెప్పుఁడా
సచ్చరితలార! వేయిగ, నిచ్చట నీక్షణమునందె ♦ యెంతకఠినమో. ౧౪

తే. దేని నాహారముగఁ గొను♦నో నరుండు, తద్ది విజులకు నద్దియే ♦ తలఁప నగును
భోజ్యవస్తువటంచుఁ జె♦ప్పుస్మృతిశ్రుతి సత్యమైనయర్థము గలిగిన♦యది స్ఫుటముగ.

క. మనమున స్ఫురించుచున్నది, వనితామణులార! నాకు ♦ బాగుగ వని ప
ల్కిన నాదశరథుభార్యలు, వనటం బడి యేడ్చు నామె ♦ వర్ణ్యగుణాఢ్యల్.

సీ. మంచిమాటల నూఱ♦డించుచుఁ దోడ్కొని చని యాశ్రమంబున ♦ స్వర్గసీమ
నుండి వచ్చిన నిర్జ♦రుండు వోలె వెలుంగునట్టి రాముని గని ♦ రంత; నచటఁ
గౌసల్య మొదలుగాఁ♦గలతల్లు లెల్ల భోగంబుల విడనాడి ♦ కాన నున్న
వాని రాముని గని ♦ పరమదుఃఖార్తలై గొప్పనిస్వనము ని♦గుడువిధమున

తే. నేడ్చుచుఁ బాష్పపూరంబు ♦ లెల్ల విడిచి;
రంత సత్యప్రతిజ్ఞుఁడై ♦ యలరు రాముఁ
డట్టె లేచి యొనర్చె నా♦యంబల శుభ
చరణములఁ బట్టుకొని నమ♦స్కారములను. ౧౭ 3463

క. విరివిగల నేత్రములు గల, తరుణులు వారెల్లఁ దమకు ♦ దండంబిడు న
ప్పురుషవరుని వీఁపున నున్న రజంబును గాంచి తమను♦నంబులు కలఁగన్.

క. కరముల మృదువంగుళములఁ, గరము సుఖస్పర్శములను ♦ గలవాని మహా
దరమునఁ దుడిచిరి లక్ష్మణుఁ, డురుదుఃఖము పొంగుచుండ ♦ నొగిఁ దల్లులనున్.

క. కనుఁగొని రాముఁడు మ్రొక్కిన, వెనుకన్ వందనము లిడియె♦విధిఁ దప్పక మె
ల్లన వారికెల్ల వారలు, గని శుభలక్షణుని నతని ♦ క్ష్మాపతితనయున్. ౨౦ 3466

క. రామునియందెట్లో యటు, ప్రేమమునన్ నడుచుకొనిరి; ♦ పృథ్వీసుత యు
ద్దామముగ నీరు గనులన్, వేమాఱుం గ్రమ్ముచుండ ♦ వెతలం గనుచున్. ౨౧

సీ. వారిపాదములకు ♦ వందన మ్మొనరించి వారిమ్రోలనె నిలు♦వఁబడియుండె
వనవాసదుఃఖంబు♦నను గృశించుచు దీనయై యున్నయాసీత ♦ నాత్మజాత
జననిఁ గౌఁగిటఁ జేర్చు♦సరణిఁ గౌఁగిటఁ జేర్చియనియెఁ గౌసల్యయు;♦జనకుతనయ
దశరథుకోడలు ♦ తనరారు రాముని పత్ని యీతరుణి యీ♦భంగి నిర్జ

తే. నమగువనమున బహుళక♦ష్టముల నందె, నెట్టులో; జానకీ! కడు♦నెండ సోఁక
వాడియున్నట్టి పద్మంబు♦భంగి మిగులఁ, గందినట్టి మనోజ్ఞమౌ ♦ కలువరీతి.

క. కనకము దుమ్మున మున్గిన, యనువున, మేఘములు గ్రమ్మ ♦ నంబుజరిపుఁడుం
డునటు; ప్రభాహీనంబుగఁ, గనఁబడు నీముద్దుమోముఁ ♦ గాంచిన నన్నున్.

క. తనకాశ్రయదారువులను, ధనంజయుఁడు గాల్చురీతి ♦ దారుణదుఃఖం
బను నరణిఁ బుట్టిన హుతాశనుఁ డురుదుఃఖాంగుఁ డెదను ♦ నరగ దహించెన్.

తే. తల్లి కౌసల్య యిట్లు దు ♦ స్తరమహార్తి
నందుచుం జెప్పఁగా భర ♦ తాగ్రజుండు
తల్లికడ కేగి యామె పా ♦ దముల నటు వ
సిష్ఠుపాదంబులం దాఁకి ♦ చేసె నతులు. ౨౭ 3471

క. సురపతి గీష్పతికి నమస్కరించుగతి సుప్రభలను ♦ జ్వలనాభుండై
పరఁగు వసిష్ఠున కాదృతిఁ, బురోహితున కట్టె మ్రొక్కి ♦ పొదలెడు భక్తిన్.

ఆ. కూరుచుండె నతనిఁ ♦ గూడియే రాముండు;
భరతుఁ డంత ధర్మ ♦ నిరతుఁ డెల్ల
సచివపౌరవార ♦ సైన్యములను ధర్మ
నిరతులైన యితర ♦ నరులఁ గూడి. ౨౮ 3473

క. తనయగ్రజు చెంతనె కూర్చొనియెను; వీర్యాధికమున ♦ శోభిలు భరతుం
డును శ్రీరామునమీపంబున నే కూర్చుండి రాఘ ♦ వుని మునివేషున్. ౨౯

ఆ. ప్రభలవెలయుచున్న ♦ వానిఁ గనుంగొని
ప్రయతుఁ డగుచుఁ గమల ♦ భవుని మ్రోల
నింద్రుఁడుండు నట్లు ♦ లెదుటఁ జేమోడ్పుచే
నుండె; నంత నచట ♦ నున్న ఘనులు. ౩౦ 3475

సీ. భరతుం డిపుడు రఘు ♦ వరునకు మ్రొక్కి సత్కారమొప్పంగఁజ ♦ క్కఁగవచించు
ననుచు మిక్కిలి కుతూ ♦ హలము నిశ్చయముగఁగలవారలై ;రంత ♦ నలఘుధైర్య
మున వెల్గు రాఘవుం ♦ డును మహామతిమంతుఁడైన లక్ష్మణుఁడున ♦ మంచితమగు
ధర్మముగల కైక ♦ తనయుఁ డీ మువ్వురు నఖిలమిత్రావృతు ♦ లగుచు యజ్ఞ

తే. మున సదస్యులచేఁ జుట్టు ♦ కొనఁగఁబడిన
యట్టి త్రేతాగ్నులంబలె ♦ నచట నెంతొ
ప్రభలఁ జక్కఁగ వర్ణింపఁ ♦ బడఁగఁ దగుచు
వెలసి రందఱు కనుఁగొని ♦ యలరుచుండ. ౩౧ 3476

నూటమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౪ - వ సర్గము.

భరతుఁడు రాజ్యముఁ గైకొనుమని రాముని వేఁడుట.

క. తనకొదవినట్టి రాజ్యంబును విడిచి జటాజినములఁ ♦ బూనుటఁ దనయుం
దనువమభక్తి గలండని, యనుజుని భరతుని నెఱింగి ♦ యారాఘవుఁడున్. ౧

క. భరతునిఁ గని సౌమిత్రియు, నరుదుపడన్ వానిఁ గూడి ♦ యాదృతిఁ బలికెన్

భరతా! చీరజటాజిన, ధరుండవయి వచ్చితేల? ♦ దగ వనములకున్. ౧

క. దీనికిఁ గారణమేమో, మానక నీవేవచింప ♦ మమతన్ వినఁగా
మానస మలరుచునున్నది, నా నాతఁడు దుఃఖభరము♦నం బలుకమికిన్. ౨

చ. మరల మహాత్ముఁడైన నృప♦మండనుఁ డించుక యూరకుండి యా
దరము చెలంగఁగా బలిమిఁ ♦ దత్సహజుం దనచెంతఁ జేర్చి యా
తురమునఁ గాఁగిలించుకొని ♦ తోరపువేడుకఁ బల్కె నిట్టులో
భరత! జటాజినంబులును ♦ వల్కలముల్ ధరియించి నీవొగిన్. ౩ 3480

చ. వనికిటు లేలవచ్చితివి? ♦ వారక యంతయు నానుపూర్విగాఁ
గను వచియింపుమా యనుచుఁ ♦ గ్రమ్మఱఁ బ్రశ్న మొనర్ప రాఘవుం
గనుఁగొని కేలుమోడ్చి జన♦కాండము సంతసమంద నిట్లనున్;
జనకుఁడు దుష్కరం బనఁగఁ ♦ జాలినకార్యము చేసి యెంతయున్. ౪ 3481

క. వనితామణిపల్కుల విని, నినుఁ బూజ్యునిఁ బాసి పుత్ర♦నిర్భర దుఃఖం
బునఁ బీడితుఁడై స్వర్గం,బున కేగె మహాభుజుండు ♦ భూపతి రామా!. ౫

సీ. అరినిషూదన! విన♦వయ్య బుద్ధియె లేని నాతల్లి కైకయు ♦ నాతనిఁ దగఁ
బురికొలుపుటచేతఁ ♦ బూజ్యమా కీర్తిని హరియించునట్టి యీ♦యధికపాప
మును జేసె; నీయఘ♦మ్ములు జేయఁబూనిన యీకైక నాతల్లి ♦ యీప్సితమగు
రాజ్యమొందకయె ఘో♦రంబగు నిరయంబునందుఁ దాఁబడఁగల♦దధికదుఃఖ

తే. మునఁ గృశించుచు వైధవ్య♦మునఁ దపించి
యామెసంబంధమున నిమ్మ♦హాపవాద
మును గనినయట్టి దాసభూ♦తునిగ, నున్న
నన్నుఁ గరుణింపఁదగు సదా♦నందచిత్త!. ౬ 3483

క. అనఘా! యిపుడే రాజ్యం,బున నభిషిక్తుండవగుము ♦ పురుహూతుని రీ
తి నిదే వైధవ్యముగల, జననులు పౌరులును నీదు♦సన్నిధి కిటకున్. ౭ 3484

క. చనుదెంచియున్నవా రీ, మనుజుల నెల్లరను గావు ♦ మమతన్ రామా;
మనవంశగౌరవముఁ గా,వను వలఁతివి గాన నీవు ♦ ప్రముదంబలరన్. ౮ 3485

సీ. జ్యేష్ఠక్రమంబున♦నే వచ్చుటంబట్టియును భరింపంగఁ జా♦లిన సుశక్తి
గలవాఁడవౌట ని♦మ్ముల నీకు న్యాయమై యుండుటన్ రాజ్యంబు♦నుద్యమమునఁ
గైకొనుమా, సుహృ♦ద్గణముల దానిచే సఫలకాములఁ జేయఁ♦జనును నీకు;
నిష్కళంకప్రభా♦నిచయచంద్రునిచేత శారదనిశవలె ♦ సరసవిభుఁడ

తే. వైన నీచేత నీ భూమి♦యంతయు విధ
వాత్వమును మానుఁగాక; [1]రా♦మా! "త్వమేవ

1 ఏభిశ్చ సచివైః సార్థం శిరసా యాచితో మయా, భ్రాతుః శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి-అని మూలము. దీనికి వ్యాఖ్యాతవ్రాసిన విశేషార్థమే 'త్వమేవగతిః' అనుమాటచే నిశ్చయింపఁబడినదని తెలియుచున్నది.

గతి" యటంచును నీమంత్రి♦గణముతోడ
శిరసు క్షితిసోఁక మ్రొక్కి యా♦చించువాఁడ. ౧౧౹ 3486

క. అనుజుఁడ శిష్యుఁడ దాసుఁడఁ, గనుకఁ నను గరుణఁజూడఁ♦గాఁ దగు నీకున్
వినుమా నాదగు కోరిక, మనమునఁ దీర్పఁగఁ దలంపు ♦ మానక రామా!.

తే. తండ్రితాతలనుండి ని♦తాంతమైత్రి
సహితులై యానుపూర్విగ ♦ శాశ్వతముగ
మనపురినినుండి పూజ్యులై ♦ నినుఁ గనంగ
నరుగుదెంచిరి చూడు నె♦య్యమున వీరి. ౧౨౹ 3488

క. ఈవచ్చిన సచివాదులు, పావనగుణు లోక్కరీతిఁ ♦ బ్రార్థించెద రీ
భూవినుతుల ప్రార్థనలను, నీవును దాఁటంగరాదు ♦ నిజమిది రామా!. ౧3

క. అని పల్కి కైకకొమరుఁడు, ఘనభుజుఁ డతులుని నీరు ♦ గ్రమ్మఁగ శ్రీరా
ముని పదములు తలసోఁకం,గను శాస్త్రోక్తముగ మ్రొక్కెఁ ♦ గ్రన్నన భక్తిన్.

తండ్రియాజ్ఞ శ్రేష్ఠమని రాముఁడు చెప్పుట

చ. సమదకరీంద్రమట్లు పలు♦సారులు దీర్ఘములైన యూర్పులన్
గుములుగఁ బుచ్చు నా భరతుఁ ♦ గూరిమితమ్మునిఁ గౌఁగిలించి చె
ప్పె మమత; సత్వయుక్తిఁ దగి ♦ విశ్రుతివంశమునన్ జనించి తే
జమున వెలింగి మంచివ్రత♦సంతతిఁ జేయు భవాదృశుండిలన్. ౧౬౹ 3491

తే. తుచ్ఛరాజ్యసుఖంబె హే♦తువుగ నిట్టి, పాపకృత్యము చేయు,నె♦ప్పగిది? శత్రు
సూదనా! విను నీయందు ♦ సుంతయేని, దోషమున్నట్లు నామదిఁ ♦ దోఁప లేదు.

సీ. బాలత్వమునఁ బూజ్య♦రాలగు తల్లిని నిందించితి వదియు ♦ నీకుఁ దగదు
పాపదూరా! మహా♦ప్రాజ్ఞ! [1]పెద్దలు తమ్ము నాశ్రయించిన కళ♦త్రాత్మజాదు
లం దిచ్ఛవచ్చిన♦యట్లు చేయఁగ వచ్చు నని విహితంబయి ♦ యలరుచున్న
యది; లోకమందు భా♦ర్యాత్మజశిష్యుల నాధువుల్ నియమించు♦సరణినదువఁ

తే. దగిన వారిగ నెన్నదు♦రు గద; మనము
దశరథుని నియమమునకుఁ ♦ దగ వశులమె
యగుదుమని నీవెఱుంగఁగఁ ♦ దగును జుమ్ము;
సౌమ్య! వినవయ్య తండ్రి ద♦శరథవిభుఁడు. ౧౯ 3493

ఆ. వల్కలంబు క్రింది ♦ వసనంబు గాఁగఁ గృ
ష్ణాజినంబు మీఁది♦దా వలువఁగఁ
గట్టుకొనుచుఁ గానఁ ♦ గాని రాజ్యమ్మునఁ
గాని యుండఁజేయఁ♦గా విభుఁడగు. ౨౦ 3497

---

1 మహాంతోపి అభిమతదారాదిషు స్నేహం కుర్వంతీతి భావః-అను మహేశ్వరతీర్థాభిప్రాయ మిటఁ జేర్పఁబడినది.

చ. [1]క్షమఁగల ధర్మవిద్వరని♦కాయమునందును మేటివీవు ధ
ర్మముల నెఱుంగు తండ్రిపయి ♦ రాజులు లోకనుతోగ్రుగౌరవం
బు మదిని నెంతయుండునో సు♦పూజ్యయె గావునఁ దల్లియందు భే
దము విడి యంతమాత్ర ముచి♦తంబగు గౌరవ ముంచు టారయన్. ౨౧

[2]ఆ. ధర్మశీలురైన ♦ తలిదండ్రు లడవికి, నన్నుఁ బొమ్మటంచు ♦ నెన్ని పలుక
నట్టు చేయకెట్టు ♦ లన్యరీతిగ నాచ,రింపనగునొ చెపుమ ♦ యింపుమీఱ. ౨౨

క. భరతా! నీవు నయోధ్యా,పురి నలరుచు స్వర్గలోక♦పూజ్యంబగు రా
జ్యరమాధిక్యముఁ గనుచున్, గురునానతి మనుపవలయుఁ ♦ గువలయమెల్లన్.

తే. దండకాటవి నారవ♦స్త్రములఁ గట్టు
కొని నివాసముఁ జేయఁద♦గును గురువుల
నాజ్ఞ నేనును; వినుము మ♦హాప్రభావ్యుఁ
డైన దశరథరాజేంద్రుఁ ♦ డందఱు విన. ౨౩ 3493

సీ. ఈరీతి విభజించి♦యే యాజ్ఞ చేయుచు స్వర్గమ్మునకు నేగె ♦ సకలధర్మ
వేత్త లోకగురుండు ♦ పృథ్వీశుఁ డాతండె యాఁ బ్రమాణము నీకు♦నట్టులోట
జనకుఁ డిచ్చిన భాగ♦మును యథావిధిగాఁగననుభవింపఁదగు♦వినుము! సౌమ్య!
దండకాటవిఁ జతు♦ర్దశవత్సరములుండి యస్మహాత్ముఁడు మను♦జాధిపుం డొ

తే. సంగినట్టి [3]భాగంబును ♦ సాధుబుద్ధి
ననుభవింపఁగఁ గలవాఁడ, ♦ మనుజవితతి
కెల్లఁ బూజ్యుండు మహితాత్ముఁ ♦ డెల్లవిధము
లను మహేంద్రసముండగు ♦ జనకుఁ డపుడు. ౨౬ 3499

క. ఆనతి నాకేమిచ్చెనొ, నేనది పరమార్థమనుచు ♦ నెమ్మదిఁ దలఁతుం
గాని తదనుక్తమగునది, యా నాకేశత్వమైన ♦ నహితము నాకౌ. ౨౭ 3500

నూటనాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౫ - వ సర్గము.

రాముని రాజ్యమును గ్రహింపుమని మరల భరతుఁడు ప్రార్థించుట.

చ. పురుషవరేణ్యు లౌచు రఘు♦పుంగవులై తగు రాముముఖ్యులా
తఱ్గుణమునందు మిత్రులవి♦తానము చుట్టును బర్వియుండ దు

---

1 తాప ధర్మభృతాం శ్రేష్ఠ జననాయ్య మపి గౌరవమ్-అనిమూలము. ఆరయన్-అంత గౌరవము తల్లియందుంచుట యుచితంబగును. అని యన్వయము. భేదము విడి యనునది అంతమాత్రమను దాని యర్థమును స్పష్టపఱచును గాన వ్యర్థముగాదు. 2 మాతాపితృభ్యా ముక్తోఽహమ్-అని మూలము. 3 ఉపభోక్ష్యే త్వహం దత్తం భాగం పిత్రా మహాత్మనా-అనిమూలము.

ర్భరమగు చింతలో మునిఁగి ♦ వందురుచుండఁగ రేయి యద్ది దు
స్తరముగ దాఁటిపోయెను ని♦శాసతి యేగఁగఁ దెల్లవాఱఁగన్. ౧౫ 3501

క. సహజులు వారలు పిదపన్, సుహృత్తులం గూడి జహ్ను♦సుతయందుఁ దగన్
విహితమ్ములైన కృత్యని,వహములఁ బ్రాక్కాలికముల ♦ వరుస సలుపుచున్. ౨

క. శ్రీరాముని యాశ్రమమును, జేరిరి వారెల్ల నేమి♦చెప్పక యందున్
ఊరకకూర్చుండఁగ నపు, డారాముని& జూచి భరతుఁ ♦ డామిత్రులలోన్. ౩

క. పలికె మఱొక్కరు క్షితి నిత,రుల రాజ్యము సంగ్రహించు ♦ రూపుగలదె? య
ట్టులు చేయఁదగదటంచుం, బలుకకుమా! యాఱడిల్లఁ ♦ బలికితిఁ దల్లిన్. ౩౫

క. మును నీవె నాకు రాజ్యం,బును దీని నొసంగితి విఁకఁ ♦ బొంగుచు నీకే
నును దీని మరల నొసఁగెద, ననుమతిని నకంటకమగు ♦ నవనిం గొనుమా!. ౪

తే. అనుభవింపుము స్వేచ్ఛఁగా; ♦ నరయవృష్టి
కాలమున గొప్పనీటివే♦గమునఁ దెగిన
యట్టికట్టను నెవరికిఁ ♦ గట్ట నలవి
కాదుగద యట్లె యీగొప్ప ♦ త్క్షాతలమును. ౪౫ 3506

క. భరియింప మిగులఁ గష్టము, నరసుగుణా! నీవు తప్ప ♦ భరియింపఁగ నె
వ్వరుఁ జాలరు; భూమిపతీ, ఖరమశ్వమురీతి నడువఁ♦గాఁజాలదు సూ!. ౫ 3507

క. సురపథమున వినతాసుతు,కరణిన్ సామాన్యపక్షి ♦ కడఁకవడి మీఱన్
బరుగిడఁ జాలదుగా, యు,క్కరణిన్ నినుఁ బోలి నడువఁ♦గా నర్హుఁడనే?. ౬

ఆ. ఎవని నాశ్రయించి ♦ యిలఁ బెక్కుజను లోగి
బ్రదుకుచున్నవారొ ♦ వాని బ్రదుకు
తగినదౌను; మఱి యి♦తరుల యాశ్రయమున
బ్రదుకువాని జని య♦భవ్యతరము. ౭ 3509

సీ. మనుజుఁ డొక్కరుఁడు వి♦త్తనము వేసి జలంబుపోసి పెంచంగ నా♦భూరుహంబు
వామనులకు నెక్క ♦ వలనుపడని యట్లుగా మహాస్కంధాది♦కములతోడ
భూరితరంబయి ♦ పుష్పించియును ఫలములు లేకపోవ నం♦దులకు బీజ
మును వేసినట్టి య♦మ్మనుజుఁడు తత్ఫలప్రమదంబు ననుభవిం♦పకయె పోవుఁ
గద యోమహాభుజా! ♦ యిదె యుపమానము పట్టాభిషేకంబుఁ♦బడసి నీవు

తే. సుమ్ముఁ బాలింపవే నుప♦మానమునకు
నరయ నుపమేయమైనట్టి ♦ యర్థమెల్ల
సంభవించు నటంచు నో ♦ సరసచిత్త!
యెఱుఁగనేర్తువు; దశరథుఁ ♦ డింపుమీఱ. ౯౫ 3510

తే. కష్టముల కోర్చి నినుఁ బెంచి ♦ కౌతుకమునఁ
బట్టభద్రుని జేసి య♦వనితలంబుఁ

పాలనము చేయుచుండ నిక ♦ బరమపురుషుఁ
గని ముదంబును గనఁజేని ♦ గలదె ఫలము. ౧౦ 3511

క. అరిసూదన! యభిషేకం,బు రహిం బొందుచును రాజ్య♦మున సూర్యవలెం
బరఁగఁగఁ బ్రభాసుఁడవై తగు, పురజనములుగుములుగాఁగఁ♦బొంగెదు వేడ్కన్.

క. నినుఁ గని యానందింతురు;, మనుజేంద్రా! నీదు వెంట ♦ మదగజవితతుల్
చనుదెంచుచుఁ బెల్లుబ్బున, ఘనబృంహితముల నొనర్చుఁ♦గాక మహాత్మా!.

క. అంతఃపురమునఁ దనరెడు, కాంతలు సుసమాహితలయి ♦ కడుసంతసముం
గాంతురుగా కని పల్కిన, నెంతయు మోదమునఁ బౌరు♦లెల్లరు రామున్.

క. కొనియాడుచుఁ బ్రార్థించుచు, ననుజుఁడు పల్కినవియెల్ల ♦ నరయఁగ మేల్మే
లని పల్కిరి; తనప్రార్థన, మును గైకొనఁడన్న దుఃఖ♦మునఁ దాపమునన్.

క. విలపించుచున్న భరతుని, నెలమిం గని సాధుశిక్ష ♦ నెసఁగినబుద్ధిన్
విలసిల్లి ధీరుఁడై తగు, నలఘుతరజ్ఞాని రాముఁ ♦ డాశ్వాసింపన్. ౧౪ 3516

క. తనమదిని దలఁచి పలికెన్, మనుజుండు స్వతంత్రుఁ డనెడు ♦ మాటయెలే దో
యనుజా యిచ్ఛానుగతిం, బనిచేయుట గలుగ దెపుడు ♦ వానికి నెచటన్.

క. పురుషు నిటనుండి వేఱొక, ధరణికి నటనుండి యిటకు ♦ దైవమె శక్తి
స్ఫురణమున లాగుచుండును, భరతా! దైవంబె నన్ను ♦ వనముల కనిపెన్.

*క. జనకుఁడు మరణించుటకును, మనమున దుఃఖింపవలదు ♦ మానుము దానిన్
ధనసంచయములు తుదకున్, వినాశనము నొందుఁ బెక్కు♦విధములభరతా!.

ఆ. ఎంతపెద్దపదవి♦నే పొందినను దుదిఁ
బతనమగుట నిజము ♦ బంధుముఖుల
కూడికయును దుదకు ♦ వీడుటయే కల్గి
యుండు బ్రదుకు మృత్యు♦వొంది చెడును ౧౬ 3520

సీ. వస్తుతతిస్వభా♦వంబున నిట్టిదే కావున జనకుండు ♦ కాలధర్మ
మును బొందెఁ బరిపక్వ♦ములగు ఫలంబుల కెన్న వృక్షమునుండి♦యేతమంత
పట్టుతప్పి ధరణిఁ ♦ బడుట యొక్కటితప్ప నన్యభయంబు లే♦నట్లు జన్మ
మును గన్నమనుజున♦కును మృతినొందుటకంటె వేఱుభయంబు♦గలుగ దెపుడు

ఆ. గట్టికంబములను ♦ గల గృహమును జీర్ణ
మయి నశించునట్లు ♦ లరయ నరులు
జరకు మృతికిఁ బరవ♦శత్వమొంది నశించు
వారు సుమ్ము సూర్య♦వంశతిలక !. ౧౭ 6521

క. జరగి చనినట్టి రాతిరి, మరలియొ రానేర దెపుడు ♦ మఱి యమునాపు
ష్కరపూరము లవణోదధి, కరుగును మరలంగ నేర ♦ దనుజా! వినుమా! ౧౮

* సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః-అనిమూలము.

ఆ. గ్రీష్మమందు సూర్య♦కిరణముల్ జలములఁ
బీల్చునట్లు ప్రాణి♦వితతి జీవి
తములు గతములగు న♦హములును రాత్రులు
మ్రింగివేయుచుండు ♦ మేదినిఁ గడు. ౨౦ 3523

క. విను నీవు నిలిచియున్నను, జనుచున్నను జీవితంబు ♦ క్ష్మాపతితనయా!
యనుదినము క్షీణ మొందుచుఁ, జనుచున్నది కనుక వగవఁ ♦ జను నీకొఱకై.

క. నినుఁ జూచుకొనుచు నీవే, మనమున శోకింపవయ్య! ♦ మఱియొకరిగుఱిం
చిన చింత నీకిఁ కేటికి?, మనుజుఁడు చన మృత్యు వరుగు ♦ మానక తనితోన్.

తే. కూరుచుండినఁ దానును ♦ గూరుచుండుఁ
[1]జాలదూరము పయనమై ♦ చని మరలిన
నదియుఁ గూడనె చనివచ్చు ♦ నట్టులోట
దానిఁ దప్పించుకొనన నేరి♦తరము గాదు. ౨౨ 3526

[2]సీ. కాలాంతరమున నీ♦ వేలాగు చెప్పిన నట్లు చేయుదునని ♦ యనెద వేమొ
తనువున ముడుతలు ♦ కనఁబడుచున్నవి వెండ్రుకల్ నరసిన♦వి ముదిమి తగఁ
గ్రమ్మి తా జీర్ణించెఁ ♦ గావున నిఁక మీఁదఁ బురుషుఁడే యుపమను♦బూనియిట్టి
[3]పేరుపద్రవముఁ ద♦ప్పించుకొనన్ గల్గుఁ గాన నాత్మవిచార♦మూనవలయుఁ
తే. ప్రాణములు గల్గు తఱినె; వి♦భావసుండు
నుదయగిరి శిఖరంబుపై ♦ నొప్పు ధనస
మార్జనము చేయుతఱి యిది ♦ యని ప్రమోద
మొందుదురు క్రుంగ [4]శర్మంబు ♦ నొందనెంత్రు. ౨౩॥ 3527

క. ఇరుసనయంబుల నాయూ. పురుషార్థముఁ దాఁట సరిగఁ♦బొంపఁదలఁచుచుం
దురుగాని వానిచేఁ దను, పరమాయువు తగ్గు నని యె♦వరున్ మదులన్.

క. పంపోవును సూ; ఋతువులు, తలనూపఁగఁ గ్రొత్తక్రొత్త ♦ తలఁపులు పొందం
గలకాల మిదియె యనుచాత్మల సంతోషింత్రుగాని ♦ మది నెవఁడైనన్.

క. ఋతువులు క్రమముగఁ దిరుగుట, సతతము జీవితము తగ్గు ♦ సరభసగతి నే
వితమునఁ దరింతు మని యొ, క్కతఱిం దలపోయరేమొ ♦ కాని కుమారా!.

చ. వననిధిఁ గాష్ఠయుగ్మమొక♦భంగిఁ బరస్పరసంగతిం దగం
గని తఱి రాఁగ వేఱుపడుఁ ♦ గాదె! కుమారక! యట్లె భార్యలుం -
దనయులు బంధువుల్ మఱియు ♦ ద్రవ్యము లొక్కటఁ జేరియుండి చ -
య్యన విడిపోవువారు సమ♦యంబు తటస్థముగాఁగ నందఱున్. ౨౬॥ 3531

1 గత్వా సుదీర్ఘ మధ్వానం సహమృత్యు ర్నివర్తతే-అని మూలము. 2 ఈ సీసపద్య ప్రథమ పాదము వ్యాఖ్యలోని యవతారికకుఁ దెలుఁగని యొఱుంగునది. 3 పేరుపద్రవము=పెనుకష్టము. 4 శర్మము=సుఖము.

క. అరయ వియోగము గల్గుట, స్థిరమా సంబంధ మనఁగఁ ♦ జెప్పఁబడె వదలుకా
బరిపరి యోజించిన నీ, ధరణి న దేప్రాణిగాని ♦ తనమతిరీతిన్. ౨౭ 3532

తే. బంధువులతోడఁ గలిసి ని♦వాస మెప్పుఁ
జేయనేరదు కావున ♦ జీవితములఁ
బాసినట్టి యే ప్రాణిని ♦ స్వాంతమందుఁ
దలఁచి శోకించినను దాన ♦ ఫలము లేదు. ౨౮ 3533

సీ. పాంధసమూహంబు ♦ పయనంబు చేయంగఁ బధికుఁ డొక్కండు నే♦వత్తుమిమ్ము
వెంబడించియె యని ♦ వెంబడి చనునట్లు పూర్వులు చేయనో♦ప్పగను, దండ్రి
తాత లనుష్ఠించి ♦ తగు మృతిమార్గంబు నే సుతాదులు గూడ♦నెన్ని యనుస
రింపవలయునను♦రీతి నిశ్చితమగు దాని నెంతయు మానఁ♦దగదు సుమ్ము;
తే. భరత! యామార్గమునకును ♦ భంగ మనఁగఁ
గానరా దెప్పుడైన న♦ద్దానిఁ బొంది
యెట్లు దుఃఖింపవచ్చు, నీ♦వెఱుఁగవలయు
దీని నెల్లను సతతంబు ♦ మానసమున. ౩౦ 3534

సీ. అధికతర ప్రవా♦హమువలె మరలక వయసు పోఱుచునుండఁ ♦ బరసుఖంబు
నకుఁ గారణంబగు ♦ ప్రకటధర్మమునం దెతనుని యోగింపంగఁ♦దగుఁజుము; సుఖ
హేతువౌ ధర్మంబు♦నే పొందువారలు ప్రజలనంబడుచుంద్రు; ♦ పరమధర్మ
మతియైన జనకుండు ♦ మంగళకరములౌ సకలయజ్ఞముల వి♦స్తారదక్షి
తే. ణాన్వితములుగ నొనరించి ♦ యఖిలపాప
రహితుఁడై స్వర్గమొందె; ధ♦ర్మమునఁ బన్ను
సంగ్రహించుట భృత్యపో♦షణము సరిగ
నొనరుచుట మానవులఁ బ్రోచు♦టను సతండు. ౩౧ 3535

క. సుకృతాత్ముండై స్వర్గము,నకుఁ బోయెను; మనుజులకుఁ ద♦నకు నిష్టములై
సకలశుభదమ్ములై తగి,న కృత్యములఁ నన్నిఁటిని నొ♦నర్చుటచేతన్. ౩౨

తే. తగిన దక్షిణలిచ్చి య♦ధ్వరములెల్లఁ
జేయుటం గృతకృత్యుఁడై ♦ చేరె స్వర్గ;
మమ్మహారాజు బహువిధ♦యాగములను
జక్కఁగాఁ జేసి సుఖతృప్తిఁ ♦ జాలనంది. ౩౩ 3537

క. చిరకాలము బ్రదికియె సుర,పుర మొందెను; వత్స! వినుము ♦ పూర్వులకంటెన్
ధరణిఁ జిరాయుష్యంబునఁ, బరఁగి మహాభోగములను ♦ బలసి సుహితుఁడై.

చ. అమరపురంబుచేరిన మ♦హాత్మునిఁ దండ్రి గుఱించి యెంతమా
త్రము వగఁ జెందరాదు; మన♦తండ్రియు జీర్ణమనుష్యదేహముకా
గ్రమముగనే త్యజించి సుర♦గాత్రసమృద్ధిని బొంది బ్రహ్మలో
కమున విలాస మొప్పఁగనె ♦ క్రాలెడు నాతని కేల చింతిలన్. ౩౪ 3539

తే. ప్రాజ్ఞుఁడవు బుద్ధిశాలివి ♦ బహువిధశాస్త్ర
వేత్తవుగదా తలంప నీ♦విధమునఁ దగు
నీవు తండ్రికిఁగా దుఃఖ ♦ మీవిధమునఁ
బొందవచ్చునె? భరత ! స♦త్పుణ్యచరిత. ౩౮ 3540

క. జనకుఁడు మృతిఁగనె నన్నయు, వని కేఁగె నటంచు నిట్లు ♦ బహువిధదుఃఖా
ర్తిని బొంది యేడ్చు టెప్పుడైన, నను జేయఁగరాని పని ఘ♦నస్వాంతునకున్.

క. ధీరుండవు, వాగ్మివి, నీ, వీరీతిఁగ నేడ్వఁ దగునె ♦ యిఁక స్వాస్థ్యంబున్
జేరుము దుఃఖింపకుమా, జేరి పురీపాలనంబు ♦ చేయుము, భరతా!. ౪౦

క. జనకుఁడు విజితేంద్రియుఁ డి, ప్పనికై నియమించె నిన్ను ♦ భరతా! నను నె
ప్పనియందుఁ బుణ్యకర్ముఁడు, జనకుఁడు నియమించెనో య♦చటనుండెదఁజూ!.

ఆ. అందె నిలిచి పూజ్యుఁ♦డగు తండ్రి యానతిఁ
జేయువాఁడ; దండ్రి ♦ చేసినట్టి
యాజ్ఞ దాఁట నాకు ♦ న్యాయముగా దరిం
దమ! తదాజ్ఞ నీవు ♦ దాఁటఁ జనదు. ౪౧ 3544

ఆ. గౌరవించుచుండఁ♦గా వలయును నీవు, నతఁడె మనకు బంధు♦వగు జనకుఁడు;
గాన ధర్మనిరతుఁ♦డైన యాతనియాజ్ఞ, వని వసించి [1]మనుచు ♦ వాఁడ నేను.

సీ. పురుషకుంజర! విను♦పరలోకమును గోరిన నదిఁ గోరువాఁడు ధ♦ర్మరతిఁగాంచి
ఘాతుకత్వము మాని♦కడుభక్తి గురువాజ్ఞఁ జక్కఁగా నెఱిఁగియా♦చరించుచు
కొనువాఁడుగాఁ దగు; ♦ మనతండ్రి యగు శుభాచారంబు నాదిగొల్పి♦సహజలభ్య
మైన రాజత్వమ్ముఁ ♦ బూనుముకప్పని యాత్మహర్షమ్ముఁడు ప్రభుం♦డైన రాముఁ
ఆ. డనుజుతోడఁ దండ్రి ♦ యాజ్ఞ పాలింపంగఁ
దగు నవశ్యమును వి♦ధంబు దోఁప
నట్లు మాటలాడి ♦ యతని నాశ్వాసించి
యంత నూరకుండె ♦ ననుజుఁ గనుచు. ౪౫ 3546

నూటయైదవ సర్గము సంపూర్ణము.

## ౧౦౬ - వ సర్గము.

రాముని భరతుఁడు మరల యుక్తియుక్తముగఁ బ్రార్థించుచు మాటలాడుట.

క. ఈరీతి నర్థయుక్తము, గా రాముఁడు పల్కి విరతిఁ ♦ గాంచఁగ గంగా
తీరమునఁ బ్రకృతి వత్సలు, నారాముం గాంచి భరతుఁ ♦ [2]డతిచిత్రముగన్. ౧

1 కర్మణా పాలయిష్యామి వనవాసేన రాఘవ-అనిమూలము. 2 ఉవాచ భరత శ్చిత్రం ధార్మికో ధర్మవత్సలః-అనిమూలము.

తే. మాటలాడంగఁ బూనె ధ♦ర్మమతి గాన
ధర్మయుక్తంబుగా; నరిం♦దమ ! భవాదృ
శుఁడు జగంబున నెవఁడు గ♦లఁడు? తలంప
హరఖ మొందింపఁ జాలదు ♦ దుఃఖము నిను. ౭ 3548

క. నిను సంతోషము నంతస, మును గనఁగాఁ జేయలేదు ♦ ముదుసల్లును నె
ల్ల నెఱింగినవాఁడవు గా,వున నినుఁ బూజించువారు ♦ హో శ్రీరామా !. ౨౮

క. జ్ఞానుల నేమియుఁ దెలియని, మానవురీతిగను వారి ♦ మన్నించుటకై
పూనిక సంశయముల నె,న్నో నీతుల నడుగుచుందు♦వో ధర్మమతీ !. 3 3550

[1]సీ. మృతునియందు విరోధ ♦ మేలాగు గిలుగదో యట్లులే బ్రదికియు♦న్నట్టివాని
యందు ద్వేషము లేమి; ♦ యపనిలేనట్టి వస్తువునందు రాగమ్ము♦తొలఁగునట్లు
లున్నవస్తువునందు♦నొగి రాగ మునుపమి యను నిట్టి బుద్ధియే♦యమలసుకృతి
కిని గల్గునో యాతఁ♦డును దేని కేమాత్రమును బరితాపంబు ♦ గనఁడు కాన

తే. నాకు నీచెప్పినట్టులే ♦ శోకలేశ, మైననుఁ లేదు; శోకోక్తు♦లట్టులైన
నేలచెప్పెద వనుదువ♦యేమొ? మనుజ, పాలకా! నామనస్థితిఁ♦బలుకువాఁడ.

క. విను మాత్మానాత్మజ్ఞుం, డనఁదగు నటుఁ డిట్టివైన ♦ వ్యసనమ్ముల పా
లనుబడి శ్రమపడరా దీ,వును సర్వజ్ఞుండవౌటఁ ♦ బొందవు వగలన్. ౫ 3552

క. ఎగి నీవు పొందకున్నను, వగని విధంబునను నీవు ♦ తాపసివయి యుం
డఁగ నెట్లు నైతు రామా!, [2]యగణితమహిమా! మహాత్మ!♦యాశ్రితవరదా!.

తే. సత్యశపథుండవు మఱియు ♦ సర్వవేత్త, వధికధీరుండ వెల్లను ♦ నరసి చూడఁ
గిలవు సత్త్వగుణుండవు ♦ లలితసుగుణ, సిద్ధగోపము! నిన్నెన్న♦నేర నేను. ౭ 3554

క. జనియును నాశముఁ దెలిసిన, ఘనుఁడవు నీవిట్టి సుగుణ♦గణయుక్తుఁడవౌ
టను మముబోంట్లకు నోర్వం,గనురాని మహాపదలును ♦ గలఁపవు నిన్నున్. ౭

సీ. అని నిన్ను బాధింప ♦ నర్హమే! నేను దేశాంతరంబున నుండ ♦ నతికుబుద్ధి
యైన నాతల్లియు ♦ నానిమిత్తమె చేసినట్టి యిప్పాపకృ♦త్యంబు నాకు
సమ్మతమే గాదు; ♦ సాధురక్షక! కానఁ గరుణింపవయ్యా! ప♦న్నాథవయ్యా!
ధర్మపాశమునకుఁ ♦ దగఁ గట్టుపడియున్నవాఁడఁ గావున మహా♦పాపములను

తే. నాచరించి దండ్య ♦ యై యున్నతల్లిని
దీవ్రదండమున వ♦ధింపలేక
యున్నవాఁడ; నే మ♦హోన్నతిఁదగిన శు
ద్ధాన్వయమున జనన♦మంది మఱియు. ౯ 3556

---

1 యథామృత స్తథాజీవన్ యథాసతి తథాసతి, యస్యైషబుద్ధిర్లాభస్స్యా న్న త్వరితప్యేత కేన సః-అనిమూలము. దీనికి వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థమే యీసీసపద్యమునఁ జెప్పఁబడినది. 2 ఈ మూఁడువిశేషణములు భరతుని భక్త్యతిశయద్యోతనార్థము ప్రయోగింపఁబడినవని తెలియఁదగు.

క. పరిశుద్ధకృత్యతతి నాచరించు నదశరధునకు ♦ జనియించి స్వధ
ర్మరతిఁ గని యధర్మిష్ఠము, గురునిందితమునగు పనిని ♦ గూడునె చేయన్. ౯

క. దానినెటు చేయనేర్తును?, మానవపతి వృద్ధుఁ, డమల♦మఖకర్త, మృతిం
గానఁ జనినాఁడు, జనకుఁడు, మానుగ దేశికుఁడు సురస♦మానుఁడు ననియే.

క. సభలో నాతని నిందింప భయంపడి యున్నవాఁడ ♦ బహుధర్మమతీ!
యభయద! ధర్మవిదుండైన భూపతి యెవండో తనదు ♦ నాతిహితముకై.

తే. అర్థధర్మవిహీనమై♦నట్టి యిట్టి, పాపకార్యంబు చేయునా? ♦ ప్రాణులకును
నంత్యకాలము డాసిన♦న్వ్యత్యయంపు, బుద్ధితోఁ చెడుననియుండుఁ♦బూర్వగాథ.

క. మనుజేంద్రుఁ డిటు లకార్యము, నొనరిచి యాశ్రుతిని క్షితిని♦నొగిఁ బ్రత్యక్షం
బును బొందఁజేసెఁ గాదే;, యనఘా' నాప్రార్థనంబు ♦ నారయు మింకన్. ౧౩

సీ. ఇదిగో విషంబుఁ ద్రా♦గెద నన్న కైకేయి కోపముఁ బట్టియుఁ ♦ గోమలిపయిఁ
గలిగిన మోహంబు ♦ వలనను, సాహసమునను, నాయప యొన♦ర్చిన నికృష్ట
కార్యంబు ధర్మవి♦గర్హితంబై యుంట మంచియర్థమును స్మ♦రించి నీవు
దానిని బాపుము; ♦ సూనుండెవం డిలఁ దండ్రి చేసిన యా య♦ధర్మకృత్య
తే. మును మరల్చి సమంచిత♦ముగ నొనర్పఁ
బూనునో వాఁడె కొడుకని ♦ బుధులు తలఁతు
రట్లు చేయఁగఁ దలఁపఁడే ♦ నతఁడు సుతుఁడె
కాఁడు, నీ వట్టిసుతుఁడవె ♦ కావలయును. ౧౪ 3562

క. జనకుఁడు ధీరవిగర్హిత,మును గాపమునైన కృత్య♦మును జేసెను దా
నిని నీవు పొందఁగూడదు, జనకుని మిత్రులను బంధు♦జన ఘనజనులన్. ౧౫

క. ననుఁ గైకేయిని రాజ్యం,బును రక్షింపంగ నీవు ♦ పూనఁగవలయున్
వనవాసమేడ? శాస్త్రం,బననేడ? జటాసమూహ♦మననేడ? కొరా'. ౧౬ 3564

క. ధరణీపాలన మెక్కడ?, విరుద్ధకార్యముల నిట్టి ♦ వీనిని నీవి
ట్లరయక చేయంగూడదు, ధరణీశా! ప్రాజ్ఞ రాజ♦ధర్మ మరసినన్. ౧౭ 3565

తే. మనుజపాలన మభిషేక♦మున నె చేయ,శక్యమగుఁ గాన క్షత్రియ♦జనికి మదిని
దలఁపఁ బట్టాభిషేకంబు♦ధర్మములను, బ్రథమధర్మము గద రఘు♦రామచంద్ర!

సీ. క్షత్రబంధుఁడెవండు ♦ కన్రు భోగత్యాగయుతమౌటఁ, బ్రత్యక్ష♦హితఫలమగు
పాలనధర్మంబు ♦ వదలి యప్రత్యక్షమై దుర్నిరూపంబె ♦ యగుచు, నంశ
యింపఁగాఁ దగు ఫల♦మియ్యంగఁ దగినదై యెప్పుడో ఫలముల♦నీయఁజాలు
నదియయి, యేప్రమా♦ణావళి నిది తొలి క్షత్రియుండూనంగఁ♦ జనునటంచు
తే. నిశ్చయింపఁగఁబడని మా♦నిహితవృత్తి
నాచరించును? మఱియుఁ గ్లే♦శాదికములఁ

గలుగఁజేయుధర్మంబులఁ ♦ గడఁగి చేయ
వలయుననని గోరుదేని నా♦పలుకుఁబూని. ౨౦॥ 3567

క. ఇల బ్రహ్మక్షత్రియవై,శ్యులు శూద్రులనంగ ఖ్యాతి ♦ నొందిన యీజా
తుల స్వస్వధర్మయుక్తం,బుల నొనరిచి ధర్మయుక్త♦ముగ నేలు మిఁకన్. ౨౧

క. ఇదియును బహుళక్లేశ, ప్రదమా ధర్మంబె యగును ♦ బహుధర్మములన్
గుదిరిన మదిగల పెద్దలు, విదితములగు నాశ్రమముల ♦ బృంహములోనన్.

క. అమరు గృహస్థాశ్రమ ము,త్తమపడిముగ ననిరి గాన ♦ దానిని నేచం
దమున విడువంగ నీకగు?, నమలమతీ! విద్యచే న♦యసున్న నేమన్. ౨౨॥

క. నీకంటెఁ జిన్నవాఁడ న,దేకరణిని బెద్దవాఁడ♦వే యిన్నిట, నో
భూకాంత! నీవు తనరఁగ, నేకరణిని నేను బుడమి ♦ నేలఁగల నిఁకన్. ౨౩

సీ. నేను బాలుఁడఁగద ♦ నీవలె నన్నచో నంతమాత్రమ్మె కా ♦ దఖిలసుగుణ
ములను బుద్ధిని గూడఁ♦దలఁప హీనుండను స్థితియు హీనంబె యీగా♦గతినినున్న
నేను నిన్విడిచిన♦చో నూఱకియునుండఁ జాలను ధర్మజ్ఞ ♦ సాధుచిత్త!
స్వీయధర్మము నను♦ష్ఠించుచు నీబంధుసంతతిఁ గూడి ని♦శ్శత్రుకమగు

తే. తండ్రిరాజ్యంబునంతయుఁ ♦ దగినరీతిఁ
బాలనము చేయుమా యెల్ల♦ప్రజలు మంత్ర
కోవిదులగు వసిష్ఠాది ♦ పావనర్త్వి
జులు యథావిధిగా నిందె ♦ వెలయు వేడ్క. ౨౪॥ 3572

క. అమలమతి! నీకిప్పుడె, సమంత్రకముగాఁగ మేము ♦ సంతసమందన్
క్షమ కధిపతిగా నభిషే,క మొనర్తురుగాక యీరాజ♦గంబులు మెచ్చన్. ౨౬

సీ. జగము లన్నిటిఁ గెల్చి ♦ సొగసుగ దివిజాళి యభిషేకి మొనరింప ♦ నలరు నింద్రు
భంగి మాచేఁ బృథ్వి♦భారంబు పూనంగ నభిషిక్తుఁడ వగుచు ♦ నఖిలజనులఁ
బాలింపఁగా రమ్ము ♦ చిత్తసంబునకింత; సురమానులయుఁ బితృ♦వరులయు ఋణ
ములను దీరుచుకొని ♦ ఖలులైన రిపులను నిశ్శేషముగఁ జంపి ♦ నెయ్యురకును

తే. సకలవాంఛల నొసఁగుచు ♦ జగతినన్ను
నీవె పాలింపుమా యిప్డు ♦ నీమహాభి
షేకమును గాంచి నీప్రియ♦స్నిగ్ధులోగిని
సంతసింతురుగాక యో♦సరసధిషణ !. ౨౮॥ 3574

క. తానకశత్రువు లిపుడే, వేవే పదిదిక్కులకును ♦ భీతిం గనుచుం
బోవుదురుగాక; పురుషవ,రా! వినుమా!, నాదుతల్లి ♦ యందిననిందన్. ౨౯

ఆ. తుడిచివైచి పూజ♦తుఁడగు తండ్రిని బాప
మునను బడకయుండ ♦ మనుపవయ్య !

నేను శిరము సోఁకఁ♦గా నమస్కారమ్ము
చేసి వేఁడుకొనెదఁ ♦ జిత్తగింపు. ౩౦౫ 3576

క. భూతములపై మహేశ్వరుఁ, డేతీరున గరుణ యునుచు ♦ నీవును బంధు
వ్రాతములయందు నట్లే, ప్రీతిని దగ నునుపవలయు ♦ వేయు నిఁక నేలా. ౩౧

క. నావిన్నపంబు దీనిని, నీవును వినకునను బ్రోసి ♦ యిఁక వనముల కే
పోవుదువే నినుఁ గూడియె, నే వనముల కేగుదెంతు ♦ నిజ మిది రామా!.

సీ. ధైర్యవంతుఁడుగాన ♦ దశరథరాముండు భరతుఁ డత్యార్తిని♦బడలుచుఁ దగ
శిరము సోఁకఁగ మ్రొక్కి ♦ గరము వేఁడుచునిట్లుపలుకుచుఁ దనదుకృ♦పంగనంగ
నెంతవేఁడినను బృ♦థ్వీశుని యానతి యందె చిత్తము నిల్పి♦యాయయోధ్య
కరుగుట కేమియు ♦ ననుమతింపకయుండె; జనులెల్ల రప్పు డా♦శ్చర్యమొంది

తే. యతని స్థైర్యంబుఁ గాంచి య♦త్యంతదుఃఖ
హర్షముల నేకకాలంబు♦నందె పొంది;
రతఁ డయోధ్యకు రాఁడని ♦ యార్తిఁ, బ్రతిన
దప్పఁడని మోదమును వార ♦ దాల్చి రెదల. ౩౮ 3579

క. పురజనముఖ్యులు ఋత్విజు, లనుదుగ నిటు ధర్మయుక్తి ♦ లలరఁ బలుకు నా
భరతుఁ గని యేమితోఁచక, కర మతఁడు బొప్పుడుము ♦ గ్రమ్మ నుతింపన్.

ఆ. అట్టిస్థితిని గాంచి ♦ యమాత్యులును వారి
వినుతిచేసి రెల్ల ♦ జనులు రాఘ
వునకు మ్రొక్కి చాల ♦ వినయంబునన్ నేఁడె
రింక రెట్టుటంచు ♦ హితము మాలసు. ౪౧ 3581

నూటయొకటవ సర్గము సంపూర్ణము

---

౧౦౨ - వ సర్గము.

{ భరతుఁడు దశరథుఁడు కామమోహితుఁడని నిందింపఁగా
రాముఁడు కాఁడని చెప్పుట }

శా. శ్రీమంతుండగు లక్ష్మణాగ్రజుఁడు తాఁ ♦ జిత్తంబునం గల్గును
ద్దామా కల్మషభక్తిమై భరతుఁ డం♦తన్ స్తోత్రముల్ చేయ స్తో
త్రామూల్యార్చన మొంది బంధుజనమ♦ధ్యస్థానమం దొప్పి సాం
తా మోదంబలరంగ నిట్లనియె నె♦య్యంబొప్పఁగాఁ గ్రమ్మఱన్. ౧ 3582

క. అనుజా! యిప్పుడు నీచెప్పినవాక్యము దశరథునకుఁ ♦ బృథ్వీపతి మం
దనునకుఁ గైకకు జనియించిన నీకున్ యుక్తమగును ♦ జెప్పెద వినుమా!. ౨

*సీ. పూర్వమ్ము దశరథ♦భూపతి నీతల్లిఁ గైకను బెండ్లాడు ♦ కాలమందు
నీతాత కేకయ♦నృపతి ప్రార్థింపంగఁ గైకకుఁ బుట్టిన ♦ యాకుమారు
నకె రాజ్యమిత్తుఁన♦ప్పకయనియాశుల్కమును ప్రతిజ్ఞయొనర్చె♦మనుజవిభుఁడు
దైవాసురప్రవి♦దారణమందు నీతల్లి గావించిన ♦ యుల్లసులకుఁ

తే. జేయు సేవకు ముదమంది ♦ యాయువిభుడు
నిచ్చె రెండువరంబుల ♦ నెలమి; నంత
నాయశస్విని స్త్రీరత్న♦మైన నీదు
తల్లి దశరథుచే శప♦థంబు జరపి. ౪॥ 3584

క. వరములరెండిటిఁ గోరెను, భరతా! యందొకటి నీకుఁ ♦ బట్టము గట్టన్
ద్వరగా నన్నుం బంపను, నరణ్యములకొకటి నిట్టు ♦ లడిగె వరములన్. ౫॥

క. వరముల వాని నొసంగెను, ధరణీశుం డామె పనుపు ♦ తప్పక యపుడే;
పురుషవరా! జనకుండిటు, వరముల నిచ్చుటను జేసి ♦ వనభూములలోన్. ౬॥

తే. నాల్గుపదివత్సరములుండ ♦ నాకు నాజ్ఞ
యిచ్చె నాజ్ఞను బొందిన ♦ యేను దండ్రి
పలుకు సత్యము గావింపఁ ♦ దలఁచి నిలిచి
యెవరు చెప్పిన వినకయె ♦ యింతి సహజ. ౭ 3587

క. కలిసియె నిర్జరవనభూ,ముల నిలువఁగ వచ్చినాఁడ; ♦ భూపతితిలకా!
యల తండ్రియాజ్ఞ చొప్పున, నిలాధిపతి వగుచు జనకుఁ ♦ డిచ్చినయాజ్ఞన్.

క. ఋతమై చెలఁగం జేయుము, హితమటు లొసరింపుటింక ♦ నిప్పుడు నీవున్
బితరుని ఋణమునుండియె, యతివేగ విముక్తుఁ జేయ♦వయ్యా! తగఁగాన్.

క. నామాటఁ బట్టి యీవిధి, గా నునమున నెన్నిచేసి ♦ కడుధర్మవిదున్
భూమీశుని నీతల్లిని, బ్రేమమునన్ వెలయఁజేయు ♦ వేగమ భరతా!. ౧౦

సీ. గయయందుఁబితృతృప్తి♦కం యాగమును జేయు మనుయశస్వియసంగఁ♦వనదగ
వినిపించినకథయు ♦ వినఁబడుచున్న దేకాదె పున్నామదు♦ర్గతినినుండి [యుఁడు
జనకునిఁ గాచుట ♦ జనకుని పేర నిష్టాపూర్తముఖముల ♦ సరిగఁ జేసి
పరలోకమున సుఖం♦పడఁగఁ జేయుటఁ బుత్త్రుఁడను పేరుసుతునకుఁ♦దనరెనుగుణ

తే. వంతులును విద్యగలిగిన♦వారు నైన
కొడుకు లెందఱో కలుగంగఁ ♦ గోరవలయు

---

* వివాహకాలమునందే కైకకొమరునకు రాజ్యము లభించునట్టి ప్రతిజ్ఞ జరగఁగా మరలఁ గైక వరముల నేలకోరె ననఁగాఁ జిన్నతనమున నాశపథము జరగినందున మఱచి యీవరములను గూడ దాసి స్మృతికిఁ దేఁగా నడిగెనని వ్యాఖ్యయందు వ్రాయఁబడినది. ఇది గాథగానఁ దెనుఁగునఁ జెప్పఁబడలేదని యెఱుంగవలయు.

వారిలో నొక్కఁడై నఁ బోవఁ గలఁ డలఁగు
నా గయాక్షేత్రమునకని ♦ యూఁగయుండు. ౧౩ 3591

క. మును చెప్పఁగాదె, దానిన్, వినియేయున్నాము గాదె; ♦ పృథ్వీశసుతా!
మనుజవరా! రాజర్షులు, మనముల నూహించి యిద్ది ♦ మంచి దనిరి సూ!.

క. కనుకన్ జనకుని నారక,మునుండి గావుము కుమార! ♦ ముఖ్యజనులతో
డను నాయయోధ్యకును వే, చనుమా శత్రుఘ్నుఁగూడి ♦ త్విప్రాదివిజులతోన్.

క. జనులను బాలింపుము జా, గొనరింపక నేను నిపుడె ♦ యుర్వీసుత నీ
యనుజన్ముఁ గూడి దండక, యను వనికిం బోవువాఁడ ♦ ననుజా! భరతా!.

క. మనుజులకు రాజవగుమా, వనమృగముల కేను జక్ర♦వర్తి నగుదు నీ
వును వేగ పురికిఁ జనుమా!, వనములఁ కేఁ బోదు నిపుడె♦ప్రముదముచెలఁగన్.

క. భరత! సితచ్ఛత్రము నీ, శిరమున భాస్కరకరాళి ♦ చేరకయుండం
ద్వరఁ బాలఁదోలు నీడను, గరమ్ము చల్లనగు దానిఁ ♦ గల్పించెడిఁ జూ!. ౧౮

క. వనమున నుత్తమమగు భూ, జనికరములదైన యట్టి ♦ ఛాయను నేనున్
దనివారఁ బొందుచున్ సుఖ,మున నుండెదఁ జుమ్ము, న్యాయ♦మును జేయంగన్.

ఆ. సరసబుద్ధియైన ♦ శత్రుఘ్నుఁడును లక్ష్మ,ణుండు తలఁపఁ బ్రియస♦ఖుండు నీకు
నాకు నున్నవారు ♦ నల్వురమును బర,స్పరసహాయముననె ♦ జనకుపలుకు.

ఆ. జగతిలో నసత్య♦ముగ నుండకుండంగఁ
జేయుదము కుమార! ♦ చిత్తమందుఁ
జింతఁ బూనవలదు ♦ చెప్పిన గూపల్కు
పరసబుద్ధిఁ దలఁపు ♦ సాధువనుచు. ౧౯ 3599

నూటయేడవ సర్గము సంపూర్ణము.

---

౧౦౮ - వ సర్గము.

చార్వాకమతము నవలంబించి జాబాలి రాముని రాజ్యము చేయుమని చెప్పుట.

క. అనుజుని నాశ్వాసించెడు, వినకుల వల్లభుని ధర్మ♦హితు శ్రీరామున్
గని వైదికమగు ధర్మ, మ్మునకు విరుద్ధమగు మార్గ♦మును బూని తగన్. ౧

క. పలికెను జాబాలియు రఘు,కులమండన! మహితబుద్ధిఁ ♦ గూడి మహోస్థై
ర్యలలితుఁడవై నవాఁడవు, తలఁప నిరర్థకము బుద్ధి♦ధర్మం బిదియా. ౨ 3601

క. ధరణిన్ సామాన్యుండగు, పురుషునకుం బోలె నిట్టి ♦ బుద్ధియు నీకున్
సరియే తోఁచుంగా కీ, పరమమనీషయును నీకు ♦ భవ్యవిచారా!. ౩ 3602

క. ఎవ్వని కెవ్వఁడు బంధుం, డెవ్వనికిని దేనిచేత ♦ నేమిగలుగునో
యివ్వసుధఁ బ్రాణియొంటిగ, నిప్పటిలున్ జచ్చునట్లె ♦ నియత మిదియె సూ!.

సీ. కావున నెవఁడు జ♦గంబునఁ గలిగండ్రుఁగాని తడాసక్తుఁడై ♦ యుండునో యతఁ
డిని వెఱ్ఱివానిఁగా♦మనమునఁ దలఁపుచూ యొక్కనరుండు వే♦ఱొక్కగ్రామ[చి
మునకుఁబోవుచుమార్గ♦మునసాత్మవిశ్రాంతికయియొకానొకచోట♦క్షణము నిలి
మఱునాఁడు పయనమై ♦ మఱియొక్కచోటికిఁ జనియెడిగీతిని ♦ మనుజులెల్ల

తే. నుర్వి సంసారయాత్ర చే♦యుచును నడుమ
నిలుచు తావులవలె జన♦నిని జనకుని
ధనమునుం బొందుచున్నారు ♦ కనుక నట్టి
వారిపయి సజ్జనులు ప్రీతిఁ ♦ బడయ రెపుడు. ౬ 3604

క. మనుజోత్తమ! మతివైభవ,మునఁ దగుదువు నీవు పిత్ర్య♦ము శర్మకరం
బునగు రాజ్యము విడుచుచు, ఘనదుఃఖనికేతనంబు♦గాఁ గన్పడుచున్. ౭

క. తరుణమున కనుచితంబయి, నిరత ముపద్రవము లొప్ప ♦ నెగడెడు దీనిన్
సరియౌనే కుపథమ్మును, బరిగ్రహించుటయు నీకుఁ ♦ బల్కుము రామా!. ౮

సీ. సంపత్సమృద్ధిచేఁ ♦ బెంపు నొందెడు నయోధ్యకుఁ జని నీవు ప♦ట్టాభిషేక
ము జేసికొనుము చ♦క్కని నియమంబున నేకవేణి ధరించి ♦ యెపుడు భర్త
నెదురుచూచెడు సతి ♦ యింతిచందంబున నగరాధిదేవత ♦ సొగసు మీఱ
నెదురుచూచుచున్న ♦ దెల్లవిధంబుల రాజకుమార! య♦ర్హంబులైన

తే. రాజసుఖములఁ గనుచు స్వ♦ర్గమున నింద్రు
పగిదిఁ బురమున విహరింపు ♦ పార్థివేంద్రుఁ
డైన దశరథుఁడోడ నీ ♦ కరయ నింతె
యేని సంబంధమే లే ద♦హీనశౌర్య!. ౯ 3607

క. అతనికి నీతోడను బం,ధుతయేమియు లేదు నేన్ప♦తోఁ దలఁచిన నా
క్షితిపతియె వేఱు నీవును, మఱి నెన్నిన వేఱు నాదు♦మాటను వినుమా.

క. ఒనరింపుము, యివ్విధమున, వినుమా! ప్రాణికిని దండ్రి ♦ బీజము మాత్రం
బె నరాధిప! కారణమిది, యనఁదగు నత్యల్పమనుచు♦నంబ ఋతువునన్.

క. ధరియించు శుక్లశోణిత, వరవస్తుద్వయమె యెల్ల♦ప్రాణులకగు సు
స్థిరకారణ మిద్దాననె, పురుషుఁడు జన్మించుచుండు ♦ భూలోకమునన్. ౧౧

సీ. ఎచటి కాక్షితిపతి ♦ యేగంగఁ జనునో యచ్చటికేగినాఁడు సూ♦జనపతిసుత!
యతఁడు భూతంబుల♦యందు లయించినవాఁడు విశేష మి♦ప్పట్టున నిసు
మంతయు లేదు; దే♦హాంతము గలవారి కిది స్వభావమ్ము; నీ♦వే నిజంబు
కాని సంబంధంబుఁ ♦ బూని శ్రమింపడు చున్నావు సిద్ధమై ♦ యెప్పుడుసుఖ

తే. మును దొలంగుచు నెవరర్థ♦మును గ్రహింపఁ
గాని ధర్మాచరణమునఁ ♦ గాని నిరతు

లగుదురో వారిఁ గాంచియే ♦ నధికదుఃఖ
మొందుచున్నాఁడ నిశ్చయ♦మో సుశీల!. ౧౧ 3611

క. విను ప్రత్యక్షసుఖంబుల, ననయముఁ దా రనుభవించు♦నట్టి యితరులం
గని నేను శోక మందను, గనుఁగొనఁదగుఁ దగినయట్టి ♦ కారణవితతిన్. ౧౨

సీ. అర్థధర్మసమార్జ♦నాచరణాయత్తు లిటు దుఃఖమొంది తా♦రెల్లఁ జెడుట
యేగాక చచ్చియు ♦ నెల్లదుఃఖంబులఁ బొందుదు రిది నిజ♦ముగఁ జెలంగు
నష్టకాప్రత్యాబ్ది♦కాఖ్యలుగల శ్రాద్ధములను లోకమున జ♦నులు గడంగి
చేయుచున్నారు నీ♦చిత్తమునం జూడు, మందు నన్నంబు వా♦రనుభవింపఁ

తే. దగిన దాని నితరులకుఁ ♦ దగ వ్యయించి
తారె కైకొన్న నాశంబు ♦ నొరఘువర!
మృతుఁడు తినఁగలఁడే యన్న ♦ మేమియైన
వానికై యొరులకుఁ బెట్ట ♦ వ్యర్థమె గద. ౧౩ 3613

క. వినుమా! యొక్కండు భుజిం, చినయది వేఱొకని మేనఁ ♦ జెందున యేనిన్
మనుజుం డొకఁడు విదేశం, బునకేగిన వానిఁ గూర్చి ♦ పుత్రప్రముఖుల్.

ఆ. శ్రాద్ధభోజనములు ♦ సలుపంగవచ్చునే, యద్ది వారిదారి♦కైన బత్తె
మునకుఁ బనికివచ్చు ♦ ననవచ్చునే గద, యైన నద్ది యట్టు ♦ లగుట లేదు. ౧౫

సీ. అట్టులే మృతులగు ♦ నట్టివారికి నది యాహారమగుటయు ♦ ననృతమగును
గాన నారాధింపు ♦ కడఁగి నిర్గమముల దానముల్ చేయు మ♦ధ్వరమొనర్పు
తపముసేయుము ప్రయ♦త్నమున నుపోషణముఁ దృజింపుమయంచు♦నలఘువిత్త
సంగ్రహణమునఁ గు♦శలమతుల్ గ్రంథదానముల్ చేయింపఁ♦దలఁచితదను

తే. సారముగ గ్రంథములు వ్రాసి♦నారు రామ
మహితబుద్ధివి జనకుని ♦ మాటరీతిఁ
జేయఁదగునని మదిని నెం♦చిన సుబుద్ధి
వీవు లేదిఁకఁ బరలోక♦మే యటంచు ౧౬ 3616

ఆ. నిశ్చయించుకొనుము ♦ నీవు ప్రత్యక్షసి
ద్ధమ్ము రాజ్యభోగ♦తతి గ్రహింపు
మిఁకఁ బరోక్షసుఖము ♦ నిచ్చుచున్న పితృవాక్కి
పాలనము వెనుకకు ♦ వలయుఁ ద్రోసి. ౧౭ 3617

క. విను ప్రత్యక్షంబున క, న్నను నధికము లేదను సుజ♦నగణాభిమతం
బనఁదగిన బుద్ధిఁగొని తమ్ముని ప్రార్థనమునను రాజ్య♦మును గైకొనుమా !.

నూటయెనిమిదవ సర్గము సంపూర్ణము.

## ౧౦౯ - వ సర్గము.

—జాబాలిమతమును నిరాకరించి రాముఁడు వైదికమతమును స్థిరపఱచుట.—

క. ఋతబుద్ధులలో నగ్రుఁ, డతఁడు, క్షితిపాత్మజుఁ డాముని యిటు ♦ చెప్పినపలుకుల్
మతినెన్ని వినియు వైదిక, మతమునఁ గల యధికభక్తి♦మై స్థిరబుద్ధిన్. ౧

చ. మునివరుఁ గాంచి యిట్టులను ♦ మోమున సుస్మిత మంకురింప నా
కును బ్రియమైన రాజ్యమును ♦ గోరియె యయ్యది సిద్ధినొందఁ జె
ప్పిన పలుకిద్ది కృత్యమని ♦ వింతగఁ దోఁచెడుఁగాని నెమ్మనం
బునఁ దగ నెంచఁ జేయుటకుఁ ♦ బూనఁగ రానిదె సుమ్ము సువ్రతా!. ౧౺

క. హితమువలెఁ దోఁచుఁగాని య, హితమే యగుఁ బిదప దుఃఖ♦మే కల్గును; నీ
మతమునఁ దగి పాపాచా, రతతిని గొని పాడిలేని ♦ ప్రాకృతుఁ బురుషున్. ౨౺

క. ధరణింగల సత్పురుషులు, పరికింపరు సన్నలను ♦ బాటింపరు నూ!
పురుషుని సజ్జనుఁడని దు,ష్టరతుండని యెట్లు తెలియ ♦ శక్యం బనెదో. ౩

సీ. ఇతఁడుసత్కులజాతుఁ♦డితఁ డసత్కులజాతుఁడనియు వీరుండితఁ♦డనియుఁ బురు
షుఁడు గాని యితండని ♦ కాని శుద్ధుండని యపరిశుద్ధుండని ♦ యతని యతని [ప్ర
యాచారమే తెల్పు; ♦ నార్య! నేదూష్యుండనగుచుఁ బూజ్యునిరీతి♦నగపడుచును
శుచిహీనుఁడనె యయి ♦ శుచిగల యటులుండి శిష్టలక్షణములఁ ♦ జెందినట్టి
వాఁడనై యవిలేని♦వానివలెం దగి శీలయుక్తునిరీతిఁ ♦ జెంది దుష్ట

తే. శీలుఁడనె యయి శుభదమై ♦ ప్రాలు వైది
కంబయిన ధర్మమును మాని ♦ కర్మవైది
కక్రియల వేదవిధుల నిక్కముగ మాని
విశ్వసంకరకరమయి ♦ విమతమగుచు. ౪౺ 3623

క. కనఁబడు నీచెప్పిన వా,క్కునఁ గల్లు నధర్మమును ద♦గుం జేయంగా
నని, ధర్మమనియుఁ బూనిన, వినుమా లోకమున నెందు ♦ విమతాచారున్. ౬

తే. లోకదూషకుని న్నన్ను ♦ నేకరణిని
గార్యమి దకార్య మిదియని ♦ కడు నెఱుంగు
తెలివిగల యెవ్వఁడేనియుఁ ♦ దలఁచునొక్కొ
గొప్పగా నెవ్వఁడును నను♦గొనఁడు సుమ్ము!. 3625

సీ. గౌరవహానియే ♦ కాదు నావనవాస నియమప్రతిజ్ఞను ♦ నేను వదలి
యపరోక్షమును మాను♦మని చెప్పినట్టి యీ యతిదుష్టవృత్తిని♦నాశ్రయించి
వర్తింతు నే నిఁకె♦వ్వని కుపదేశింతు; నేను జెప్పినదాని ♦ నీవు జరపు
మని; యేయుపాయంబు♦నను స్వర్గమొందుదు? నిట్లుచేయుదు నేని♦యెల్లజనులు
తమకుఁ దోఁచినభంగిఁ ♦ దారు వర్తింతు రదేలన భూపతి ♦ యెవ్వఁడేని

తే. యెట్టి యాచారమూనునో ♦ యట్టిదాని
బూనుదురుగాదె జనులెల్లఁ ♦ గాన నాకె

కాక లోకులకెల్ల స్వ♦ర్లోకహాని
కలుగుఁ గావున నీమాట ♦ గాదు శుభము. ౯ 3626

సీ. తగుభూతదయయే ప్ర♦ధానంబుగాఁ గల్గి శాశ్వతంబైనట్టి ♦ క్ష్మాపతీంద్ర
వృత్తము సత్యమై ♦ వెలయును, సత్యమే రాజవృత్తంబయి ♦ రాజిలుటను
జనసమూహమ్మును ♦ సత్యంబునందె ప్రతిష్ఠితంబై యుండు ♦ దివిజు లెల్ల
మునులు సత్యమ్మునే ♦ ఘనమని తలఁచిరి గద, సత్యవాది లో♦కమున నలరు
తే. నేని యాతఁడు మోక్షమ్ముఁ ♦ గానఁ జనును
జనులు సర్వముఁ గాంచెదు ♦ సరణి ననృత
వాదిఁ గని భయపడుదురు ♦ వసుధఁ బరమ
ధర్మమగు సత్యమే యని ♦ తలఁపఁబడును ౧౧॥ 3627

క. విను స్వర్గహేతువదియే, యని చెప్పంబడును; లోక♦మందుఁ బ్రభువుగాఁ
దనరును సత్యమె లక్ష్మియు, ననిశము సత్యాశ్రయగనె ♦ యలరున్ మానీ!.
తే. సర్వమునకు నాధారంబు ♦ సత్యమె యగుఁ
బరమగతి దానికంటె లే ♦ దరయ నిదియు
దానయజ్ఞంబులకు హోమ♦తపములకును
సత్యమగును నాధారంబు ♦ సాధువిప్ర!. ౧౩॥ 3629

క. శ్రుతులును సత్యాశ్రయములు, క్షితి నెప్పటికైన విడువఁ♦జెల్లునె ఋతమున్
హితముగ లోకము నొక్కం,డలశయుగతిఁ గాచునొక్కఁ♦డన్వయమునుజూ!.
తే. ఒకఁడు నరకంబునం బడు ♦ నొకఁడు స్వర్గ
తలమునం బూజితుండగు ♦ ధాత్రి నిట్టు
లైహికాముష్మికఫలంబు ♦ లగును సత్య
వంతునకు సత్యవాదియుఁ ♦ బడు నఘమున. ౧౫॥ 3631

సీ. సత్యసంధుండను ♦ సత్యంబు మీఱనే శపథంబుచేసితి ♦ జననితోడ
నిట్టి నే సత్యమై♦యెసఁగు భూపతి యాజ్ఞఁ బాలింపకుందు నె♦ప్పుగిదిఁ జెపుమ;
సత్యప్రతిజ్ఞను ♦ జరపంగఁ గలనేను ధనలోభమునఁగాని ♦ తావకోక్తి
వలనఁ జిత్తమ్మెట్లొ ♦ కలఁతనొందుట గాని యజ్ఞానమునఁగాని ♦ యట్లె తమసు
ఆ. నొందిగాని తల్లి ♦ కుద్యమమునఁ దండ్రి, చెప్పినట్టి సత్య♦సేతు వింకఁ
ద్రెంప నిద్ది నిజము; ♦ తెగి యబద్ధములాడు, వాఁడు చంచలస్వ♦భావుఁడు మఱి.
క. స్థిరమతియు లేనివాఁ డగు, పురుషుం డిడు హవ్యకవ్య♦పుంజంబుల ని
ర్జరులును బితరులు గ్రహియింపరు సుమ్మని మున్ను విన్న♦వారము మానీ!.
సీ. విను సత్యరూపమై ♦ వెలయు నీధర్మమాత్మను గూర్చి వర్తించు♦ననిశమని మ
దాత్మకుఁ దోఁచుచు♦న్నది సాధుజనసమాచరితమై తగిన యీ♦జటలు వల్క
లములు ధరించు భా♦రము సత్యరూపమై చాలు నాధర్మము ♦ సంతరింప
నంగీకృతంబగు ♦ నవనీశధర్మమ్మునం దధర్మము చాల ♦ నమరియుండు

తే. ధర్మమించుకయేయుండు ♦ దానిఁ గ్రూర
మతులు క్షుద్రులు పాపక♦ర్మరతులగ్గు
చాలలుబ్ధులు సేవింత్రు ♦ సాధువనుచు
నేనుమాత్రము విడిచెద ♦ నిజము మౌని!. ౨౦ 3634

చ. మనసున నిశ్చయించుకొని ♦ మానుగ దేహముచే నొనర్చు జి
హ్వను ననృతంబులాడు నరుఁ ♦ డెల్లనఁ గావునఁ బాతకంబు నొ
ప్పును త్రివిధంబుగా [1]మఱియు ♦ భూమియు, దానజమైన కీర్తియుఁ
ఘనతరపౌరుషంబున నె ♦ కాంచిన సద్యశ, మట్లె లక్ష్మియుఁ. ౨౧ 3635

క. ఈనాలుగు సత్యమునం, దే నెలకొనియున్న పురుషు♦నే పొందంగా
మానీ! కోరుచునుండును, మానితుఁడగు పురుషుఁ డతఁ డ♦మరపురి కేగుఁ.

ఆ. అవియు వెంటనంటి ♦ యరుగుఁ గావున సత్య
మాశ్రయింపవలయు; ♦ నరసి యిద్ది
మంచిదనుచు నిశ్చ♦యించి దీనిం జేయు
మనుచు నీవు యుక్తి ♦ యలరుచుండ. ౨౨ 3637

క. పలికితివిగాదె యిపు డ, ప్పలుకులు పూజ్యములె కావు, ♦ ప్రత్యక్షము ని
మ్ముఁగొనుచుఁ బరోక్షమ్మును, వెలికిం ద్రోయుటయు శాస్త్ర♦విధిహిత మెటులా.

క. భరతుఁడు వేఁడినరీతిని, ధరణిం గొనుమంటి వీవు ♦ తండ్రియెదుట నే
నరిగెద వని కని శపథము, లరవడిఁగాఁ బలికి యిప్పు♦డొగి నప్పలుకుల్. ౨౩

క. మనసార విడిచి భరతు వచనమె ట్లొనంగ నేర్తు? ♦ సాధూ! నేనుఁ
జనకునికడ స్థిరశపథం,బును జేసియె యున్నవాఁడఁ ♦ బో సత్యముపై. ౨౪

క. దానికి నాకై కేయియు, మానసమున నధికముగు ప్ర♦మదముం బొందెఁ
నే నట్టి ప్రతిన విడచుట, యానే న్యాయంబు చెపుమ ♦ యార్యశ్రేష్ఠా!. ౨౫

సీ. ఇదియె కర్తవ్యమా ♦ నిది యకర్తవ్యమం చెఱుఁగుదుఁ గావునఁ♦గృత్రిమమతి
యించుకయైన లే ♦ కెప్పుడు శ్రద్ధచేఁ బరిశుద్ధచిత్తత ♦ వని నివాస
మును సల్పుచు నెవన్య♦ములగు నాహారంబులను నియమంబునఁ♦గొనుచు దానఁ
బంచేంద్రియవితృప్తిఁ ♦ బరఁగున ట్లొనరించి పరిశుద్ధసుమమూల♦ఫలవితతులఁ
తే. బితరులకు దేవతలకుఁ దృ♦ప్తి నొనరించి
జనకవాక్పరిపాలన♦మునఁ దనరెడు
లోకయాత్రను నడుపుచు ♦ లోకహితము
గాఁగఁ గాలంబు గడిపెద ♦ క్ష్మాసురేంద్ర!. ౨౬ 3642

1 భూమిః కీర్తిర్యశో లక్ష్మీః పురుషం ప్రార్థయంతి వా-అనిమూలము. కీర్తిః వితరణజనితా ప్రథా. యశః పౌరుషనిబంధనమ్-అని వ్యాఖ్య.

సీ. అష్టకాదుల నుదా♦హరణముగాఁ జూపి కర్మముల్ నిష్ఫల♦కంబు లంటి
మనుజు లీకర్మభూ♦మిని బొందియుండు నందాఁక శుభంబులై ♦ తగినకర్మ
ముల నవశ్యము సేయ♦వలయు నగ్నియువాయు వబ్జారియునువిన♦వయ్య! యిట్టి
కర్మభూమిని బొంది ♦ కావించినట్టి కర్మములకు ఫలముగ ♦ మహితములగు
తే. ననలతను వాయుతను జంద్ర♦తను జెలంగి
కాంచియున్నారు కావునఁ ♦ గర్మములును
నిష్ఫలంబులు గావు; మా♦సి! శతముఖము
లను సురాలయపతితను ♦ గనియె వజ్రి. ౨౮॥ 3643

క. మునివరు లత్యుగ్రతపం,బును నొనరిచి దివిజపురిని ♦ బొందిరనియె; ని
ట్లనలాభతీవ్రతేజుం, డనఘుండగు నామహీశు ♦ నాత్మజుఁ డెంతేఁ. ౨౯॥

క. తను నాస్తికవాక్యములఁ, మునిపతి జాబాలి నొంపఁ ♦ బూనఁగ విని యో
ర్వనురామి నతనిపల్కుల,కు నెదం గడు నేవగించు♦కొనుచుం బలికెఁ. ౩౦

తే. సత్యధర్మపరాక్రమ ♦ త్యాగురాము, రార్చియును మఱి భూతద♦యాతిథేయ
సత్కృతిప్రియభాషలు♦స్వర్గమునకు, మార్గమని పల్కుదురుమతి♦మంతులెన్ని.

సీ. కనుకనె విప్రులు ♦ కలరూపుగా దీనియర్థము గ్రహియించి ♦ యంద త్రైక
మత్యంబు నంది ప్ర♦మాదంబుఁ బొందక శాస్త్రోక్తమైనట్టి ♦ సరణి స్వస్వ
వర్ణాశ్రమాచార♦పటలికిఁ దగినట్టి ధర్మసమూహంబుఁ ♦ దగ సమాచ
రించుచు స్వర్గాది♦కాంచితలోకాళిఁ బడయఁగోరెదరు త♦న్వక త్వదీయ
తే. మతియు వేదవిరుద్ధమా ♦ మార్గమందు
వెలసియున్నది వైదిక♦వేష మీవు
తాల్చి యతిశయనాస్తిక♦త్వ మెసఁ బూని
యిట్టి యతిదుష్టబుద్ధిని ♦ నితరుల కొగి. ౩౨॥ 3647

క. నిరత ముపదేశించుచుఁ, దిరుగుదు వీలాటి నిన్నుఁ ♦ దెలియక యాభూ
వరుఁడు తనచెంతఁ జేరిచెఁ, బరిపరి దూషింతు నిది య♦వైదిక మనుచుఁ. ౩౩

క. శ్రుతిబాహ్యుఁడైన బుద్ధుఁడు, సతతము తస్కరుని భంగి ♦ సంత్యక్తుఁడు సూ!
క్షితినిందు నాస్తికుని దుర్గతికుని నా[1]బుద్ధసమునిఁ♦గా నెంచనగుఁ. ౩౪॥

ఆ. కనుకఁ బ్రజలు నాస్తి♦కుని నవైదికునిగ
సంశయింపవలయు ♦ జ్ఞాని వాని
కభిముఖుండు గాఁగ ♦ నగునె యెప్పటికైన
వినుము నీకుఁ బూర్వ♦మునులు ఘనులు. ౩౫ 3650

1 బుద్ధసమునిగా-ఇట బుద్ధశబ్దము వేదనిందకపరము. అంతియకాని మతస్థాపకుఁడగు బుద్ధుని పరముకాదని తెలియఁదగు.

సీ. నీకంటె శ్రేష్ఠులై ♦ నెగడినవారును బహువిధశుభకర్మ♦పటల మెలమి
నొనరించి యిహలోక♦మును బరముజయించియాకసంబున గ్రహ♦వ్యమలరూప
ములఁ దగి యున్నారు ♦ లలితకాంతులు మీఱఁగావున నే ద్విజుల్♦కడుశుభప్ర
దములగు సాధుక♦ర్మములను యాగాదిహోమకృత్యంబుల ♦ నొగిఁ దపంబు
తే. దానములఁ జేయుదురు; ధర్మ♦తత్పరులయి
సాధుసంగతిఁ దనరి తే♦జమున వెలసి
దానగుణముఖ్యులై యహిం♦సానుకూల
బుద్ధులై నిర్మలులునగు ♦ మునులె ఘనులు. ౩౬ 3651

క. వారలు జగతిం బూజ్యులు, గారే? యని యిట్లు కోప♦కలితుండయి యిం
పార వచియించు స్థిరబలు, నారాముని మహితుఁ జూచి ♦ యాభూసురుఁడున్.

క. వినయమున ననునయించుచు, నను; నాస్తికమతముఁ దెలుపు♦నదియయి సత్యం
బును నగుచు సాధుజనహిత,మును నగు వాక్యముల నుల్ల♦మున నలరంగన్.

సీ. వినవయ్య నాస్తిక ♦ లనుమాటలును నేను వచియింపఁగా లేదు♦వాస్తవముగ
నేను నాస్తికుఁడను♦గాను బరంబును లేదనియును జెప్ప♦లేదు నాస్తి
కమతవాదులతోడఁ ♦ గలియుట గలిగిన వారివాదముల నీ♦వలెనె యాస్తి
కుఁడనయి ఖండింపఁ ♦ గడగుచునుందును, ధర్మసంకటమగు ♦ తరుణమందుఁ
తే. గార్యసిద్ధికినయి నాస్తి♦కత్వమూను
వాఁడనేగాని నేనట్టి ♦ వాఁడఁగాను;
వినుము యాకాలవేళ మెల్లన, యిచటికి
వచ్చుటను నాస్తికోక్తులఁ ♦ బల్కినాఁడ. ౩౮ 3654

క. నినుఁ బురికిన్ మరలుపఁగ,యనంచు నిను సుప్రసన్ను ♦ నొయ్యనఁ జేయం
గను గోరి యిట్లు చెప్పితి, మనమునఁ దలపోయవలదు ♦ మఱియొకరీతిన్. ౩౯

నూటతొమ్మిదవ సర్గము సంపూర్ణము.

౧౧౦ - వ సర్గము.

—వసిష్ఠుఁడు రాముని కోపమును దీర్చి హితముపదేశించి రాజ్యముఁ గొనుమని చెప్పుట—

క. రాముఁడు జాబాలివచ,స్తోమము విని కోపమొందెఁ ♦ దోరంబుగ నం
చామాడ్కి నెఱిఁగి రాముని,భీమాగ్రహ ముడుపఁదలఁచి♦వినయముతోఁ వన్.౧

క. మునిపతి వసిష్ఠుఁ డిట్లను, వినుమా! జాబాలి, జనులు ♦ విలయము గనినన్
జనుదురు-పరలోకమునకు, నని పుణ్యము తరుగ వత్తు ♦ రవనికి ననియున్. ౧

తే. ఎఱుఁగుఁగావున నాస్తికుం ♦ డెట్టులగును
నిన్నుఁ బురికి మరల్పంగ ♦ నెన్ని యిట్టి

పలుకఁ జెప్పినవాఁడు భూ♦పాలతిలక!
వినుము వచియింతు జగమెట్లు ♦ వెలసె నిలను. ౨ 3658

చ. సలిలమయంబుగాఁ దనరె ♦ సర్వము నాదిని, నందు భూమియే
తొలుత సృజింపఁగాఁ బడియెఁ ♦ దోరపుశక్తి స్వయంభువుండుగా
వెలసిన బ్రహ్మయుఁ దివిజ♦వీరులు పుట్టిరి సుప్రసిద్ధుఁడౌ
జలజవిలోచనుండు హరి ♦ చక్రధరుండు వరాహరూపుఁడై. 3 3659

క. జలములనుండియె భూమిని, బలమొప్పఁగ నుద్ధరించె ♦ బ్రహ్మయుఁ జరితా
త్ములను మరీచ్యాదులఁ దన,యులఁ గూడియె జగము నెల్ల ♦ నొగిఁ బుట్టించెన్.

సీ. బ్రహ్మము నాపర♦బ్రహ్మమువలననె వఱలె నాబ్రహ్మప్ర♦వాహరూప
మున నిత్యుఁడౌను ద♦క్కినవారికంటెను జిరకాలముండు స్వ♦స్థితినినుండి
యే మోక్షమును బొందు♦నిట్లగుటనె యాతఁ డవ్యయుండనఁబడు♦నతనివలన
జనియించెను మరీచి♦యను ముని యతనికిఁ గశ్యపుండు జనించెఁ ♦ గశ్యపునకుఁ
తే. దనయుఁ డర్కుఁడు వైవస్వ♦తమను నతని
తనయుఁ డయ్యెను నాతండె ♦ మును జనపతి
యతని కిక్ష్వాకువు జనించె ♦ నతనికిఁ దొలి
మనువె యిచ్చె సమృద్ధభూ♦మినిఁ దగంగ. ౬ 3661

క. అతఁడే యయోధ్యయం దు,న్నతిఁ గను తొలిభూపుఁడని మ♦నంబునఁ గనుమా
యతనికి శ్రీమంతుఁడు కు,క్షితనూజుండయ్యెఁ జాలఁ ♦ గీర్తియుతుండై. ౭

క. అతనికి వీరుండు వికు,క్షి తనూజుం డావికుక్షి♦కిన్ దేజంబు
న్నతశౌర్యముగల బాణుఁడు, సుతుఁ డతనికి దీర్ఘబాహు ♦ శోభితుఁ డగుచున్.

క. అనరణ్యుఁడు స్థిరయశుఁడై, జనియించెను సజ్జనాళి ♦ సముధికుఁడగు న
య్యనరణ్యుఁడు క్షితినేలఁగ, ఘనములు వర్షించుచుండుఁ♦గాలహితముగన్

తే. క్షామబాధలు లేవు, త♦స్కరుఁడు లేఁడు
మందునకునైన నిట్టి య♦మ్మానవపతి
కాత్మజుండయ్యెఁ బృథువు మ♦హాక్షితీశుఁ
డా త్రిశంకువు జనియించె ♦ నతనివలన. ౧౦ 3665

క. ఋతనిరతుఁ డౌటచే నా, క్షితిపతి తనమేనితోన ♦ చేరెను స్వర్గం
బతనికి యువనాశ్వుఁడు సుతుఁ,డతఁడు మహాయశుఁడు విక్ర♦మాధికుఁడయ్యెన్.

క. తనశౌర్యంబున భీకర, దనుజాతుని దుందుమారుఁ ♦ దాఁ జంపుటచేఁ
గనియె నిల దుందుమారా,ఖ్యను దగ మాంధాత యతని♦యాత్మజుఁ డయ్యెన్.

సీ. మాంధాత గనియెను ♦ మహనీయ తేజుఁడై యలరు సుసంధిని♦నాతఁడు ధ్రువ
సంధి ప్రసేనజి♦త్సంజ్ఞుల నిరువురఁ దనయులఁ గాంచె నా♦తనయులందుఁ

బెద్దవానికి నరి♦భీకరుఁడై తగు భరతుండు జన్మించె ♦ బాహుబలము
గల యాతఁడసితునిఁ♦గనియెఁదత్సామంతులగుతాళజంఘులు♦హైహయులును
తే. ప్రబలులతో శశిబిందువుల్ ♦ వైరులైరి
వార నసితుండు మార్కొని ♦ పోరి యోడి
యడవిపాలయ్యె, నంత ర♦మ్యహిమశిఖరి
యందు మునివృత్తి నందె న♦మ్మరిభయమున. ౧౭ 3668

క. ఆతనిభార్యలు గర్భిణు, లై తనరిరటంచు వినికిఁ ♦ యందొక్కతె పా
పాతతమతియై సవతికి, నీతఁటి గర్భంబు చెడుట♦యే మేలనుచున్. ౧౮ 3669

క. గరళము గలిపిన భక్ష్యో, త్కరమును దినని చ్చె; భృగుని ♦ ఘనవంశమునన్
బరఁగెడి చ్యవనుఁడు హిమభూ, ధరమునఁ గాపుండె నట్టి ♦ తగుణమునందున్.

సీ. గరళముఁ దిన్నయా♦కాళింది యసితుని భార్య యాచ్యవనుని ♦ పరిసరమున
కరిగి మ్రొక్కిన నామె♦నాత్మజుఁబడయంగవరముఁగోరెడిదాని♦బ్రాహ్మణుండు
కని దేవి! నీకు స♦కలజగద్విఖ్యాతుఁ డతిశయమతియు ధ♦ర్మాత్ముఁ డుత్త
మప్రవర్తకుఁ డరి♦మండలహంతయు వంశకర్తయునగు ♦ వరసుతుండు
తే. కలుగునని పల్కె నామెయు ♦ నలరి మునికి
భక్తి వలగొని పూజించి ♦ పరమతుష్టుఁ
జేసి వీడ్కొని తనయిల్లు ♦ చేరి పద్మ
పత్రనయనుని శతధృతి♦ప్రతిముఁ దనయు. ౨౨ 3671

క. కనియెను దత్సతిగర్భం, బు నడంపఁగ సవతి గరళ♦ముం బెట్టెఁ గదా
తనయుఁడు విషసహితుండై, జనియించుటనతఁడుపొందె♦సగరాహ్వయమున్.

సీ. సగరుఁడు యజ్ఞదీ♦క్షఁగొని హయమునదృశ్యము కాఁగ దానిని♦నరయుటకయి
పర్వకాలంబున ♦ వారివేగమ్మునఁ బ్రజలకు భయమును ♦ బర్వఁజేయు
సంభ్రమఁ దనయాత్మ♦జన్ములచేఁ ద్రవ్వఁగా జేసె నట్టి భూ♦కాంతునకును
నసమంజుఁడను పుత్త్రుఁ ♦ డలరెనంచని విన్నవారముగద వాఁడు ♦ పాపకర్మ
తే. నిరతుఁడై యుంటచేత వా♦నిని సగరుఁడు
ప్రాణములతోడ నడవికిఁ ♦ బంపె నతని
కంశుమంతుండు శౌర్యధ♦నాఢ్యకుండు
తనయుఁడయ్యె దిలీపుండు ♦ తత్తనయుఁడు. ౨౫ 3673

క. అతఁడు భగీరథునిం గనె, నతఁడు కకుత్స్థుఁ గనె వాని ♦ యశమున మీరీ
క్షితిఁ గాకుత్స్థులనంగాఁ, బ్రతిలేని యశంబు గని, వి♦రాజిలితి రిటుల్. ౨౬

తే. ఆకకుత్స్థుని యాత్మజుఁ ♦ డయ్యె రఘువు
రాఘవులుగాఁగ మీర లా♦రఘువువలన
నైతి; రతనికిఁ దేజస్వి♦యైన తనయుఁ
డొకఁడు కలిగెను బలు పేరు ♦ లొప్పుచుండ. ౨౭ 3675

సీ. తెలిపెద నట్టిపే♦రులఁ బ్రవృద్ధుండని పురుషాదకుండని ♦ ధరణి మఱియు
నతఁడు సౌదాసుఁ డం♦చనియుఁ గల్మాషపాదుండనియును ఖ్యాతి♦తోఁ జెలంగె
నతనికి శంఖణుం ♦ డనువాఁడు జన్మించి తత్పరాక్రమమొంది ♦ తండ్రితోడ
ననిచేయుచుఁ గ సస్సై♦న్యముగఁ జంపంబడె; నాశంఖణునకు వీ♦ర్యాధికుండు

తే. మఱియు శ్రీమంతుఁడైన యా♦త్మజుఁడు గల్గె
నాతఁడొందె సుదర్శనా♦హ్వాయము జగతి
నతని కగ్నివర్ణుండయ్యె ♦ నాత్మజన్ముఁ
డతనికిఁ శీఘ్రగుండయ్యె ♦ నాత్మజుండు. ౩౦ 3676

సీ. అతని పుత్రుఁడు మరు, ♦ వతఁడు ప్రశుశ్రుకుఁ గనియె, నాతనికిని♦గాంతిమంతుఁ
డగు నంబరీషుండు ♦ నెగడెఁ దనూజుఁడై యంబరీషునకు స♦త్యప్రతాప
సహితుఁడౌ నహుషుండు♦జన్మించె నా[illegible]తిధార్మికుండయ్యె♦నతనికి సుతుఁ;
డజ సువ్రతులనంగ ♦ నాత్మజు లిద్ద[illegible] యజఘమూర్తికిఁ గల్గి;♦రజుని కతుల

ఆ. ధర్మనిరతుఁడైన ♦ దశరథుఁ డాత్మజుఁ, డయ్యె రాముఁడనఁగ ♦ ఖ్యాతిగన్న
యట్టినీవె యతని ♦ కగ్రపుత్రుండవు, పెద్దవాఁడ వగుటఁ ♦ బృథివి కెల్ల. ౩౩

క. పతివౌదువు నీవే భూ,పతివర్యా! నీది కానఁ ♦ బడయుము రాజ్యం
బతులము; మనుజులనెల్లను, నతిధర్మము మీఱ నేల ♦ వయ్యా! యింకన్.

క. వినుమా యిక్ష్వాకుకులం, బున నందఱియందు జ్యేష్ఠ♦పుత్రుఁడె నేఁ జె
ప్పినరీతి భూపుఁడగుఁ జుమ్మ!, కనిష్ఠునకు జ్యేష్ఠుఁడుండఁ♦గా రాజ్యంబున్. ౩౪

ఆ. ఇచ్చినదియెలేదు ♦ జ్యేష్ఠునికే యభి,షేకమగుచునుండు ♦ స్థిరయశా! మ
హాత్మ! జ్యేష్ఠసుతుఁడ ♦ వగు నీకు రఘువంశ, ధర్మ మాచరింపఁ♦దగును జుమ్ము.

క. ఘనమైన యిట్టి ధర్మం, బును జెఱుపఁగ నీకుఁ దగునె ♦ మును కొని నిన్నుం
గని యితరు లెల్ల దాసిన, గొనరే దృష్టాంతముగను ♦ కువలయనాథా!.

క. జనపదసముదయ మలరఁగ, ఘనరత్నాద్యఖిల వస్తు♦కాంతము గలమే
దిని నెల్లఁ దండ్రివలెనే, యనిశము పాలింపవయ్య! ♦ యార్యశశాంకా!. ౩౭

నూటపదియవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౧ - వ సర్గము

వసిష్ఠుఁడు గురుమతమును విడనాడరాదని రామునకుఁ జెప్పుట.

చ. క్షితిప! పురోహితుండగు వ♦సిష్ఠుఁడు రామున కిట్లు చెప్పె యీ
యతపితృవాక్యపాలనమె ♦ యర్హ మటంచు చతఁ డెంచి యూరకు
న్నతెఱఁగుఁ దా నెఱింగి రఘు♦నాయకుతోడను ధర్మయుక్తమై
హితమగువాక్యముల్ మరల ♦ నెంతయుఁ బూనికఁ బల్కె నివ్విధిన్. ౧

సీ. కాకుత్స్థ! జన్మముఁ♦గన్నట్టి యొక్కొక్క మనుజున కాచార్యుఁ♦డును జనకుఁడు
జననియు ననుమువ్వు♦రును గురువులుగదా జననియు జనకుండు♦తనువుమాత్ర
మిలను బుట్టించు వా♦రలు గురుం డన్ననో జ్ఞానమొసంగును ♦ గాన గురుఁడు
తల్లిదండ్రులకంటెఁ ♦ దగు గొప్పవాఁడుగా నీకు నీతండ్రికి ♦ నేనె గాద
తే. తలఁప నాచార్యుఁడను బరం♦తప! మదుక్తి
రీతిగా నీవు ధరఁ బ్రవ♦ర్తింతువేని
దాఁటకుందువు సుజనావృ♦తమగు పథము
రఘుకులార్ణవకువలయ♦రాజ! రామ!. ౪ 3684

క. ధరణీసురులును బౌరులు, ధరణీశులు వైశ్యులరయఁ ♦ దానకులు సుమీ!
పరికించి వీరిఁ గాచుట, పరధర్మము దాని నడుప♦వలయుం దండ్రీ!. ౫ 3685

ఆ. ఇట్లు చేయుచుందు♦వేని సన్మార్గంబు, దాఁటకుందు వీవు; ♦ ధర్మశీల!
వృద్ధురాలు తల్లి ♦ విశ్రుతభక్తి నా, జననిసేవ చేయఁ ♦ జనును నీకు. ౬

క. జననీ సేవాకృత్యం, బును మానుట యుక్తమగునె ♦ పూజ్యమతీ! యా
వనితామణి చెప్పినచొప్పున నడచిన దాఁటకుందు ♦ బుధమార్గంబుల్. ౭

తే. సత్యధర్మపరాక్రమ♦శాలి వీవు
నిన్ను భక్తిని బ్రతిమాలు♦చున్న భరతు
పలుకు సార్థకముగఁ జేయఁ ♦ గలుగుదేని
యాత్మభూతుని భరతు నీ♦యనుజు భక్తు. ౮ 3688

క. ఋతధర్మసహాపశీలము, నతిక్రమింపక యె యుందు ♦ వని మధురవచ
స్తతి నాచార్యుఁడు పల్కిన, స్మితముఁ పలరఁగ రఘుకులాబ్ధి ♦ శీతాంశుండుర్.

క. మునిపతి నాసీనునిఁ దమిఁ, గనుఁగొని పచియించె మౌని♦కాంతా! వినుమా
జననీజనకులు తొలుతన్, జనయునిఁ బడయంగఁ గోరి ♦ తా రతిభక్తిన్. ౧౦

—రాముఁడు గురువుమాటకంటెఁ దండ్రిమాటయే శ్రేష్ఠమని చెప్పుట.—

సీ. వ్రతములు దగు సుప♦వానాదివిధులను నొనరించి తనయుండు♦జనన మొంద
స్తన్యం బొసంగి య♦థాశక్తి నన్నాంబరాదు లొసంగి యిం♦పైనయట్లు
జలకమార్చుచుఁ దమిఁ ♦ బలుకుల నేర్పుచుఁ బెంతురు గాదె య♦విధ్ధులకెల్ల
బదులొనర్పఁగ నెట్టి♦వారి కశక్యంబె కనుకనె గురువుల♦కంటెఁ దల్లి
తే. దండ్రు లధికులౌ దశరథ♦ధరణివిభుఁడు
నన్నుఁ గన్నట్టి తండ్రిగా♦న నతనికయి
నేనొనర్చినప్రతిన యో ♦ మౌనిచంద్ర!
నిష్ఫలంబుగఁ గారాదు ♦ నిశ్చయ మిది. ౧౧ 3691

క. కనుకన్ జననీవాక్యం, బును సహజుని పలుకుఁ జేయఁ♦బోలదు; యుక్తం
బును గాదని చెప్పంగా, విని భరతుఁ డుదారబుద్ధి ♦ వే మది కలఁగన్. ౧౨

క. కలగుండుపడుచుఁ జెంతను, బలుకంగా లేకయున్న ♦ వాని సుమంత్రుకా
గలఁగిన మదిగలవానిం, గలయం గన్గొనుచు సూత! ♦ కడువేగముగన్. ౧౨

క. ధర నిట దర్భలఁ బఱువుము, పరుండియుండెదను రామ ♦ పతి కడ్డముగాఁ
బరమముదంబును శ్రీరఘు,వరుఁ డొందినదాఁక భూమి ♦ వదలం జుమ్మీ!. ౧౩

సీ. తనయొద్దనున్న వి ♦ త్తంబెల్ల పడ్డికై యప్పిచ్చినట్టి ధ ♦ రామరుండు
ధనమును గొన్నవాఁ ♦ డనువుగ నీయమి సతని ద్వారమ్మున ♦ కడ్డముగ ని
రాహారుఁడై ముఖ ♦ మాచ్ఛాదనము చేసికొని పరుండినరీతి ♦ గనె యిచటను
రాముఁ డయోధ్యకు ♦ రాకుంచునందాఁక నేను బరుండియుం ♦ డెదను బర్ణ

తే. శాలవాకిట పఱియు భో ♦ జనము మాని
వదనమును గుడ్డచేఁ గప్పి ♦ వదలకనుచుఁ
బలికి సారధి దర్భలు ♦ పఱువకుండ
రామునాజ్ఞను గొననుండఁ ♦ దా మనమున. ౧౪ 3695

క. కలఁగుచుఁ దానే చని దర్భలు కైకొని పఱుచుకొనియె ♦ పడియుండెను; త్వా
తలపతి మునివరుఁడై యుజ్జ్వల తేజము గల్గు రామ ♦ భద్రుం డంతన్. ౧౫

చ. భరతుని గాంచి యిట్లనియె ♦ వత్స! య దే యపకార మేను నీ
కరసి యొనర్చినాఁడనని ♦ యడ్డముగా శయనించువాఁడవో
ధరణిసురుండొకండె తన ♦ ద్రవ్యము గైకొని యేమఱించు స
త్పురుషుని యింటికేగి కడుఁ ♦ బూనిక నీలఁగ నొక్క ప్రక్కఁగన్. ౧౬

క. వ్రతమూని పండఁదగుఁగా,ని తగన్ మూర్ధాభిషిక్తు ♦ నికి రాజన కి
ట్లితరులకుఁ బీడ చేయఁగ, క్షితిపై నీఁ బరుండియుంట ♦ చెల్లునె భరతా!. ౧౭

క. మతిమత్వర్యా! లెమ్మా, యతిదారుణమైన వ్రతముఁ ♦ ద్యజియించియె నీ
వతివేగమ యిటనుండి ప్రకృతులను గొని పురికేఁబొమ్ము ♦ హితమిది యనుచున్.

చ. అనవిని కైకపుత్త్రుఁడు కు ♦ శాస్తరణంబున నుండియే వచిం
చెను బురమందుఁ బల్లెలవ ♦ సించెడు మానవకోటిఁ గాంచి రా
మునిదగు నీస్వభావమును ♦ ముఖ్యముగాదని చక్కఁజేయఁగాఁ
జనుఁ గద యేల చేయరొకో? ♦ సత్వరమే యన వారలందఱున్. ౧౮ 3700

తే. భరతుఁ గని పల్కి రీరఘు ♦ వరుఁడు సత్య
సంధుఁడనియె యెఱుఁగుదుము ♦ చక్కనిగతి
నెంచియె వచించెఁ గరుణాబ్ధి ♦ యీమహాత్ముఁ
డాత్మజనకుని పలుకుల ♦ యందె నిలిచి. ౨౦ 3701

క. జనకుని పలుకులయందే, తన రెడు నీరామచంద్రుఁ ♦ దగ మరలుటఁగా
ననఘా! మాకు నశక్యం, బనినన్ విని వారిపల్కు ♦ లరసి యనుజుతోన్.

ఉ. రాముఁ డిట్లు పలికె ♦ రమణ ధర్మమనీష, గలుగు నీనుహృన్ని ♦ కాయ మిట్లు

చెప్పుచున్నజాడ ♦ నిప్పుడు వినవయ్య, భరత! దీర్ఘబాహు♦బలసమగ్ర!. ౨౨

సీ. పౌరజానపదోక్తిఁ ♦ బాటించి నాపల్కు విని యిఁక నొనరింపఁ♦గను దగినది
యిదియని చక్కఁగా ♦ మదిని నిరూపించుకొనుము భూపతిచేయఁ♦గూడని దగు
[1]ప్రత్యుపవేశంబు ♦ పాటించితివి గానఁ [2]బాచితముగ నన్నుఁ♦[3]బయసునిపుడు
స్పృశియింపుమా యింక♦నిట్లు నేఁ జేయంగఁ దలఁపనంచును నట్టి♦పలుకునకిదె
తే. చిహ్నమగు నన్న నతఁడు చె♦చ్చెఱనె లేచి
జలము స్పృశియించి పిదప న♦చ్చట మెలంగు
వారితో భూసురులు మంత్రి♦వరులుఁ బౌర
జానపదులును నావాక్య♦సరణి శ్రద్ధ. ౨౪ 3704

చ. వినుదురు గాక రాజ్యము ల♦భింపవలెం దగ నాకునంచు మ
జ్జనకుని వేఁడలే దిటులు ♦ సల్పుము కార్యము నాకుఁగాఁగ నం
చని జనయిత్రి నించుకయు ♦ నైనను నేఁ బురికొల్పలేదు పూ
జ్యుని వరధర్మమూర్తిని ర♦ఘూద్వహు గానల కంప నామదిన్. ౨౫ 3705

తే. అనుమతింపను లేదు కా♦వున జనకుని, పలుకవశ్యము చేయంగ ♦ వలయు నేని
దానిరీతిని వనినుంట ♦ ధర్మమేని, నన్నరున్ మాఱుగా నేనె ♦ యడవిలోన.

క. మన మలరఁగ వసియించెద, జనకునికడఁ బలికినట్టి ♦ సంవత్సరముల్
ఘనుఁ డితఁడు నాకుమాఱుగఁ, జని యేలుంగాక పురిని ♦ [4]సంతస మలరన్.

చ. అని వచియింప ధర్మమతి♦యౌ రఘునాథుఁడు సత్యవాక్కుఁ బ
ల్కిన యనుజన్ము పద్ధతికిఁ ♦ గేవల మద్భుతమంది పౌరులన్
జనపదవాసులం గని సు♦సంగతమై తగునట్లు పల్కె స
జ్జనవరులార! నాదుపిత ♦ క్ష్మాపతి జీవితుఁడైన యత్తఱిన్. ౨౬ 3708

సీ. విక్రయించెనొ దేని♦విధిమీఱఁ గుదువయుంచెనొ? దేని, దేనిఁగొ♦రెనొ తలంప
దానిమార్పఁగ నాకుఁ ♦ గాని యీతనికిని గాని శక్యము గాదు ♦ గాన నాకు
వననివాసము కుదు♦వఁగ బెట్టి దానికి ధనముగా నారాజ్య♦మును గ్రహించి
యిప్పించె నీకుగా ♦ నిప్పుడద్దానిని మాఱుపుచ్చుటయెట్లు? ♦ మాన్యమగునె?
తే. వని వసింపంగనే శత్రుఁ♦డను దదర్థ
మింకొకనిఁ బూన్చుటయు ధర్మ♦మెట్టులగును
నిందితమె యట్లు చేసిన ♦ నేనుఁ గైక
యుక్తముగనే వచించె న♦దొప్పు మిగుల. ౨౯ 3709

క. జనకుండు ధర్మకార్యం,బునె చేసెన్ మేము దానిఁ ♦ బూనమయేనిన్
జనకునకు ననృతదోషము, జనియించున్ భరతుఁడెన్న ♦ క్షమగలవాఁడౌ.

---

1 ప్రత్యుపవేశము=మార్గమున కడ్డముగా శయనించి నిరోధించుపని. 2 పాచితము=ప్రాయశ్చిత్తము. ఇది వ్యాఖ్యలోనిభావమునకుఁ దెనుఁగు. 3 పయసు=నీరు. 4 సంతసమలరన్=అయోధ్యయి దేల నాతలపైఁబడెనని కాక కర్తవ్యమనియే పాలనముచేయవలయు ననునర్థ మీపదము తెల్పును.

క. ఘనభక్తుఁడు నా నీవిధ,ము నెఱుంగుదు నేను; మహిమ♦మునఁ దగు చిత్తం
బున నొప్పు భరతునకు స,త్యనిరతునకు మంగళములె ♦ యా; సర్వంబుల్.

క. సమయము తీఱినపిదప వ,నమునుండి పురంబుఁ జేరి ♦ నాయీసహజుల్
దమి ధర్మశీలుఁ గూడియె, క్షమనుం బాలింతు [1]రాజ♦చంద్రుఁడ నగుచున్.

క. అని భరతుఁ గాంచి యను నీ, జననియు వరమడిగె రాజ♦శశధరు నే నా
వనితామణి చెప్పిన చొ,ప్పున నే నడచితిని నీవుఁ ♦ బూనిక మెఱయన్. ౩౧౪

ఆ. నాదుపల్కురీతి ♦ నడుచుకొమ్మా, పురి ,కరిగి పట్టమూని ♦ యనుగుఁదండ్రి
కన్నృతదోషమున ర♦వంతైన నంటక, యుండఁ జేయవయ్య ♦ యురుగుణాఢ్య!.

నూటపదునొకండవ సర్గము సంపూర్ణము.

---

౧౧౨ - వ సర్గము.

భరతునకు సమాధానము చెప్పి రాముఁ డయోధ్యకుఁ బంపుట.

క. అనుపమతేజంబుల నొ,ప్పిన యాసోదరులదైన ♦ ప్రియసంసర్గం
బనునది రోమాంచంబును, గనఁజేయుట నపటిమాని♦కాంతులు దానిన్.

క. కనుఁగొని మిక్కిలి యచ్చెరు,వునఁ బొడలిరి, యంతకంటెఁ♦బూర్వమె యట వ
చ్చి నిలిచి [2]యంతర్హితులౌ, మునిగణములు సిద్ధదేవ♦మునులును గడఁకన్. ౧౪

తే. అన్మహాత్ములనుం గకుత్♦స్థాన్వవాయ
వర్ధనుల సోదరుల రామ♦భరతులను న
గంగఁ గన్గొని ముదమంది ♦ కడఁగి పల్కి
రీయిరువురి సంభాషణ ♦ మిచట వినఁగ. ౨౪ 3717

క. వీరిలపయి మోదము చేకూరుచు నున్నయది యిట్టి♦గుణవంతుల ధ
ర్మారంభవిక్రముల ఘన,సారుల ధర్మజ్ఞులైన ♦ సరసుల వీరిన్. 3 ; 3718

క. తనయుల నిరువురఁ బడసిన, ఘనుఁడే ధన్యుండటంచుఁ ♦ గడు సంస్తుతులం
దనిపిరి; పిదపన్ [3]రావణ, దనుజవధాకాంక్షులౌటఁ ♦ దన్మునులెల్లన్. 3౪ 3719

తే. ఏకకంఠమ్ముగా మేది♦నీశపుంగ
వునిని భరతునిఁ గాంచి యి♦ట్లనిరి భరత!
పావనాన్వయమునఁ బుట్టి ♦ ప్రాజ్ఞుఁడవయి
సాధువర్తనమున సద్య♦శమునఁ జెలఁగి ర 3720

1 పృథివ్యాః పతి రుత్తమః-అనిమూలము. 2 అంతర్హితా స్తృషిగణాః-అనిమూలము.
3 దశగ్రీవవధైషిణః-అనిమూలము.

క. తనరారుదు వట్లగుటఁ, జనకుఁడు సుఖముండవలయు ♦ సతతంబని నీ
మనమునఁ గోరినచో రా,ముని పల్కులరీతిఁ జేయు♦ము గుణగరిష్ఠా!. ౫ 3721

క. తనజనకునకుఁ రాముం, డనిశము ఋణపడకయుండ ♦ నర్హుఁడటంచుఁ
మనమునఁ గోరుదు మోభర,త! నృపతి ఋణముక్తుఁడగుటఁ♦దాదివమొందెఁ.

క. అనిపలుకుచు గంధర్వులు, మునివరులును రాజమాని♦ముఖ్యులు చనిరా
త్మనివాసములకు; శుభద,ర్శనుఁడగు రాముండు వారి♦సరసవచనముల్. ౭

క. విని సంహృష్టాస్యుండై, ఘనమతులగు వారినెల్ల ♦ గారవమునఁ బూ
జనముల నలరించెను; నా,తని యనుజుఁడు [1]త్రస్తగాత్ర♦తఁ దనకోర్కుల్.

తే. కొంచెమైన నీడేరమి ♦ నెంచి తొట్రు
పాటు నొందెడు పలుకులఁ ♦ బట్టువదల
కంజలి ఘటించి రాముని ♦ కనియె మరలఁ;
బరమధర్మము నృపులకుఁ ♦ బాలనంబు. ౯ 3725

సీ. జ్యేష్ఠుఁడే పట్టాభి♦షేకమ్ము నొందుట మనకులధర్మమై ♦ తనరు నాది
నుండి నచ్చుచునున్న♦దౌగ నీద్వయంబును మదినెంచి యిప్పుడు♦మాజననియు
బ్రతిమాలుటను గాంచి♦పాలింపఁదగుదాని; నట్లు చేయుటయె నీ♦కర్తమగును
ఘనమైన యీరాజ్య♦మును గావఁగాఁగాని యనురక్తులైన యీ♦జనులనెల్ల
తే. నలరఁ జేయఁగఁగాని మ♦హాత్మ! నేనొ
కఁడనె పూనఁగ నేరను ♦ జ్ఞాతివితతి
సైన్యపతులును మిత్రులు ♦ సరసమతులు
కర్షకులు మేఘముఁ వలెఁ ♦ గాంక్షమీఱ. ౧౨ 3726

క. నిన్నే నరనాథునిఁగా, నెన్నుచు నున్నారు; ప్రాజ్ఞ! ♦ యీరాజ్యము సం
పన్నముఁ గొని పాలింపుము, సన్నుతగుణనిచయ! రామ♦చంద్రా! వినుమా!.

క. ఈకోసలరాజ్యం బొకఁ, డేకా దీలోకజాల ♦ మెల్లను గావన్
గాకుత్స్థ! సమర్థుఁడవే, చేకొనుమా! రాజ్య మనుచుఁ ♦ జెప్పుచు భక్తిన్. ౧౩

చ. భరతుఁడు తాఁ దలంచిన యు♦పాయము లన్నియు వ్యర్థమౌట ని
బ్బరము చనంగ సాధుతర♦వాక్యము లొప్పఁగ రామచంద్రు స
చ్చరణయుగంబుపైఁ బడి యె♦సంగెడు ప్రేమమునీఱ వేఁడె నా
భరతుని శ్యామదేహు [2]శత♦పత్రవిలోచనుఁ గ్రుచ్చి యెత్తుచున్. ౧౫ 3729

ఆ. మత్తహంసనినదు ♦ మనుతమీఱఁగ నంక
తలమునందుఁ జేర్చి ♦ పలికె రాముఁ;

[1] త్రస్తగాత్రస్తు భరతః-అని మూలము. అవయవములు బడలియుండఁగా. [2] శతపత్రము= కమలము.

డనుజ! నీకు సహజ♦మగు బుద్ధి గుణశిక్ష
వలనఁ గలుగుమతియుఁ ♦ గలిగె మున్నె. ౧౪॥ 3730

క. కనుకన్ భూమండలమును, గొని పాలింపంగ నీక♦గున్ శక్తియు నీ
కును గలదు; ముఖ్యమంత్రుల, ఘనమతుల గునితరమంత్రి♦కాండము హితులన్.

ఆ. కలిసి నీవు సర్వ♦కార్యములం జక్కఁ,గా దలంచి గొప్ప♦కార్యములను
జేయవయ్య కాంతి ♦ శీతాంశుఁ బాసిన, హిమము విడిచినను దు♦హినశిఖరిని.

క. జలరాశి యధర్మంబునఁ, జెలియలికట్టఁ దగఁబాసి ♦ చెచ్చెఱఁ జనినన్
ఇలఁ దండ్రిదైన ప్రతినను, దొలఁగఁ జుమీ నేను నెట్టి ♦ తొందరలందున్.

చ. [1]వనిత యొకర్తు దుర్నయము ♦ వన్నినదానఁ బ్రతిజ్ఞగల్గెఁ గా
వున విడువంగనౌ ననుచుఁ ♦ బూని నచింతువయేమొ నాయనా!
వినుమిఁకఁ [2]గామలోభగుణ♦[3]విక్రమువంచితబుద్ధి నెట్లొ నీ
జనని త్వదర్థ మీపనిని ♦ జక్కఁగఁ జేసిన దట్టులౌటచేన్. ౧౮॥ 3734

తే. దాని నీమది నుంపంగఁ ♦ దగదు కైక
జనని రీతినె నీవు చూ♦డనగుఁ జుమ్ము
వర్తనంబునఁ బ్రాగ్రీతి ♦ వదలఁ జనదు
భరత! యని పల్కె భాస్కర♦ప్రతిముఁ డతఁడు. ౧౯ 3735

క. తొలిదినమునాఁటి చంద్రుని,వలె వృద్ధిం బొందు రాము♦భద్రుఁ డిటువలెం
బలుకఁగ నాశ్రీరాఘువు, నలఘుగుణాన్వితునిఁ గాంచి ♦ యనుజుం డంతన్.

సీ. అచట వసిష్ఠుచే ♦ ననుమతుండయి పల్కె నార్యవరా! సువ♦ర్ణాభిరామ
ములగు నీవరపాదు♦కలపయిఁ బాదము లిడి యెక్కు మివ్వియే ♦ యెల్లలోక
ములకు యోగక్షేమ♦ములను గావింపంగఁ గలవనుటయు, మహా♦కాంతినలరు
పురుషవర్యుఁడు [4]రఘు♦పుంగవుఁ డాపాదుకలఁ దొడుగుకొనియె♦నెలమిమీఱ

ఆ. వరల వాని వదలి ♦ మహితాత్ముఁడైనట్టి
భరతునకు నొసంగె; ♦ భక్తి నతఁడు
పాదుకలకు మ్రొక్కి ♦ భద్రమూర్తిని రాముఁ
గాంచి పలికె భూమి♦కాంత! వినుమ!. ౨౧॥ 3737

సీ. పదియు నాపై నాల్గు♦వత్సరంబులు నేను జడలు వల్కలములు♦చక్కఁ దాల్చి
ఫలమూలములఁ దిని ♦ పరపర్ద నుఁడవయి వీరుండవయి రఘు♦భూరమణుని

---

1 ఈపద్యపూర్వార్థము వ్యాఖ్యలోని యవతారికకుఁ దెనుఁగని గ్రహింపవలయు. 2 కామా ద్వా తాత లోభాద్వా మాత్రా తుభ్య మిదం కృతమ్-అని మూలము. 3 విక్రమ=క్రమము తప్పుట చేత. 4 సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్యచ, ప్రాయచ్ఛ త్సుమహాతేజా భరతాయ మహాత్మనే-అనిమూలము.

వంశంబు వెలయించు♦వాఁడవౌ నీపాదుకలపయి రాజ్యంబు ♦ నెలమి నునిచి
పురబాహ్యముననుండి♦పొలుపగునీరాక నెదురుచూచుచు నెయుం♦డెదను రామ!

తే. [1]పంచదశశతమవత్సర♦ప్రథమదివస
మందు నినుఁ జూడనై తినే ♦ ననలుఁ జొత్తు
ననిన నట్టులె కానిమ్ము ♦ యని రఘువరుఁ
డనుచు నంగీకరించి య♦య్యనుజుఁ బ్రీతి. ౨౬ 3738

క. కరముల బిగియారఁగ నా,దరమున నాలింగనంబుఁ ♦ దగఁ జేయుచు సో
దరునిఁ శత్రుఘ్నుని న,క్కరణిని లాలించి భరతుఁ ♦ గాంచి వచించెన్. ౨౬౹

తే. అమ్మఁ గైకేయి రక్షింపు ♦ మామెపయిని
గోప మూనకు మిట్లని ♦ నాపడంతి
పైన నాపైన శపథంబు ♦ పలుకువాఁడ
[2]ననుచుఁ గన్నీరు నించుచు ♦ ననుజు విడిచె. ౨౭ 3740

క. శూరుండయి ధర్మవిదుం, డై రాజిలు భరతుఁ డంత ♦ నమలతరాలం
కారముల నొప్పుమీఱెడు, శ్రీరాముని పాదుకలను ♦ జిత్తం బలరన్. ౨౭౹

తే. కరముఁ బూజించి వలగొని ♦ నరవరార్హ
మైన యుత్తమగజమూర్ధ♦మందు నునిచె;
నంత హిమభూధరమువలె ♦ నాత్మధర్మ
మందు స్థిరతను గన్న రా♦మాధిపుండు. ౨౮। 3742

సీ. గురువుల మంత్రులఁ ♦ బురముఖ్యములనుండి వచ్చిన జనులను ♦ భరతముఖుల
వారివారికిఁ దగు♦భంగి గౌరవముల నలరించి యంత వీ♦డ్కొలిపె నపుడు
తల్లులు కన్నీటి♦ధారలఁ బలుకులు వెడలమి దుఃఖసం♦విగ్నచిత్త
లగుచు వీడ్కొనఁజాల ♦ రైరి శ్రీరాఘవు; [3]నతఁడె తల్లులకెల్ల♦ నవనితలముఁ

ఆ. దల స్పృశింప మ్రొక్కి ♦ తగురీతి వారల
చింత మాన్పి యేడ్పు ♦ చిత్తమందు
నిముడకట్టి వెడల ♦ నిబ్బరమొందక
పర్ణశాలఁ జొచ్చె ♦ వగలఁ బొగిలి. ౩౦ 3743

నూటపండ్రెండవ సర్గము సంపూర్ణము.

1 చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ, న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్-అనిమూలము. 2 ఇత్యుక్త్వా ఽశ్రుపరీతాక్షో భరతం విససర్జ హ-అనిమూలము. 3 స తేషు మాతౄ రభివాద్య సర్వా రుదన్ కుటీం స్వాం ప్రవివేశ రామః-అనిమూలము,

## ౧౧౩ - వ సర్గము.

### భరతుఁ డయోధ్యఁ జేరుట.

క. భరతుం డటఁ బాదుకలను, శిరమున నిడుకొనుచుఁ జెలఁగు ♦ స్థిరముదమున సో
దరుఁడగు శత్రుఘ్నునితో, నరదము పై నెక్కె; నంత ♦ నాతని మ్రోలన్. ౧

తే. అవ్వసిష్ఠుఁడు సువ్రతుఁ♦డై చెలంగు
నట్టి జాబాలి వామదే♦వాహ్వయుండు
మంత్రకార్యవిశారదుల్ ♦ మంత్రులెల్ల
నరిగి రయ్యద్రి వలగొను♦నాసఁ బూని. ౨ 3745

క. శ్రీరామునివాసంబౌ, భూరిధరాధరమునకును ♦ బొందుగఁ దూర్పుం
జేరియట జానకియు రఘు,వీరుఁడు జలకేళిఁ దేల ♦ విమలం బగుచున్. ౨½

క. అనుపమమయి తగు మందా,కిని జేరి భరతుఁ డచటి♦కిన్ సేనలతో
డను బోయి రమ్యబహువిధ, ఘనధాతుసహస్రములను♦గాంచుచు గిరికిన్. ౩½

*తే. పార్శ్వమువనుండు మార్గమ్ముఁ ♦ బట్టి పోయి
యగ్గిరికిఁ జేరువనెయున్న ♦ యాశ్రమమును
మునివిభుండౌ భరద్వాజుఁ ♦ డనఘుఁడుండు
దానిఁ గాంచెను భరతుం డు♦దారబుద్ధి. ౪ 3748

క. అరదమ్ము డిగ్గి యాముని, వరుపాదయుగంబునకును ♦ బ్రణతిం జేసెన్
భరతుని రాకకు నమ్ముని, పరమప్రమదమునఁ దేలి ♦ పలికె నతనితోన్. ౬½

తే. నాయనా! రాముఁ గంటివే? ♦ పోయి నపని
యైనదే? యని యడిగిన ♦ నతుల్యకీర్తి
నుగ్రుఁడౌ ముని యిటు త న్న♦నుగ్రహమున
నడుగఁగా భ్రాతృవత్సలుం♦డైన భరతుఁడు. ౮ 3750

క. మునితోఁ బలికెను దృఢమై, తనరెడు శౌర్యంబు వెలయఁ ♦ దగువాఁడగు రా
ముని నేను గురుఁడు రాజ్యం,బును గొనుమని వేఁడుకొనఁగ ♦ ముదమున నతఁడున్.

సీ. ఇవ్వసిష్ఠునితోడ ♦ నిర్థవిచారంబు వెలయ నిట్లనియెను ♦ బృథ్వీపతియుఁ
గైకనిమిత్తమై ♦ కానలోఁ బదునాలుగేండ్లు నన్ను నంపంగ ♦ నెంచి చెప్పి
నట్టి యామాటయ♦ధార్థమ్ముగాఁ జేయువాఁడ నిశ్చయమని ♦ పలుకునంతఁ
బ్రాజ్ఞవర్యుండును ♦ వాక్యజ్ఞుఁడు నగు వసిష్ఠుండు వాక్యసం♦సిద్ధిగన్న

తే. రాఘవునితోడఁ బలికె న♦ర్థప్రయుక్త
ముగను శ్రీరామ! ప్రాజ్ఞుడ♦వు గనుక నీవు

---

* అదూరా చ్చిత్రకూటస్య దదర్శ భరత స్తదా, ఆశ్రమం యత్ర సముని ర్భరద్వాజః కృతాలయః-అనిమూలము. 'అనేన యమునాదక్షిణతటే క్వచి ద్భరద్వాజాశ్రమ ఇతి జ్ఞాయతే' అని మహేశ్వరతీర్థులు. 'అదూరాదివ భాసమానమ్' అని గోవిందరాజులు.

డీవియె కనకంబుచే నలం♦కృతములైన
పాదుకల నిమ్ము! యనుజుండొ ♦ భరతునకును. ౧౧౪ 3752

క. అలపురి యోగక్షేమం, బుల నివియే కూర్చుచుండుఁ ♦ బొందుగ ననుచుం
బలుక వసిష్ఠుని వాక్యం, బుల విని [1]ప్రాగ్వదనుఁ డగుచు♦మోదముచెలఁగన్.

క. తనపదములు బాదుకలం, దనువుగ సోఁకంగఁ జేసి ♦ యవనీభరణం
బున శక్తి నాకుఁ గలుగం,గ నొసంగె మహాత్ముఁ డిట్లు♦గాఁ గృపనీయన్.

తే. అన్న యనుమతిఁ గైకొని ♦ యతిశుభప్ర
దములఁ బాదుకలం గొని ♦ తరలి యాయ
యోధ్యకే పోవుచున్నాఁడ ♦ నురుకృపాబ్ధి!
యన్న భరతుని శుభవాక్య ♦ మాలకించి. ౧౭౫ 3755

క. అలరి భరద్వాజుం డిటు, పలికె శుభస్వరములైన ♦ పలుకులు మిగులన్
వెలయఁగఁ బురుషవరేణ్యా!, కులగుణశీలురకు నీవె ♦ గొప్పవు సుమ్మా!. ౧౭౬

క. కనుకనె నిమ్నస్థలి జీ,వనములు నిలువంగ నోపు ♦ భంగిని, నీయం
దును జ్యేష్ఠానుసరణమను, ఘనతసుమా శ్రేయమిద్ధి ♦ కడు వెలసెఁ జుమీ.

ఆ. కాన నిద్ది వింత♦గాదు, మహాభుజుం, డయిన దశరథునకు ♦ నమలధర్మ
విదుఁడు ధర్మమతియు ♦ సదమలాచారుఁడు, నైన సత్తనూజుఁ♦డవగు నీవు.

క. ఉన్నావుగాన నాతం, డెన్నటికిని మృతుఁడుగాక ♦ యింకఁ బ్రదికియే
యున్నట్టి వాఁడె యగుఁ జు, మ్మన్నన్ మహాత్ముఁడైన ♦ యమ్మునిపలుకుల్.

క. విని దోసి లొగ్గి భరతుఁ డ,తని పదములఁ బట్టుకొని ని♦తాంతవినయమున్
గనఁబడ వీడ్కొనెడు తలం,పున నున్నట్లుండి యంతఁ ♦ బొంగెడు భక్తిన్.

చ. వలగొని మాటిమాటికిని ♦ వైభవయుక్తుఁ డతండు మంత్రులం
గలిసి యయోధ్యకేగె; నృప♦కాంతుని సైన్యము స్యందనంబులుం
బొలుపగు యానముల్ కరులు ♦ భూరితురంగము లొప్ప వానితోఁ
జెలఁగి యయోధ్యకేగె; నృప♦శేఖరుఁ డంతఁ జమూయుతంబుగాన్. ౨౦

సీ. వీచీవితానంబు ♦ వెలయ రమ్యంబగు యమునామహానది ♦ నంత దాఁటి
పావనశుభజల♦భాసురంబగు గంగఁ గాంచె నంతట బంధు♦కలితుఁ డగుచు
సైన్యయుతంబుగా ♦ సరసజలాపూర్ణమగు గంగ దాఁటి ర♦మ్యమయి యొప్పు
శృంగిబేరపురంబుఁ♦జేరి యందుండి ప్రయాణమై చని యయో♦ధ్యాపురంబుఁ

తే. గనియె శ్రీరామచంద్రుని ♦ జనకుఁ బాసి
యున్న యప్పురిఁ గనినంత ♦ నురుతరార్తి
నంది సారథిఁ గాంచి యి♦ట్లనియె నిదిగొ
రామవిరహార్తిపీడిత♦మైన మజియును. ౨౩౪ 3762

---

1 రాఘవః ప్రాఙ్ముఖః స్థితః-అనిమూలము.

క. తనసొంపుఁ బాసి మోదం, బునుగన కతిదీనయగుచుఁ ♦ బొలుచు స్వరంబుల్
గనకీ యయోధ్య యున్నది, కనుమా యోసారథీ! వి♦కాంతిని దీనిన్. ౨౪౫

నూటపదమూఁడవ సర్గము సంపూర్ణము

---

## ౧౧౪ - వ సర్గము.

భరతుఁ డయోధ్యను జూచి శోకించుట

క. స్థిరకీర్తిసమర్థుఁడు నగు, భరతుఁడు గంభీరమైన ♦ భవ్యధ్వనితోఁ
బరఁగెడు రథమునఁ బోవుచుఁ,ద్వరితంగతి బురముఁజొచ్చి♦వగఁగనుమదితోన్.

సీ. నరవారణంబులు ♦ తిరుగమి దీనమై [1]యట్లులూకోతువు ♦ లనవరతముఁ
దిరుగుట భయదమై ♦ తిమిరంబు గ్రమ్మి కాంతిని బాసియున్నట్టి ♦ తిమిరపక్ష
నిశవలె నాపురి ♦ నెగడకయుండెను; గాంతిచే వెలసి యం♦గారకాభి
పీడితయగుచుఁ ద♦పించుచు నేకాకి యగుచుఁ జంద్రునిపత్ని ♦ యైనరోహి
ణిని బోలియుండెను ♦నీరమెల్లను నెండ వేఁడిమికిం గ్రాఁగి ♦ వేఁడినొంది

తే. కలఁగి యుండఁగఁ బక్షులు ♦ గడుఁ దపింప
గ్రాహమీనాదిజలజంతు♦కాండమెల్ల
నణఁగియుండఁ గృశించిన ♦ [2]యద్రినదిని
బోలియుండె నయోధ్యయుఁ ♦ బొంకిమోహెం. ౫ 3765

క. కనకమువలెఁ దగి ధూమముఁ, బును వొలినెఁబాసి వెరుగు♦మొదలగు సవ్య
స్తునికరముం బ్రోక్షింపఁగఁ, గనఁబడని మఖాగ్నిశిఖయుఁ♦గాఁ, బురము దగెన్.

సీ. మఱియును ఘోరస♦మరమందు గజవాజిరథ్యంబులును ధ్వజములుఁగా♦సముయఁ గవచ
ములు విశీర్ణంబులై ♦ యిలఁబడి వీరనికాయంబు గూలి ని♦కృష్టమునఁ బడి
యున్నసైన్యము వలె; ♦ సుమితరఫేనంబు గిలిగి మహాస్వన♦కలితమగుచు
నాగరంబుననుండి ♦ సరభసముగ లేచి వాయువశంగ ని♦స్వనము లడఁగ

తే. నున్నతిం దూలియున్నట్టి ♦ యూర్ములవలె
నధ్వరాంత్యదినంబున ♦ ట్లరుగ బుత్వి
జులును యజ్ఞీయసాధన♦ములఁ గొని చన
రిత్తయై యున్న మఖవేది♦రీతి నుండె. ౭ 3767

సీ. ఆఁబోతు తమ్ము నొ♦య్యనడిగవిడువంగ దానిఁ దలంచుచు ♦ మానసమ్ము
తడఁబడఁ జక్కఁగఁ ♦ బుడమిఁ గన్పడు లేఁత పచ్చికమేయక ♦ బడలి గోష్ఠ
మందార్తిఁగను నాల♦మందపోలిక; నుత్తమములయి కాంతుల ♦ సమరి; మేలి
జాతులు గలిగి వి♦స్తారమూల్యంబులఁ దగు పద్మరాగాది♦ధన్యరత్న

---

1. ఉలూకోతువులు - ఉలూకములు = గూబలు. ఓతువులు = పిల్లులు. 2. అద్రినది = కొండవాగు.

తే. తతిని బాసిన ముక్తావ♦ళి తెఱఁగొప్పు
నుండె; మఱియును బుణ్యంబు ♦ నొగి నశింపఁ
గాఁ దటాలున దివినుండి ♦ క్షమను బొంది
కాంతియే లేని నక్షత్ర♦కరణి నుండె. ౧౧ 3768

క. అలరువసంతము చనఁ బూవులచేఁ దగి మత్తమధుప♦పూగము మ్రోయం
జెలఁగుచు దావాగ్న్యుద్ధతి, వలనఁ గమలి చెడినయట్టి ♦ వనలతకరణిన్. ౧౨

క. కనఁబడుచుండెను మఱియును, జనసంచారంబె లేక ♦ సరఃఖులు తగ నం
దును విపణులు మూయంబడి, జనములు క్రయవిక్రయములు♦సలుపఁగరామిన్.

క. పురమపు డభ్రాచ్ఛాదిత, సరసిజరిపుతారకాది ♦ సంతతిగల యం
బర మట్టు లొప్పుచుండెను, ధరణీశుఁడు రాఘవుండుఁ ♦ దన్నెడఁ బాయన్.

ఆ. కప్పు లేనిచోటఁ ♦ గమ్రమద్యము చెడి, పాత్రవితతి పగిలి ♦ పఱియలగుచు
మత్తుగన్నజనులు ♦ మరణింపఁ గొఱగాక, యున్న పానభూమి♦ తెన్నుఁ గనిరొ.

క. ధర పగిలి త్రోవ లేర్పడ, నరుదుగఁ బాత్రములు పగిలి ♦ యంబువు వ్యయమై
పరికింపరాని ప్రపవలెఁ, బుర మప్పుడు కానఁబడియెఁ ♦ బొంకము దూలన్. ౧౪

సీ. చాపంబునందును ♦ సంధింపఁగాఁ బడి యుక్తపాశంబయి ♦ యొప్పి యుద్ధ
కాలంబునన్ రిపు♦క్ష్మాపతిబాణముల్ తగులంగఁ దునియుచు ♦ ధనువునుండి
ధరణిపైఁ బడు నల్లె♦త్రాటిచందంబున, రణపటిష్ఠుండగు ♦ రౌతుపయిని
నెక్కి తోలఁగ నట్టి♦కృత్యంబునకుఁ జాల కలసి భూషణపుంజ♦ములను బాసి

ఆ. బలవిహీనమైన ♦ బాలాశ్వవిధమున, మత్స్యకూర్మమకర♦మండితమయి
జలము లింకఁబాఱఁ ♦ [1]గలువలు చెడఁ దట, పంక్తి దూలనున్న ♦ బావిరీతి.

సీ. మైపూఁతలను నెల్ల♦మాని శోకంబున సంతాపమందుచు ♦ సకలభూష
ణావళి మాలి య♦త్యంతము యప్పినాఁ గృశియించియున్న దుః♦ఖితుని ననువు
నట్లు, వర్షాకాల♦మందు సూర్యుం డభ్రపటలముఁ జొచ్చిన ♦ పట్టునందు
నసితాభ్రసంచ్ఛన్న♦మైన యాతనిప్రభకరణి శోభిల్లని ♦ పురముఁ జొచ్చి

తే. శ్రీయుతుండయి దశరథ♦క్షితిపసుతుఁడు
నైన భరతుండు రథమున♦యందె యుండి
ఘనరథముఁ దోలుచున్న సూ♦తునిఁ గనుఁగొని
పల్కె నిట్లని తొట్రిలు ♦ పలుకు లొప్ప. ౨౧ 3775

క. మును పిందు గీతవాద్య, ధ్వను లతిగంభీరములయి ♦ దశదిక్కులకుం
జని వ్రాలుచు వినఁబడుఁ గద!, ధ్వనియదియిపుడేలవినఁగఁ♦బడదయ్యయ్యో!.

తే. మాల్యగంధము వారుణీ ♦ మదసుగంధ
మగురుధూపసుగంధ మి♦వన్ని మున్ను

1 హ్యతోత్పలామ్-అనిమూలము.

భంగిఁ బురమున నెల్లెడ ♦ వరుస నిండి
యొక్క మొగిని గుబాళింప♦కున్న విపుడు. ౨౩ 3777

చ. పురమున దివ్యయానముల ♦ భూరిరవంబులు దివ్యఘోటకో
త్కరముల భవ్యహేషలు మ♦దంబునఁ గ్రాలెడు హస్తిఘీంకృతుల్
వరరథనిస్వనంబులును ♦ భానుకులాభరణుండు రాముఁ డి
క్కరణిని గానకేగ వినఁ♦గాఁ దగకున్న విఁ కేమి చెప్పుదున్. ౨౪ 3778

క. నిరుపమవయస్కులై తగు, పురుషు లగరుచందనములఁ ♦ బొల్చెడు నవసుం
దరపుష్పహారములనున్, ధరింపకున్నారు వనికిఁ ♦ దగ నన్న చనన్. ౨౫

చ. మనపురిఁగల్గు మానవులు ♦ మాననిశోకమునం దపించి చ
క్కని పలువన్నెహారములఁ ♦ గ్రాలి [1]వయాళికి వెళ్లరేమొ యొ
క్కని గృహమందు నుత్సవము ♦ గానఁగరా దొనరించినట్లు; రా
మునిఁ దగఁ గూడియే నగరి♦ముగ్ధరుచుల్ చనియెన్ నిజంబుగన్. ౨౬ 3780

క. అతివృష్టితోడఁ గూడిన, సితపక్షపు రేయిరీతిఁ ♦ జెలఁగెడుకాంతిన్
బ్రతిలేని యిప్పురం బిపు, డతిహీనత నొందియున్న ♦ దకటా! కంటే. ౨౭

క. పెనుపండువువలె నన్నియుఁ, జనుదెంచి యయోధ్యనున్న ♦ జనులకు గ్రీష్మం
బున నబ్ధమురీతి ముదం,బు నదెప్పుడు కల్గఁ జేయుఁ ♦ బూనునొ తెలియన్.

ఆ. చారువేషములను ♦ సముదగతుల్ మీఱి
వయసుకాంత్రు తిరుగ ♦ వసలుకొనుట
సహితరీతి నున్న ♦ మార్గంబులన్నియుఁ
గాంతి దూలి యుందుఁ ♦ గాననయ్యె. ౨౯ 3783

క. అని బహువిధములఁ బల్కుచు, జనపతి సౌధమును జొచ్చె ♦ జనపతిలేమిన్
ఘనసింహహీనగుహవలెఁ, గనుపట్టఁగ భరతుఁ డెంతొ ♦ కళవళపడుచున్.

క. మును సురదైత్యులయుద్ధం, బున సురలు పరాజయంబుఁ ♦ బొందఁగ భాను
డును రాహువుచే నోటమిఁ, గన రాత్రిందివము లనెడు ♦ కల్పన లేమిన్. ౩౧

తే. అలరకుండిన దినమట్టు ♦ లమలకాంతి
యడఁగ విజనంబుగా నున్న ♦ యంతిపురము
నంతయుం గని గాఢదుః♦ఖార్తుఁ డగుచు
బాష్పపుంజంబు విడిచెను ♦ భరతుఁ డపుడు. ౩౨ 3786

నూటపదునాల్గవ సర్గము సంపూర్ణము.

---

1 వయాళి=విహారము.

## ౧౧౫ - వ సర్గము.

{ భరతుఁడు నందిగ్రామమున రామపాదుకలఁ బురస్కరించుకొని రాజ్యమును బాలింపఁ బూనుట. }

క. అంతదృఢవ్రతుఁడగు భూ,కాంతుని తనయుండు మాతృ♦గణము నయోధ్యా
భ్యంతరవిలసద్ధాత్రిజని, శాంతంబున విడిచి శోక♦సంతప్తుండై. ౧ 3787

క. గురువులఁ గని యిట్లనియెన్, ద్వర నందిగ్రామమునకుఁ ♦ దలఁచితిఁ జన నో
గురులార! మిమ్ము వీడ్కొని, యరిగెద నీదుఃఖమెల్ల ♦ నట నోర్వఁగలన్. ౨

ఆ. ఇందె యుండి రాము ♦ నెడఁబాయుటం గల్గు
తాప మోర్వఁజాలఁ ♦ దండ్రి స్వర్గ
మునకుఁ జనియెఁ గాదె ♦ వనికి నాయన్నయుఁ
జనియె నతఁడె కాదె ♦ ధాత్ర్యధిపుండు. ౩॥ 3789

క. కనుకనె మహితయశస్కుం, డనఘుఁడునగు నతనిరాక ♦ నాత్మఁ దలఁచుచున్
జని యందె యుండఁదలఁచితి, నని యిట్లు మహాత్ముఁడైన♦యతఁడాడుటయున్.

క. భరతుని శుభవాక్యంబుల, నరుదుగ వినుచున్ వసిష్ఠుఁ ♦ డాదిగఁ దగుమం
త్రిగణము లతనిం గన్గొని, భరతా! నీవిపుడు భ్రాతృ♦వాత్సల్యమునన్. ౫॥

చ. పలికినపల్కు శ్లాఘ్యమయి ♦ భాసిలుచున్నది; నీకె యిట్టివా
పలుకులు చెల్లు నీదయిన ♦ భవ్యకులంబునకేఁ దగున్; మనం
బలరఁగ బంధుజాలముల♦యందుఁ బ్రమోదము నీకుఁ గల్గుఁ జూ
వెలయును భ్రాతృసౌహృదము ♦ వింతగ నీకుఁ గలాపరీతిగన్. ౬॥ 3792

తే. ఆర్యమార్గముఁ బూని యు♦న్నట్టి నీవు, పలుకుమాటను దీనినె♦వ్వండు సమ్మ
తింపకుండును? మెచ్చనో ♦ దీనిననిరి; భరతుఁ డమ్మాట విని తన♦వాంఛదీఱ.

క. అరదము నాయత్తము స,త్వరముగఁ జేయుమని చెప్పెఁ ♦ దనసారథితో
భరతుం డాశ్రీమంతుం, డరుదగు ముఖకాంతి వెలయ ♦ నంత ముదమునన్.

తే. జననులకు మ్రొక్కి శత్రుఘ్న♦సహితుఁడగుచు
నరదమెక్కెను; వారిద్ద♦ఱట్లు మిగుల
సంతసంబుల రథమెక్కి ♦ సచివనికర
మును బురోహితుఁ డరుదేరఁ ♦ జనిరి వేగ. ౯ 3795

సీ. అందులో నాచార్యుఁ♦డైన వసిష్ఠుండు మొదలగు విప్రస♦ముదయమెల
ముందఱఁగాఁదూర్పు♦మొగముగాఁజనుచునందిగ్రామమున్న మే♦దినికిఁజనియె,
భరతుఁ డేగఁగఁ బిల్వఁ♦బడకయె రథగజహయసంకులంబగు ♦ నతని సేన
వెనుకనే చనియెఁ; బౌ♦రనికర మాతని వెంబడించియె పోయె ♦ వితతసహజ
తే. వత్సలుండయి ధర్మత♦త్పరమనీషుఁ
డైన భరతుండు స్యందన♦మందె యుండి

రామవరపాదుకలను శి♦రంబునందె
యునుచుకొని యేగె నాగ్రామ♦మునకుఁ ద్వరఁగ. ౧౨ 3796

క. చని యానందిగ్రామం,బున వడిఁగాఁ జొచ్చి యరద♦మును దిగి యాచా
ర్యునిఁ గని యిట్లని పలికెన్, వినుఁడీ యీరాజ్యమెల్ల♦విభుఁడు దయమెయిన్.

సీ. ఇల్లడగనె పెట్టి♦యే యున్నవాఁడు నాయొద్దఁ గావున దీని♦నొగి సమస్త
మతని కర్పింపఁగ ♦ నర్హమే దీనిని గాపాడు నయ్యధి♦కారమెల్ల
నాకు లే దరయఁగ♦నకవిభూషితములౌ పాదుక లివ్వియే ♦ వసుస నిందుఁ
గలుగు యోగక్షేమ♦ములఁ జూచుకొనునని పల్కి నంతట నట్టి♦పాదుకలను
తే. శిరమునం దాల్చి దుఃఖంబుఁ ♦ జెంది మిగులఁ
బరితపించుచు దనదైన ♦ ప్రకృతివర్గ
మును గనుంగొని పల్కె మా♦మనములలరఁ
బట్టుఁ డీఛత్రచామర♦వరములఁ దమి ౧౪ 3798

క. ఇవె సూర్యాంశగు రఘువంశ్య వరాంఘ్రులు సినిచేత ♦ సుపధర్మమ్ముల్
సువిహితములౌను ధాత్రిని, బ్రవిమలమతి యన్న యనుజు♦పైఁగల ప్రేమన్.

సీ. దీని నాయొద్దనె ♦ దాఁనుంచె నిక్షేపముగఁ గాన నేను రా♦ముండు వచ్చు
వఱకు మాత్రమె దీనిఁ♦బాలించుచుందును, శ్రీరాఘవుఁడు రాఁగ♦శీఘ్రముగను
దీనిఁ బౌరసులకు ♦ నేనె నెయ్యము మీఱఁ బొసఁగి వీనింగూడి♦కడుఁ జెలంగు
తత్ప్రాపములను సం♦కర్షింతుఁ దమిదీఱ నీరాజ్యభరమును నే♦నెలమి నతఁడు
ఆ. వనమునుండి రాఁగ ♦ నైజ మాతనియందుఁ, బెట్టి తండ్రిరీతి ♦ వివిధసేవ
లతని కేను జేయు ♦ చతిశయభక్తితో, నతని గూడియుందు ♦ ననవరతము.

క. రాముపదాం ప్రతినిధులగు, నీపావనితపాదుకలను ♦ నీరాజ్యమ్ము
ద్ధానుపురంబు నొసంగుచు, నే మాతృభవాపవాద ♦ మిఁకఁ బాయుదుఁ జూ!

సీ. పట్టాభిషిక్తుఁడై ♦ భాసిల్లు శ్రీరాముఁ గని జనుల్ పులకిత♦గాత్రులగుచు
మనముల సంతసం♦బును బొందినపిదప నాకు రాజ్యచతుర్గు♦ణమగు యశము
సంతోషమును గల్గు; ♦ సమధికముగ నని యన్నుహాశయుఁ డిట్టు♦లా త్రిమీఱ
పిలపించుచున్ జాల ♦ విన్నఁదనంబున మంత్రులంగూడి గ్రా♦మమున నందు
తే. రాజ్యమేలుచునుండెను ♦ ప్రభువు వీరుఁ
డైన భరతుండు జటలను ♦ బూని వల్క
లముల ధరియించి మునులవే♦షమును బూని
సైన్యయుతముగ వసియించె ♦ సమయ మరసి. ౨౩ 3802

చ. భరతుఁడు భ్రాతృవత్సలత ♦ భాసిలువాఁడు రఘూత్తముం డదే
తరుణమునందు వచ్చునొ ము♦దంబున నంచును దానినెంచుచున్

వరమతి రాముశాసనము ♦ భంగిసి వర్తిలుచుఁ బ్రతిజ్ఞ నె
క్కరణినినైన సార్థకము♦గా జరపింపఁగ నెంచి పూన్కితోఁ. ౨౮ 3803

తే. పాదుకల కంత నభిషేక♦పరమమహము
జరపి యాగ్రామమున నివా♦సంబు చేసి
పార్థివుని శాసనముల న♦ప్పాదుకలకు
విన్నవించుచు ధర నేలె ♦ సన్నుతముగ. ౨౯ 3804

క. సిరి వెలయు నతఁడు శ్రీరఘు,వరుపాదుకలకు మహోత్స♦వం బొనరిచి యే
తరుణమున నైన వానిఁ, గరము భజించుచును నేలె ♦ క్షమ ధర్మముగన్.

క. పరిపాలనకృత్యంబే, వగుసం గల్గినను ఛత్ర♦వస్త్రాదుల నె
వ్వరుగాని గొప్పకానుకల, ధరణీశునకనుచుఁ దెచ్చు♦తఱినే వానిన్. ౩౦-౧

క. తొలుదొలుతఁ బాదుకలకే, యలరి నివేదించి పిదప ♦ నవ్వానిం దా
నెలమిం గొని కార్యంబుల, వలసినగతి నడుపుచుండె ♦ భరతుఁడు పూన్కిన్.

నూటపదునైదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౬ - వ సర్గము.

శ్రీరాముఁడు చిత్రకూటమును విడిచి వేఱొకయాశ్రమమున కరుగుట.

క. భరతుండు మరలిపోయిన, తరువాతన్ రఘువరుండు ♦ తద్వనమునఁ గా
పురముండి యచటి మౌని ని,కరము భయంబొంది మఱియొ♦కయెడకు నేగన్.

[1]సీ. వాంఛించియుండుట ♦ వారి యాకారేంగి
తాదుల నెఱిఁగె న♦య్యద్రినున్న
యాశ్రమమునఁ బూర్వ ♦ మతిశయముగఁ దన్ను
నాశ్రయించిన మౌను ♦ లాపదంబు
వదల నుంకించుట ♦ వారిచర్యలచేత
నూహించి రాఘవుఁ ♦ డొగి నెఱింగె;
వారంతసంశయ♦పడి నయనంబుల
భృకుటుల రామచం♦ద్రునిఁ దగంగఁ
గనఁబఱచుచు నొక♦రిని గాంచి యొక్కరు
మెలమెల్ల గొణుగుచు; ♦ మిగులఁ బూన్కి

తే. రామునిం గూర్చి యామౌని♦రమణులెల్ల
రును రహస్యంబుగాఁ జెప్పు♦కొనిరి కథల
వార లాయాశ్రమంబును ♦ వదలిపోవ
దలఁచుచుండుటఁ గాంచి యా ♦ దాశరథియు. 3 3809

---

1 ఇందు రాముని అని రెండుసారులు చెప్పుట శ్లోకద్వయమున నుండుటచే నని తెలియ వలయు.

క. మనమున సంశయమందుచు, మునిపతిఁ గులపతిని గాంచి ♦ మ్రొక్కి కరములొ
య్యన మోడ్చి యోమహాత్మా!, వినుమా! నామనవి చెపుమ♦వే యుత్తరముల్.

తే. మునుల కేమే వికారంబు♦లను జనింపఁ
జేయఁజాలిన వికృతంపుఁ♦జేష్టలను నొ
నర్పనేకద కంటిరే ♦ నా ప్రవృత్తి
మీారలేమైన లోపంబు ♦ చేరియుండ. ౫ 3811

చ. అనుజుఁడు లక్ష్మణుండు తగ♦నట్టి విధంబునఁ గార్యమేదియై
నను మతివిభ్రమంబున నొ♦నర్చిన జాడయుఁ గానరాదుగా
యనయము మీకు సేవల మ♦హాదృతిఁ జేయుచు నాకుఁగూడఁ జ
క్కని పరిచర్యసేయు జన♦కప్రియపుత్రియు భ్రాంతచిత్తయై. ౬౪ 3812

క. మీావిషయమ్మునఁ దగ న,ట్లేవిధమునఁ గాని తగిన♦దే యని తానున్
గావించినదోకృత్యముఁ, బావనమతి! తెలుపవయ్య! ♦ వదలక నాకున్. ౭

క. అనవిని ప్రాయంబునఁ దప,మున ముడిసెన యాకులపతి♦ముదిమి వణఁకుచున్
ఘనభూతదయను రాజిలు, ననఘునితో రాముఁ గాంచి♦యనియెన్ గడఁకన్.

సీ. జనకరాజేంద్రుని ♦ తనయ కళ్యాణస్వభావయు శుభకార్య♦పరతఁ జెలఁగు
నదియుఁ గావున నట్టి ♦ యాసతి ధర్మము తప్పుట గల్గునే ♦ ధరణి నెన్న
మఱియు విశేషించి ♦ మానుల విషయంబునందు ధర్మము తప్పు♦టనఁగఁ గల్గు
నయ్య నిన్ బట్టియే ♦ యసురుల బాధలు కలుగుచున్నవి, కన♦గాన మునులు

తే. వానికిన్ సాధ్వసంబొంది ♦ వారిలోన
వారలేమేమొ పలుకుచు♦న్నారు వినుము
నాయనా! రావణాఖ్యదా♦నవుని సహజుఁ
డైన ఖరనాముకుండొక్కఁ ♦ డలరుచుండు. ౧౦౪ 3815

చ. వినుము ఖరుండు ధృష్టుఁడును ♦ విక్రమసంపద సంగరంబులో
ననిశము పెంపుమిాఱి విజ♦యంబుల నందినవాఁడు క్రూరుఁడై
మనుజుల మాంసముం దినుచు ♦ మత్తిలి పాపమతిం జెలంగి యి
వ్వని నొకచోటఁ జేరి ముని♦వారము నోర్వక బాధపెట్టెడిన్. ౧౧౪ 3816

క. ఇందొప్పు జనస్థానం, బందున్ వసియించి యందు ♦ నలరెడు మునిగా
డ్బృందములఁ గలఁచుచున్నాఁ, డంకిలి వెసలంగఁ దఱిమె♦నాతఁడు రామా!.

క. నీవిటఁ జేరిన దాదిగ, నావీరుం డోర్వలేక ♦ యసురులనలవన్
బావనమతులన్ మునులన్, వేవిధముల బాధపఱచి ♦ విహరించెడిఁ జూ!. ౧౬

సీ. అరయ జుగుప్సిత ♦ మగురీతి నొప్పారి భయదంబులై విరూ♦పంబులగుచు
వికృతదృష్టులు గల్గి ♦ వివిధరీతుల నొప్పు తమరూపములఁ జూపి ♦ తత్తఱిల్ల

గాఁజేయుచున్నారు ♦ క్రవ్యాదులెల్లను మునివరుల యెదుటఁ ♦ గనఁబడుచును
వారికొందఱతి వశు♦భ పదార్థములయందుఁ బడవైచి కొందఱఁ ♦ బట్టి చంపి

తే. యిట్లు బాధించుచున్నా ర♦హితమతులగు
దనుజు లోకకొందఱాశ్రమ♦స్థలములందు
దాఁగి తారుండి యందున్న ♦ తాపసులను
జంపి క్రీడించుచున్నారు ♦ సరసగతుల. ౧౬ 3819

క. సురలకు హోమముచేసెడు, తరుణంబున స్రుక్కు మొదలు ♦ దగువస్తువులన్
గరువమునఁ బాఱవైచుచు, హిరణ్యరేతసుని నీట ♦ నెలమి నడఁచుచున్. ౧౬॥

క. కలశంబులనున్ భిన్నం,బులుగా నొనరించి స్వేచ్ఛఁ ♦ బోవుదు రెటకో
కలఁగుచుమునులాదుష్టా,త్ములుమెలఁగెడునాశ్రమములఁ♦దొలఁగఁదలఁచుచున్.

క. ఇతరాశ్రమగమనంబే, హితమని పురికొల్పువార♦లెల్లరు నన్నున్
క్షితిపతనూజా! యాదు,ష్టతతి యిఁకన్ మేఱమీఱి ♦ నాధుతనువులన్. ౧౮

క. రామా! హింసింపంగల, రీమాడ్కిని నిందు బాధ♦లెల్లఁ గలుగుటన్
మేమెల్లర మీయాశ్రమ, సీమన్ విడిచెదము నిజము ♦ శీఘ్రము మఱియున్.

క. ఫలమూలముల సమృద్ధిం, గలిగి విచిత్రంబునగుచుఁ ♦ గ్రాలు వనము భా
సిలు బహుదూరంబున నం,దలరున్ మాపూర్వమైన ♦ యాశ్రమ మనఘా!. ౨౦

క. నే నీ మునిగణములతోఁ, జోనెంచితి నీవు నుండఁ♦బోల దిచటఁ బెం
పూని వసించిన నీకున్, దానవుఁ డెవ్వాఁడు కీడుఁ ♦ దలఁచున్ జేయన్. ౨౦॥

క. మనసు గలదేని మాతోఁ, జనుదెమ్మా, కడలి వేగ ♦ సంరక్షణమం
దును శక్తిగలిగి యుందువ,యిన దారను గూడి యుంట♦నెప్పుడు మదిలోన్.

క. ముందేమి గలుగునోయను, సందేహము గలుగుచుండు ♦ సర్వగతులచే
నిందుంట దుఃఖహేతు వ,గుం దగ దని పల్కి మాని ♦ కువలయపతియున్.

సీ. ఆశ్రమాంతరమున ♦ కరుగ నున్నట్టి యా కులపతి కే నిటఁ ♦ గలుగ మీకు
భయమేల యని యెన్ని♦పల్కులు పల్కియు నిలువరింపంగను ♦ నేరఁడయ్యె;
నాతండునున్; రాము ♦ నపుడభినందించుచున్ సమాధానంబు♦లన్ సమస్త
గతుల వచించుచు ♦ నతనిచే సెలవు గైకొని మునులను గూడి ♦ వనముదాని

తే. విడిచిపోయెను; రాముఁడా ♦ విమలమతుల
వెనుకొనుచుఁ గొంతదూరంబు ♦ చనుచు వారి
నాగనంపి కులపతికి ♦ సరగ మ్రొక్కి
తదుపదిష్టవిషయములఁ ♦ దగ గ్రహించి. ౨౮॥ 3828

తే. సెలవు గైకొని యంతటఁ ♦ జిత్రమైన
పర్ణశాలకుఁ దా వసిం♦పంగఁ బోయి
యందు నమ్మౌనివరులు లే♦నందున జవ
ముగ నె విడువంగ నద్దియుఁ ♦ దగినదైన. ౨౯ 3829

క. మునులపయిం గల మోదం, బున క్షణమాత్రంబు విడువఁ ♦ బూనక యుండెన్
మునివలె రాముఁడు చరియిం,చిన చర్యలఁ జూచి యంత ♦ సిద్ధమునులకున్.
తే. గుణము లవ్వియె యాత్మలఁ ♦ గూడియుంట
నతనినే యనువర్తించి ♦ యలరుచుండి;
రట్లు గావున వారుఁ ద♦దాశ్రమంబు
క్షణము విడనాడి పోవంగఁ ♦ జాలరైరి. ౨౬ 3831

నూటపదునాఱవ సర్గము సంపూర్ణము.

## ౧౧౭ - వ సర్గము.

—రాముఁ డత్రిముని యాశ్రమముఁ జేరుట.—

క. మునులందఱు వెళ్లిన వెను,కను రాముం డెంచి పెక్కు ♦ కారణములచే
త నపుడటనుండఁగారా,దని నిశ్చయ మొప్పఁ జేసె ♦ నాత్మం దగఁగన్. ౧
ఆ. ఇందె యుండి భరతు ♦ నెల్ల పౌరుల నాదు
తల్లులను మఱియు ని♦తరులఁ గంటి
వారిఁ గూర్చి సతము ♦ వగచుచునే యుందు
వారిరాక జ్ఞప్తి♦పఱచు వగల. ౨ 3833
చ. భరతుని సైన్య మిచ్చట ని♦వాసము చేసిన కారణంబునన్
గరిహయపంక్తి లద్దులఁ ద♦గం జెడ్డియున్నది పర్ణశాలయు
త్తరుణమునందుఁ గాన నిఁకఁ ♦ దప్పక వేఱొకచోటఁ జేరఁగా
నరుగుదు నంచు నెంచి [1]యచ♦లాత్మజ లక్ష్మణుఁగూడి యేగెఁ దాన్. ౪
ఆ. అమ్మహాయశస్కుఁ ♦ డత్రిమహాముని
యాశ్రమమును జేరి ♦ యమ్మహాత్ము
నకును భక్తి మ్రొక్కి♦నం గని యమ్మౌని
తనయు భంగిని గయి♦కొనియె రాము. ౫ 3835
ఉ. మౌనియు రామచంద్రునకు ♦ మంజుతరాతిథి సత్క్రియాతతిం
దానె యొనర్చి లక్ష్మణునిఁ ♦ దద్దయు భాగ్యసమృద్ధిఁ బొల్చు నా
జానకిఁ బంచివాక్కులను ♦ సంతసిలంగ బహూకరించె సు
జ్ఞాని సమస్తభూతహిత ♦ సంతతమోదయుతుండు గావునన్. ౬ 3836
తే. ధర్మవేత్తయు నౌట వా♦ర్ధకము నొంది
సర్వజనపూజితయునగు ♦ సతి సమీప
మందుఁ జెలువారఁగాఁ బిల్చి ♦ యామె తాను
వారిఁ బ్రియవచనంబుల ♦ గౌరవింప. ౭ 3837

1 అచలాత్మజ=సీత. అచల యనఁగా భూమి.

క. మునివరుఁడు మఱియు సీతం, గని ధర్మాచరిణశీల ♦ కరుణాపతి యీ
యనసూయ తపస్విని సజ్జనపూజిత గాన మ్రొక్కఁ ♦ జను నీ కనియెన్. ౮

సీ. మఱియు నత్తాపసి ♦ మండనుం డాధర్మచారిణియగు పత్ని ♦ సాధుశీలఁ
గూర్చి రాఘవునితోఁ ♦ గోరికనిటు పల్కె ననఘ! యీ యనసూయ ♦ మునుపొకపరి
వత్సరదశకంబు ♦ వర్షమే లేకయె లోకంబు చాలఁగి లో ♦ కంబుఁ గాల్ప
మునులకు ఫలములు ♦ మూలంబుల సృజించి గంగను బ్రవహింపఁ ♦ గలుగునట్లు

తే. చేసె; నయుతాబ్దములు నీమె ♦ సిద్ధిఁ గోర
యుగ్రతపమును గృఛ్రిచాం ♦ ద్రాయణాది
సువ్రతంబులఁ జేసి ఋ ♦ షుల తపము
కైన విఘ్నంబులం బాపె ♦ నాదరమున. ౧౧ 3839

క. మునుపొకపరి సురకార్యం, బునకై త్వరపడుచు నీమె ♦ పూనిక దశసం
ఖ్యనిశల నొకరాత్రిగఁ జే,సెను ఘోరతపస్వినియగు ♦ సిద్ధము రామా!. ౧౪

క. నియమాలంకృతులం దగి,న యువిద యీ దేవినిన్ జ ♦ ననిఁ బోలె మహా
నియతిం బూజింపుము నా,ధు యశంబును గల్గు నీకుఁ ♦ దొలఁగు నశుభముల్.

సీ. ఇతరుల మేలుకై ♦ యెన్నని కర్మము లాచరించుట ననూ ♦ యావిహీన
యగుటచే ననసూయ ♦ యని ఖ్యాతిఁ గాంచెను; సర్వభూతములను ♦ సత్కరింపఁ
దగినది, యశమునఁ ♦ దనరారునది వృద్ధయును గోపవిరహిత ♦ యునయి తనరు
నీమెకు జానకి ♦ యెలమి నమస్కారములఁ జేయుఁగాకని ♦ పలికె నిట్లు;

తే. ముని వచించుచునుండంగ ♦ విని రఘువరుఁ
డట్లె యని ధర్మమెఱిఁగిన ♦ యవనిజాతఁ
గనుచు నుత్తమవాక్యంబు ♦ లను జనకజ
ముని సమీరితవాక్యంబు ♦ వినితివిగద!. ౧౭ 3842

క. కనుకన్ శ్రేయస్సునకై, యనసూయఁ దపస్వినిని ని ♦ యమమునఁ బ్రేమం
బున సేవింపుము యన భూ, తనయయుఁ దనమేలుఁ గోరు ♦ ధవుఁ డిటు పలుకన్.

సీ. విని ధర్మము నెఱింగి ♦ వెలయు నమ్మునిపత్ని కపుడు ప్రదక్షిణ ♦ మాచరించె
నవయవసంధుల ♦ దా బిగిచెడి జరఁ జిక్కి తెల్లనికాంతిఁ ♦ జెలఁగు కేశ
సముదయ మొప్పఁగ ♦ శ్వసనుఁడు సోఁకఁగ నరఁటిచెట్టు వడంకు ♦ నట్లు వణఁకు
చున్న యంగము గల్గి ♦ యొప్పు మహాభాగ కాపతివ్రతకు సా ♦ హ్వయము పలుకు

ఆ. చును నమస్కరించె; ♦ జనకజ మఱియు న,నిందితయగు మౌని ♦ నెలఁత కట్లు
వందనంబుచేసి ♦ పరమప్రమోదంబు, తనరఁ గేలు మోడ్చి ♦ వినయమలర.

క. మీ కారోగ్యమె యనఁగా, నా కాంతయు ధర్మమెఱిఁగి ♦ యతిభాగ్యమునన్
శ్రీ కారితవలెఁ గనంబడు, నా కన్నియఁ జూచి ప్రమద ♦ మలరారంగన్. ౨౦

సీ. ప్రియతమవాక్యము ♦ దయమునఁ జిత్తంబు పొంగఁగాఁ బల్కె భూ ♦ పుత్రి! నీవు
తొలిజనించేసిన ♦ యల్లభాగ్యమునను బాతివ్రత్యధర్మంబుఁ ♦ దెలిసి నడపు

చున్న దానవు; మఱి ♦ యున్నతైశ్వర్యంబు బంధువులను మాన♦వైభవంబు
వదలి కానల నుంపఁ♦బడిన రాముని వెంట వచ్చిన దాన వీ♦భంగిఁ దలఁప
ఆ. నిద్ది నీయస్పృష్ట♦మే యగు; నగరంబు, నందుఁ గాననంబు♦నందు నున్న
నిస్పృహుఁడైనఁ బాప♦నిరతుఁడైనను భర్త, వదల కెలమిఁ జూచు♦వనితలకును.
క. కలుగు మహోత్తమలోకం, బులు; మఱి దుశ్శీలుఁడైన ♦ మునుకొని స్వేచ్ఛం
గలయఁ దిరుగువాఁడైనను, సులలితభాగ్యంబు లేక ♦ స్రుక్కుచు నున్నన్.
ఆ. అశుభమగు స్వభావ ♦ మందినవాఁడైనఁ
బొగడఁదగు స్వభావ♦మునఁ జెలంగు
నతివలకును బతియె ♦ యగుఁ బరదైవత
మిద్ది నిజము సుమ్మి ♦ యెన్నిచూడ. ౨౩॥ 3848
క. జనకసుతా! నేనెటు బం,చినను బతికంటెఁ [1]దపము♦చెల్వైన వ్యయముం
గనకెల్లయెడల రక్షిం,చునట్టి బంధు విల లేఁడు ♦ నూ' మఱియెవఁడున్.
క. మనమున నాకున్ బతిమిం,చినబంధువు కానఁబడఁడు; ♦ క్షితిఁ గామవశం
బును గన్న మనసులం దగి, పెనిమిటులన్ మించి తారె ♦ పెత్తన మలరన్.
క. పరులం గోరుచుఁ ద్రిప్పుచు, తరుణులు దుష్టమతులౌటఁ ♦ దగ నిది సుగుణం
బరయ నిది దోషమంచెఱుఁ,గరు; మన్మథవశత దుష్ట♦కార్యనిరతలై. ౨౫॥
సీ. వర్తించువారల ♦ వంటికాంతలు మఱి యిం దపకీర్తిని ♦ బొంది పరము
నందు భ్రష్టలుగాన♦నతిఘోరనరకంబులందుఁ గూలుదురు, సు♦మ్మిందు మంచి
చెడుగుల నెల్లను ♦ చిత్తంబున నెఱింగినట్టి నీవంటి గు♦ణాభిరామ
లగు నుత్తమవధూటు ♦ లాస్వర్గమున స్వేచ్ఛ విహరించుచుందురు♦విమలధర్మ
తే. ముల నొనర్చిన సత్పురు♦షుల తెఱఁగునఁ
గాన నీవిట్టులే ప్రాణ♦కాంతువెంటఁ
దిరుగు నియమంబు గల్గి ప♦తివ్రతల స
మయమునే గ్రహియించుచు ♦ మమతమీఱ. ౨౮ 3852
క. పెనిమిటితోడన్ ధర్మం,బునె చేయుచునుండు మింకఁ ♦ బొలఁతి! దానన్
వినుతయశంబును ధర్మం,బును గల్గు నటంచుఁ జెప్పె ♦ మునిసతి కరుణన్.

నూటపదునేడవ సర్గము సంపూర్ణము.

## ౧౧౮ - వ సర్గము.

సీత యనసూయతోఁ బాతివ్రత్యధర్మములఁ గూర్చి ముచ్చటించుట.

క. అనసూయ యిట్లు చెప్పిన, విని సీత యసూయ లేని ♦ విమలమతిమ్మె గా
వున దానినెల్ల గుణముగఁ, దనమది గ్రహియించి యామె♦దమిఁ బూజించెన్.

1 దపముచెల్వైనన్—తపస్సువలె.

క. మృదుతమవాక్యమ్ముల నా, సుదతింగని యిట్టులనియె ♦ శుభమతియుక్ భూ
తదయయుఁ గల్గిననీవిటు, మదినెన్ని వచించినట్టి ♦ మాటలఁ దలఁపన్. ౧౫

క. అచ్చెరువు గాదు క్షితిలో, సచ్చరితము గల్గుస్త్రీకి ♦ స్వామియె గురువై
హెచ్చుగు నందటిలోనని, [1]యిచ్చ నెఱుంగుదును మునుపె ♦ యేనుం దల్లీ!.

సీ. ఆర్యా! తలంప నా♦యధిపుఁడు సద్వృత్తి విడిచినవాఁడైనఁ ♦ గడఁగి నేను
మంచిచెడ్డల మది ♦ నెంచక యాతని కుపచారములఁ జేయ ♦ నుత్సహింప
వలసిన దాననే; ♦ యలఘుగుణంబుల శ్లాఘింపఁదగి కృపా♦శాలి, సిర్జి
తేంద్రియుఁడునునయి ♦ యెపుడు నాపై సుస్థిరానురాగము గల్గి♦యాత్మధర్మ

తే. మందె వర్తిలుచుండంగ ♦ [2]ననుఁగుఁ దల్లి
దండ్రులవలెన్ బ్రియంబునఁ ♦ దగఁ జరించు
భర్తసేవించుటకుఁ జెప్ప♦వలయునే; మ
హాబలుండగు రాఘవుఁ ♦ డంబయందు. ౮ 3857

క. ఏరీతిన్ వర్తించునొ, యారీతిగ నితరజనను♦లందుం గృపచె
ల్వారఁగ వర్తించును నా, భూరమణునియందుఁ బ్రేమఁ♦బూనియెయుండున్.

క. కనుకన్ ధర్మజ్ఞుఁడు నా, పెనిమిటి లోకములకెల్ల ♦ వీరుండు సుమీ
[3]జనకుం డోకమా తెన్నవ్వ తెఁ, గను నామె నితండు తల్లి♦కరణిం గొలుచున్.

[4]ఉ. అంతియెకాని యీమెకెటు ♦ లర్చనముల్ పొనరించుటంచుఁ దా
నుంతయు నెంచఁ; డీవనియు ♦ ఘోరభయంకరమై జనౌఘ మా
వంతయు లేకయుండిన మ♦హాత్ముని భర్తనుగూడి నేను రా
నెంతయు వేడ్క నత్త యపు♦డెన్నియొ చెప్పెను సాధ్వీధర్మముల్. ౭ 3860

క. దానిన్ వదలకయుంచిన, దానన్ పదిలోనఁ బెండ్లి ♦ తరుణమున [5]బృహ
ద్భానుని సన్నిధి మునుపే, నేనున్ నాతల్లిచేత ♦ నేర్పఁబడితిఁ జూ!. ౭౧ 3861

తే. అట్టి ధర్మంబులన్ మది♦యందు నుంచి
యున్నదానను, మీరిప్పు ♦ డూసిచెప్పి
నందునన్ ధర్మచారిణీ! ♦ యద్ది నాకు
నంతయుం గ్రొత్తగాఁ జేసి♦నట్టులయ్యె. ౮౪ 3862

క. వనితకుఁ బతిసేవను మించిన తపము మఱేది లేదు ♦ సిద్ధము. తనభ

---

1 విదితం తు మమా ప్యేతద్యథా నార్యాః పతి గ్గురుః-అని మూలము. మునుపె అనునది "విదితంతు" అనుదానినుండి స్పష్టమగునని గ్రహింపఁదగు. 2 స్థిరానురాగో ధర్మాత్మా మాతృవ త్పితృవ త్ప్రియః-అని మూలము. 3 సకృద్దృష్టా స్వపి స్త్రీషు నృపేణ నృపవత్సలః, మాతృవ ద్వర్తతే వీరః అని మూలము. దీనిచే శ్రీరాముని సద్గుణములు స్తుత్యములనుట వ్యక్తము. 4 మాన ముత్సృజ్య ధర్మవిత్-అను మూలార్థమే యీపద్యప్రథమపాదమునఁ జెప్పఁబడినది. 5 బృహద్భానునిసన్నిధిన్=అగ్నిహోత్రునియెదుట.

ర్తను సేవల నలరించితివొ, కనియొక్క సావిత్రి దివిని ♦ ఖ్యాతిని మిగులన్. ౯౪

క. నీవును దత్పద్ధతిఁ బతి, సేవలఁ గావించుటనె వి♦చిత్రముగా నా
దేవనివాసము చేరం, బోవంగల వధికధర్మ♦బుద్ధివి గానన్. ౧౦ 3864

క. వనితలలో నుత్తమయని, తనరెడు [1]రోహిణియు సురప♦థంబున శీతాం
శునిఁ బ్రియు నొక్కముహూర్తం,బును విడిచి కనంగఁబడదు♦పూజ్యమనీషా!.

క. విను దృఢపాతివ్రత్యం, బును బాయక యాచరించి ♦ పుణ్యంబులుగాఁ
దనరెడు కర్మబలంబున, వనితామణు లలరుచున్న♦వారు సురపురిన్. ౧౨

చ. అని పలుకంగ నత్రిముని♦కంగన యప్పలు కాలకించి నె
మ్మనమున సంతసంబు పొడ♦మన్ జనకాత్మజ మస్తకంబు మూ
ర్కొని ముదమందఁ జేసి రస♦గుంభితవాక్కుల నోశుచిస్మితా!
యని తగఁ బిల్చి యిట్లనియె ♦ నమ్రముఖైన [2]నియామపంక్తులన్. ౧౩ 3867

క. ఒనరించి సంపాదించిన, ఘనతపము చెలంగు నాకుఁ ♦ గాంతామణిరో
విను దాన నీవు గోరిన, మనోరథముఁ దీర్పనేర్తు ♦ మనలక నేనున్. ౧౪

క. వరమేదేఁ గోరుము యని, కరమనురాగమున నిన్నుఁ ♦ గాంక్షించెద భూ
వరపుత్రి! నీదు వాక్యము, కరఁగు మనోహరమును, నుప♦పన్నము నగుచున్.

క. మనమెంతో సంతోషంబునఁ, గనరారెన్ సీత! నీకుఁ ♦ దగిన వ దేదో
వినిపింపు మేను జేయుం,గ సన్నిహితమని పల్కఁ♦గా భూసుతయున్. ౧౬

సీ. అనసూయ మాటలు♦విని యచ్చెరువుఁ బొంది చిఱునవ్వు మోమునఁ♦జిందులాడ
సత్తపోబలమున ♦ జగదేకవిఖ్యాతిఁ గాంచిన యామెను ♦ గాంచి పల్కె
నీమాటలే చాలనే ♦ యెల్లకార్యంబులు చేసినట్లయ్యె నా♦చిత్తమెల్ల
సంతసంబాయె నని జన♦కాత్మజ పల్కఁగ ధర్మజ్ఞురాలగు ♦ తపసి భార్య

ఆ. మిగుల మోదమంది ♦ మిక్కిలి ప్రీతి నీ, యందుఁ గలిగె నాకు ♦ నట్టి ప్రీతి
సఫలముగ నొనర్పఁ ♦ జను నిదిగో దివ్య, వస్త్రమాల్యముఖ్య♦వస్తువితతి.

క. ఇదిగో యాభరణవ్రజ, మిదిగో కుంకుమము స్వచ్ఛ♦మృదుచందన మి
య్యదిగో యను లేపనమున్, ముదితా! నేనిచ్చు నీయు♦మూల్యసుమాదుల్.

తే. నీదు దేహంబునకును వ♦న్నెలను గూర్చు
చుండు నీకివ్వియుం దగి♦యుండు; వన్నె
పాయ కెప్పుడు నూతన♦భంగి వెలయు
చుండుఁ గావున గ్రహియింపు ♦ మో వధూటి. ౧౯ 3873

---

[1] రోహిణీ నవినా చంద్ర మ్ముహూర్తమపి దృశ్యతే-అనిమూలము. రోహిణి చంద్రునివదలి యొకముహూర్తమైన నుండదనుటచే దృఢానురాగము గలదని గ్రహింపఁదగునే కాని యెడఁ బాయకుండుట సంగతముకదా యని ప్రశ్నింపరాదు. 2 నియామమ్ము=నియమము.

సీ. జానకీ! విను దివ్య♦మైన యీయంగరాగముఁ బూసికొని రమా♦కాంత యవ్య
యుండగు నప్పంక♦జోదరునకుఁ బ్రీతిఁ గలిగించునట్లు నీ♦కాంతునకును
గమ్రమోదంబును ♦ గల్గింపఁగలవని పలికె; నివ్విధిఁ బ్రీతి ♦ యలరనియ్యఁ
బడినట్టి యుత్తమ♦వస్త్రాంగరాగభూషణసునుమాలికా ♦ సముదయంబుఁ

తే. గైకొనియె సీత లోకవి♦ఖ్యాత; యిట్టు
లవ్వి గ్రహియించి యదట నె♦ యంజలిని ద
గంగఁ బట్టి తపస్వినిఁ ♦ గరముభక్తిఁ
గొలుచుచుండెను మదిలోని ♦ కోర్కు లలర. ౨౨ 3874

క. అనసూయ దృఢవ్రతయా, జనకజ తన్నిట్లు కొలువ ♦ సంతసమున నా
మెను జూచుచుఁ బ్రియగాథల, మనములరఁగఁ జెప్ప నెంచి♦మందస్మృదూక్తిన్.

క. పలుకం జొచ్చెను; ఖ్యాతిం, జెలఁగెడు శ్రీరామమూర్తి ♦ చెందిన వేడ్కన్
లలనా! స్వయంవరంబున, వెలయ న్నినుఁ గొనియెఁ గాదె? ♦ వింటిని దీనిన్.

క. దాని సవిస్తరముగ వినఁ,గా నేఁ గోరెదను జక్కఁ♦గా నున్నది య
ట్లే నాకుఁ జెప్పవలయును, జానకి! నీవనిన ధర్మ♦చారిణి నామెన్. ౨౪ 3877

క. ఈరీతిఁ బల్కు సాధ్విని, శ్రీరాముని దేవి, చూచి ♦ చెప్పె నిటుల; నో
చారుచరిత్రా! వినుమా!, వీరుఁడు మిథిలాధిపుండు ♦ వెలయు ధరిత్రిన్. ౨౫

క. జనకాహ్వయమున నాతఁడు, తనరును ధర్మజ్ఞుఁడగుచుఁ ♦ దనధర్మమునం
దు నభిరతుఁ డౌచు న్యాయం,బున భూతల మేలుచుండె ♦ బుధజను లలరన్.

సీ. నరపతి యాతండు ♦ [1]నాఁగలిఁ గైఁబూని యజ్ఞోపయుక్తమై ♦ యమరు నవని
మండలంబును దున్ను♦చుండఁగఁ బుడమిని బెకలించుకొని నేను♦ వెడలివచ్చి
యతనికిఁ బుత్రిక ♦ నైతిని, మంత్రముల్ పలుకుచు యజ్ఞంబు♦సలుపు నతఁడు
[2]పదునాల్గు పిడికి ళ్ల♦వనినోషధుల విత్తవలయును గాన న♦ప్పని నొనర్చు

తే. నతఁడు తనువున దుమ్మెల్ల ♦ నావరింపఁ
గనఁబడినయట్టి నన్నును ♦ గాంచి మిగుల
నచ్చెరువునొంది సంతతి ♦ యంతకుమును
లేనివాఁడౌట స్నేహంబు♦చే నతండు. ౨౮ 3880

---

1 తస్యలాంగలిహస్తస్య-అనిమూలము. 2 నరపతి ర్ముష్టివిక్షేప తత్పరః-అనిమూలము. 'యా జాతా ఓషధయఇతి చతుర్దశభి రోషధీ ర్వపతీతి' అనివ్యాఖ్య.

క. నను నంకంబున నిడుకొని, తనకూఁతురటంచు ననుచుఁ ♦ దద్దయు స్నేహం
బును నాపై నెలకొల్పె; గ,గనమునఁ దులలేని పలుకొ♦కటి విననయ్యెన్. ౩౦

తే. అది యమానుషమై యొప్పి ♦ "యవనినాథ !
యిద్ది సత్యమె యయి తగు ♦ సీమె ధర్మ
మున భవత్పుత్రికయె యగు" ♦ ననుచుఁ బలికె
నట్టు లయ్యెను; ధర్మజ్ఞుఁ♦డైన యతఁడు. ౩౧ 3882

చ. మనమున నంత సంతసిలి ♦ మన్నన మీఱఁగ నన్నుఁ బ్రీతిఁ జే
కొని పరమాభివృద్ధిఁగని ♦ క్షోణివిభుం డురుపుణ్యకర్మని
ష్ఠను దగునాతఁ డాదృతి వె♦సం గొనిపోయి స్వదేవి కిచ్చె నా
వనితయు సంతతింగనఁగ ♦ వాంఛను బూనివదాట నన్నునున్. ౩౨ 3883

చ. జననివిధంబునన్ మిగుల ♦ సౌహృదమొప్పఁగఁ బెంచుచుండె; భ
ర్తను గనకుండ వేఱొకవి♦ధంబునఁ దీర్పఁగరాని నిందయా
వనము మదీయ దేహమున ♦ భాసిలుటంగని చాలదీనుఁడై
ధనము చనంగ నిస్వనివి♦ధంబున నాజనకుండు చింతిలెన్. ౩౩ 3884

తే. [1]కన్యకం గన్న తండ్రి లో♦కమున నమరి
పతిసముండైనను సరి♦వారిఁగొనఁ
గరము నీచులలోఁ దిర♦స్కార మొందు
జనకుఁ డంతటిదా తిర♦స్కార మపుడు. ౩౪ 3885

క. తనకిఁకఁ బ్వరలో గాఁగల, నని యెఱిఁగి విచారభీక♦రార్ణవమున నె
మ్మనము మునుఁగంగ [2]విప్లవ,మనుజుఁడు దరిఁ జేరలేని♦మాడ్కిన్ మిగులన్.

క. చింతానాగరపారము, నుంతయుఁ గనఁజాలఁ డయ్యె ♦ క్షోణీశుండున్
స్వాంతమున నయోనిజయగు, కాంతఁగ నను నెఱిఁగియెన్ని♦గతులఁదలఁచినన్.

క. [3]అనురూపుఁడు తుల్యుఁడునగు, పెనిమిటి నాకుం దగంగఁ ♦ బృధివీస్థలిలోఁ
గనుఁగొనఁ జాలండయ్యెను, మనమున నిటు లెంచుచున్న ♦ మతిమంతుఁడగున్.

సీ. అతనికిఁ దనప్రియ♦సుతకు స్వయంవరము జరపవలయునన్ ♦ బుద్ధి పొడమె;

---

1 సదృశా చ్చాపకృష్టాచ్చ లోకే కన్యాపితా జనాత్, ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి-అనిమూలము. 2 విప్లవమనుజుఁడు=తెప్పలేనివరుఁడు. 3 సదృశం చానురూపంచ-అని మూలము.

మును మహాయజ్ఞంబు♦నను దేవవరులచేఁ బరికొల్పఁగాఁబడి♦వరుణుఁ డెలమి
జనకున కుత్తము♦ధనువు, నక్షయబాణములు గల్గు తూణీర♦ముల నొసంగి
యుండె; నాధనువు మ♦హోద్దండమై భారమై యుంట నరమాత్రు♦లధికకష్ట

తే. మునఁ బ్రయత్నించినన్, గద♦ల్పను నశక్తు
లగుదు రట్లాట నరపతు♦లట్టి ధనువు
వంపఁజాలరు తారు స్వ♦ప్నములనైన;
నంత బుతవాదియగు నాదు ♦ ననుఁగుఁజంత్రి. ౪౦ 3889

క. ధరణీశులఁ బిలిపించెన్, ధరాధిపులు రాఁగ సభను ♦ దా వారలకున్
హరుచాపముఁ గనఁబఱచుచు, శరాసనము దీనినెత్తి ♦ జ్యాలత నరిగాన్. ౪౧

తే. ఎవఁడు కూర్చునో యతనికి ♦ నింతియగును
నాదుపుత్రి నిజంబని ♦ నాజనకుఁడు
పలికె; గౌరవమునఁ గొంచ♦వలెఁ జెలంగు
దాని నెత్తఁగనే లేక ♦ [1]దండములిడి. ౪౨ 3891

క. జనపతులంతఱు దీనతఁ, జనఁగాఁ దర్వాత సాధ్వి ♦ చాల శరత్తుల్
చనఁగా ద్యుతిమంతుం డీ, యినకులుఁ డీ సత్యశౌర్యుఁ ♦ డీ రాఘవుఁడున్.

క. చనుదెంచెను విశ్వామిత్రునిఁ గూడి సుమిత్రకొడుకు♦తోడను యజ్ఞం
బును జూడ, ధర్మవిదుఁడగు, మునిపతిఁ గౌశికునిఁ దండ్రి♦మోదముచెలఁగన్.

క. అలరించె యథావిధిఁ బూజల నంతటఁ గౌశికుండు ♦ జనకునిఁ గనుచుం
బలికె సహోదరులై ద్యుతి, నలరెడు వీరిద్ద ఱవ్వ♦రని తలఁచెదవో. ౪౫

సీ. దశరథునకుఁ బ్రియ♦తనయులు రామలక్ష్మణులనఁ బ్రఖ్యాతిఁ ♦ గాంచువారు
త్వద్వశంబుననున్న ♦ ధనువును గనఁగోరుచున్నారు గాన నీ♦వుకృపమున
దైవికంబగునట్టి ♦ దాని నీరామునకును జూపుమని పల్కె ♦ మునిపతి యిటు
పల్కినఁ నద్ధను♦ర్వరమును దెప్పించె జనకుఁ; డంతట వీర్య♦మునఁ జెలంగుఁ

తే. గాన రాఘవుఁ డాకనారి ♦ కన్నుఁ దెఱచు
నంతలో సారమునఁ దగు♦నట్టి ధనువు
వంచి నారిని మోపెట్టి ♦ బలిమి మీఱ
వేగ పూరించె నెల్లరు ♦ వింతనొంద. ౪౬ 3895

---

1 అభివాద్య నృపాజగ్ముః-అనిమూలము.

క. ఈరీతిఁ శ్రీరాముఁడు, పూరించుచునుండ ధనువు ♦ పొంక మెడలఁ ద
త్సారమున కోర్వఁజాలక, దా రెండుగ విఱిగె నంత ♦ తద్ధ్వని మిగులన్. ౫౧

క. కులిశము పడినట్లుగ భూ, స్థలి నిండెన్, సత్యవాక్ప్రచారుఁడు నా తం
డ్రి లలిన్ నను నీయంగాఁ, దలఁచి జలాపూర్ణకలశ ♦ తల్లజమెత్తెన్. ౫౨

సీ. కలశమెత్తికొనుచు ♦ క్ష్మాపతి నాతండ్రి, నను నీయఁబోవఁగఁ ♦ గని యతండు
తనతండ్రియగు [1]నయో ♦ ధ్యాపతి యాశయమును దెలిసికొనక ♦ మున్నె కాంత
గ్రహియింప ననిపల్కెఁ ♦ గడువేగ మావృద్ధ నామామ దశరథ ♦ నాథునటకుఁ
బిలిపించి యష్టాత్మ ♦ వేత్తయా రామున కిచ్చెను నను బ్రీతి, ♦ నింతెకాక

తే. సాధ్వి నా త్మీయ నాసహ ♦ జాత సుప్రి
యాభివర్ధన లక్ష్మణు ♦ నతివ గాఁగ
నిచ్చె నాస్వయంవరమున ♦ నిట్లు నేను
రాముసకు నీయఁబడితి నో ♦ రాజవదన'. ౫౩ 3398

క. ఘనశౌర్యంబును గల్గిన, జనసంతతి మేటియైన ♦ సనసుతిని భ
ర్తను నేను బ్రేమమీఱం, గను ధర్మము రీతిఁ గొల్వఁ ♦ గల్గితిఁ నన్లే'. ౫౪

సాటిపడు నెనిమిదివంద నిర్గము సంపూర్ణము.

౧౧౯ - వ సర్గము.

[illegible]

క. అన ధర్మవేత్తయు తగు, ననసూయయు గొప్పదై ♦ యాకథనెల్లన్
వినుచున్ శీర్షము మూర్కొని, జనకజఁ దమిఁ గౌఁగలించె ♦ నాథుకరములన్

క. అమలాక్షరపదముల స్పష్టములుగ నచ్చెరువు గొలుపఁ ♦ జాలి మృదువుగా
నమరం బల్కితి; వుద్వాహమునాఁటి చరిత్ర మేను ♦ నంతయు వింటిన్.

తే. లలితభాషిణి! నీకథ ♦ వలన నాకు, నధికసంతోష మేపారె ♦ నాత్మఁ గేళిఁ
దేలినట్లయ్యె సూర్యుండు ♦ తేజరిల్లు, చుండి రాతిరి చెంత రా ♦ నుంటఁ జేసి.

సీ. అస్తమించెను; బక్షు ♦ లాహారమును గోరి పగలెల్లఁ దిరిగి యా ♦ భానుఁ డస్త

2 అవిజ్ఞాయ పితు శ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః-అనిమూలము.

మించెడు తటి నిదు♦రించుటకై భూరుహములందు దాఁగి ర♦వములఁ జేయు
జాడవినంబడు; ♦ సాయంసమయమున నిదిగో యీమాసీంద్రు♦లెల్ల నీట
మునిఁగి యంభఃపూర్ణ♦ములగు కలశముల గ్రహియించి నారచీ♦రలును నీటఁ

తే. దడిసి యుండంగ గుంపుగఁ ♦ దరలివచ్చు
చున్నవారలు; మఱికొంద ♦ ఱుద్యమమున
నగ్నుల యథావిధిగ వేల్వ ♦ నందుఁ బావు
రము గళముభంగి నరుణధూ♦మము చెలంగె. ౮౪ 3903

క. అనిలోద్ధతమై పైకిం, జనుచున్నది; దిక్కులెల్ల ♦ స్పష్టముగాఁగం
గనఁబడకున్నవి కావున, [1]ననోకహములెల్లఁ [2]గొలఁది ♦ యాకులతోడన్. ౮౫

చ. తనరెడు నట్టివైన నిట ♦ దాపుననైతము పర్ణసంచయం
బు నడిమిభాగముల్ గనఁగఁ ♦ బోలనివౌటను సాంద్రరీతులై
గనఁబడుచున్న; వెల్లెడలఁ ♦ గ్రందుగ రాక్షసులున్ పిశాచముల్
వనిఁ జరియించుచున్నవిదె ♦ వచ్చెను రాతిరి మెల్లమెల్లఁగన్. ౮౬ 3905

తే. ఇత్తపోవనమునఁ గల్గు ♦ నెల్ల మృగము
లవిగో వేదులుగల రేవు♦లందుఁ బండి
యున్నవో జానకీ! [3]యుడు♦వ్యూహయుతము
గాఁగ రాత్రియు వచ్చెను ♦ గంటె యిపుడు. ౮౭ 3906

క. సురపథమునఁ జంద్రికచేఁ, బరివృతుఁడయి శీతరశ్మి ♦ పండువుగా ని
త్తరుణమునఁ గానఁబడియెడిఁ, దరుణీ! పతిఁ బాడియుండఁ ♦ దగు నీవింకన్.

క. చనుమా! పతియొద్దకు నే, ననుమతి నిచ్చెదను నాకు ♦ నతిమధురముగాఁ
గను నీకథఁ జెప్పఁగ నా, మనమున సంతోష మలరె ♦ మానిని! మిగులన్.

సీ. నేఁ జూచుచుండంగ ♦ నీవు భూషణములఁ దాల్పుమా! దివ్యమై♦తనరుభూష
ణముల నీవలరఁ గ♦నంగఁ జాలిన భాగ్యమును గలిగింపుమా'♦యనిన దేవ
కన్యవలెన్ వెల్గు♦కామిని యట్లులే చక్కఁగా భూషణ♦సమితిఁ దాల్చి
యాయనసూయకు♦నభివాదనముఁ జేసి పతియొద్దకుంబోయె ♦ వాగ్విశార

1 అనోకహములు=వృక్షములు. 2 అల్పపర్ణాహితరక్ష-అనిముఖము. 3 ఉడువ్యూహము=నక్షత్రములగుంపు.

ఆ. దొలకు మేటియగుచు ♦ వెలయు రాముం డట్లు
సకలభూషణములఁ ♦ జానవెలసి
వచ్చియున్నఁజూచి ♦ వరమునిసతి యిడీ
నట్టి ప్రీతికెంతో ♦ హర్షమందె. ౧౩ 3909

క. పరుస వసనూయ దివ్యాం, బరభూషణమాల్యవితతిఁ ♦ బరఁగు ప్రమోదం
బు రహిన్ గన్పడ నొసఁగుట, ధరణీశున కెఱుఁగఁ జెప్పెఁ♦దా జానకియున్.

క. తనవృత్తాంతము నిటు చెప్పిన మనుజాలభ్య మగుచు ♦ వెలసెడు లాభం
బును సత్కారాకృతినిం, దనసతి పొందుటకు రామ♦ధరణిపుఁ డలరెన్. ౧౫

సీ. మఱి మహారిపుఁడు ల♦క్ష్మణుఁడును మోదంబు నందె; శీతాంశుని♦భాసనుండు
రఘువరుఁ డంతట ♦ రాజత్తపస్సిద్ధి సంపన్నులగు ముని♦సత్తము లటఁ
దన్నుఁ బూజింప ము♦దంబున వెలయుచుఁ బావన నిశదానిఁ ♦ బర్ణశాల
యందుఁబుచ్చెను; నాత్రి♦యూనుయుగడువంగ స్నాతులై హోమాది♦సకలకార్య
తే. వితతి మానులు తమి జర♦పిన యనంత
రమున లక్ష్మణుతోఁగూడి ♦ రాముఁ డరిగి
వారితోఁ "బోయివచ్చెద ♦ మీారనుగ్ర
హమ్ము నునుపుఁడి" యని వేఁడె ♦ సధికభక్తి. ౧౭ 3912

క. వనచరులు ధర్మమార్గం, బున నడచెడువారునైన ♦ మునులారాముం
గని యావనగమనంబున, దనుజుల బాధలను జెప్పెఁ♦దలఁచి ప్రియమునన్.

చ. పలికిరి సాధుచిత్త! రఘు♦వర్య! మహావనమందు నిచ్చటన్
బలుతెగలై మనుష్యులను ♦ భక్షణ మొప్పఁగఁజేయుచున్ భయం
బులఁ గలిగించురూపములఁ♦ బొల్చిన రాక్షసులున్న వార్తలి
మ్ముల రుధిరాశనంబులుగఁ ♦ బొల్చెడు క్రూరమృగాదు లొప్పెడున్. ౧౯

సీ. ఈవనంబునయందు ♦ నెల్లెడ రాక్షసుల్ చేరి ధర్మమ్మును ♦ జేయుమానూ
లుచ్ఛిష్టులుగ నెట్లొ♦యుండు నప్పుడుగాని, కడుఁ బ్రమాదంపడి♦గానియుండఁ
బట్టి భక్షింతురు; ♦ వారి వారించుట తగు నీకు మానులు ♦ తమకుపలయు
ఫలమూలముల వన్య♦ములఁ దెచ్చుకొనుటకుఁ జనివచ్చు త్రోవయి♦దనఘ సీత
తే. దుర్గమారణ్యసీమ నీ♦త్రోవఁ బట్టి
యే ప్రవేశింపుమా యని ♦ యెంతొవినఁ

మలరఁ బ్రార్థించి దీవింప ♦ నావరంత
పుడగు రాముండు వానిని ♦ బొంది యపుడు. ౭౦౪ 3915

క. అనుజునితో జానకితో, ఘనమండల మలరఁ దీక్ష్ణ♦కరుఁడు ప్రవేశిం
చునటుల దండకవనమును, మునులలరఁగఁజొచ్చెనుదిఁబ్ర♦మోదము పొదలన్.

నూటపందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

ఆశ్వాసాంతము.

చ. సరసిజపత్రనేత్ర! ముని♦సంతతిసన్నుతిపాత్ర! కౌశికా
ధ్వరపరిరక్షణాదర వి♦భంజితదుర్జనమిత్రదానవో
త్కర కరుణాభిపాలితని♦కామసదాచరణప్రవీణ ని
ర్జరసముదాయ సాధుజన♦సన్నుత సద్గుణగేయ! రాఘవా!.

సీ. ఇది మహీసురకుల♦విదితకాశ్యపమౌని గోత్రజాపస్తంబ♦సూత్ర శ్రీత్రి
పురసుందరీవర♦కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ,♦ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధి♦చంద్రసుబ్రహ్మణ్య విబుధవర్యసుపుత్ర, ♦ వినుతిపాత్ర
పండితగురుభక్త♦తాండవకృష్ణాపరాభిధేయార్యజ♦నాళిభజన

తే. నిరతశేషాద్రిశర్మప్ర♦ణీతమైన
యాంధ్రరామాయణంబున ♦ నమితపరము
లొసఁగి యమృతాప్తిఁ గూర్చు న♦యోధ్యకాండ
మవని నాచంద్రరవితార♦మై చెలంగు.

అయోధ్యాకాండము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.